

# PHILIPS

# ఆనందాల దీపావళి

ఆఫర్






GC1905



GC1920



GC1930



GC1960







## ఒకే స్ట్రోక్‌తో పెర్ఫెక్ట్ ఇస్త్రీ పొందండి!

ఈ దీపావళికి ఫిలిప్స్ అందచేస్తున్నారు రెండు ప్రత్యేక లిమిటెడ్ ఎడిషన్ ఐరన్స్. అంతేకాదు స్టీం ఐరన్ యొక్క ప్రతి కొనుగోలుపై 2 కంఫర్ట్ ఫ్యాబ్రిక్ కండిషనర్స్ 200 మిలీ బాటిల్స్, మరియు 1 సర్ఫ్ ఎక్సెల్ క్విక్‌వాష్ 200 గ్రామ్స్ ప్యాక్ గల ఫ్రీ గిఫ్ట్ హ్యాంపర్ కూడా పొందండి. అంటే మీకు లభించేది కేవలం ఒక పర్ఫెక్ట్ ఐరనింగ్ మాత్రమే కాదు, 14 రోజుల తాజాదనం# ఒకేసారిగా అనమాట.
అధిక వివరాలకై లాగ్ ఆన్ చేసుకోండి www.philips.co.in లేదా కాల్ చేయండి: 1800-102-2929.

*ఆఫర్ కేవలం 15 నవంబర్ 2012 వరకూ లేదా సరుకు ఉన్నంత వరకే అమలు. 1 యూనిట్ సర్ఫ్ ఎక్సెల్ క్విక్‌వాష్ 200 గ్రా మరియు 2 యూనిట్స్ కంఫర్ట్ ఫ్యాబ్రిక్ కండిషనర్ 200 మిలీ మొత్తం MRP ₹114
**ఆఫర్ కొన్ని ఎంపికైన ఐరన్ మోడల్స్‌పై మాత్రమే.
#కంఫర్ట్‌లో రిన్స్ చేశాక 14 రోజుల వరకూ ఆరిన పొడి బట్టలపై గుబాళిస్తూ ఉంటుంది.

**PHILIPS**
sense and simplicity

Available at all leading electronics and domestic appliance outlets. For more information please call us at 1800 102 2929

2

## బాలల దినోత్సవ ప్రత్యేకం





## కథలు




# తెలుగు వెలుగు

సంపాదకుడు: **రామోజీరావు**

**సంపుటి : 1, సంచిక : 3**

**నవంబర్ 2012**

**పుటలు :** 100, **వెల :** రూ. 20

**పత్రాలంకరణ :** రవిశంకర్

**ముఖచిత్రం :** విరాజిత

**ఫొటో :** ఎజిటి రాజు

**సహకారం :** రామోజీ విజ్ఞానకేంద్రం

**ప్రకటనల కోసం :** +91 80081 51599, +91 90001 80608

**వివరాలకు :** సంపాదకుడు, తెలుగు వెలుగు, రామోజీ ఫిల్మ్‌సిటీ, అనాజ్‌పూర్, రంగారెడ్డి - 501 512.

**ఫోను:** +91 8415 246 999

**మొబైల్:** +91 800 800 1656

**ఫ్యాక్సు:** +91 8415 305 018







**Telugu Velugu**

Owned, Printed, published and Edited by Ramoji Rao on behalf of Ramoji Foundation, Ramoji Film City, Hayathnagar Mandal, Ranga Reddy District, Andhra Pradesh. Printed at Eenadu Press, D.No.7-134/1&2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally, Rangareddy District -500 072. RNI No: APTEL/2012/45352




**విన్నపం:** తెలుగు భాషాభివృద్ధి, పరిరక్షణ, మేధోమథనం 'తెలుగు వెలుగు' ముఖ్య ఆశయాలు. మన భాషకు పుష్టి చేకూర్చే రచనలకు పత్రికలో అగ్రతాంబూలం లభిస్తుంది. ఈ రచనల్లో వెల్లడయ్యేవి రచయితల అభిప్రాయాలు మాత్రమేనని మనవి. ఇవన్నీ పత్రిక యాజమాన్యం, సంపాదకవర్గ అభిప్రాయాలు కానక్కర్లేదు. భిన్న భావజాలాలకు నిష్పక్షపాత వేదికగా ఈ పత్రిక నిలుస్తుంది.

# ఇంటింటా తెలుగు దీపం



ఒరులేయవి యొనరించిన
నవవర! యప్రియము తన మనంబునకగు తా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మ పథములకెల్లన్

ఇతరులు ఏ పనులు చేస్తే నువ్వు బాధపడతావో ఆ పనుల్ని నువ్వు చెయ్యకుండా ఉండటమే అన్నిట్లోకీ మంచి పని అని దీని అర్థం. తిక్కన భారతంలోని పద్యం ఇది. పరమధర్మం ఏది అన్న ధృతరాష్ట్రుని ప్రశ్నకు విదురుడు ఈ పద్యం చెబుతాడు. ఈ పద్యమొక్కటి చాలు... మన తెలుగిళ్లలో ప్రవహించిన వ్యక్తిత్వ వికాస పాఠాలెలాంటివో చెప్పడానికి. ఇలాంటి వందల పద్యాలు, శతకాలు, జాతీయాలు, సామెతలు ఒకప్పుడు చిన్ననాటనే కంఠస్థం చేయించేవారు. వాటిలో ఉన్న విలువలు తెలియకుండానే మనుషుల్లో ఇంకిపోయేవి. అందుకే మనుషులు సహనశీలురుగా ఉండేవారు. సమాజం శాంతియుతంగా ఉండేది. తరతరాలుగా ప్రవహించిన ఈ నీతి వాహిని ఇప్పుడెక్కడ?

అవసరార్థం ఆంగ్ల మాధ్యమంలో చదవాల్సి రావడం తప్పనిసరి కావచ్చు. అంత మాత్రాన మన లోగిళ్లను ఆంగ్లమయం చేసుకోవాల్సిన అవసరం లేదు. ఏం చదివినా, ఎంత చదివినా, మూలాల్ని మరిచిపోకూడదు. నిజమైన విద్య జ్ఞానాన్ని ఇవ్వాలి. కానీ ఆంగ్లంలో మాట్లాడటం ఒక్కటే జ్ఞానానికి, స్థాయికి, ఉన్నతికి చిహ్నంగా భావిస్తున్న దుస్థితి. ఫలితంగా ఏం కోల్పోతున్నామో, మన పిల్లలకు ఏం దూరం చేస్తున్నామో తెలుసుకోవాలి! ఇప్పుడు విశ్వవ్యాప్త ఆదరణ పొందిన ఫేస్‌బుక్‌లో ఆరు కోట్ల పైచిలుకు మంది స్పానిష్ భాషను వాడుతున్నారు. అరబిక్ ఉపయోగిస్తున్నవారూ 35 లక్షల దాకా ఉన్నారు. వీరంతా యువతే. మరి వీరెవరూ వెనకబడిపోలేదే!

తెల్లవాడు దేశాన్ని వదిలి ఆరున్నర దశాబ్దాలు దాటుతున్నా ఆ భాషలో చదువులే ఉపాధికి దిక్కు కావడం ఎంత దౌర్భాగ్యం. ఆంగ్లం లేకపోతే జీవితం లేదన్నట్టుగా భ్రమింపజేయడం మరింత శోచనీయం. మాతృభాషలో అర్థమైనట్టుగా పాఠాలు కానీ మరే విషయాలు కానీ పిల్లలకు అన్య భాషల్లో అర్థం కావని ప్రపంచవ్యాప్తంగా అనేక పరిశోధనలు రుజువు చేస్తూనే ఉన్నాయి. అందుకే మన భాషను పరిపుష్టం చేసుకోవాలి. ఇందుకు తమ హిబ్రూ భాషను, జాతిని శిథిలాల నుంచీ పునర్నిర్మించుకున్న యూదులే మనకు స్ఫూర్తి కావాలి.

ప్రపంచానికే వెలుగును పంచిన తెలుగు భాషను, సంస్కృతిని ముందు తరాలకు తప్పనిసరిగా అందించాలి. సంస్కరణ ఇంటి నుంచే ప్రారంభం కావాలి. మనం చెప్పే ఫోన్ నంబర్లు, ఓకే, రైట్, బై, ఐసీ, లేట్, గుడ్ మార్నింగ్, గుడ్ ఈవినింగ్... ఇలా పదుల కొద్దీ పదాల్ని వాడేస్తుంటాం. పిల్లలూ అవే అనుసరిస్తారు. ఇలాంటి అనవసర ఆంగ్ల పదాల్ని ప్రతి ఒక్కరూ వదిలెయ్యగలిగితే అది సగం తెలుగు విజయం కాదా?

దాంతో పాటు ఇంట్లో తెలుగు పుస్తకాలు, పత్రికలు, బాలసాహిత్యం చదివించాలి. ముఖ్యంగా శతక పద్యాలు. రోజుకొక్క పద్యం నేర్పండి. దాన్ని పిల్లలతో వల్లెవేయించి, వివరణను సొంత మాటల్లోనే చెప్పిస్తే వారికీ బిడియం పోతుంది. భాషపై పట్టువస్తుంది. సృజనాత్మకత పెరుగుతుంది. రచనాశక్తి అలవడుతుంది. ఇవన్నీ వారి మేధపైనా ప్రభావం చూపుతాయి. ఈ పద్ధతిలో మంచి ఫలితాలు సాధిస్తున్నవారున్నారు. ఎక్కడో కాదు... మన తెలుగు రాష్ట్రంలోనే!

తెలుగులో అద్భుతంగా రాయగల రచయితలకు కొదవలేదు. కానీ చాలామంది పిల్లల మీద దృష్టి పెట్టడం లేదెందుకనో. బాలసాహిత్యం అంటే కథలొక్కటే కాదు. శాస్త్ర సాంకేతిక రంగాల్లోని విజ్ఞానాన్ని పిల్లలకు అరటి పండు వలిచి నోటికందించినట్టుగా చెప్పేది కూడా. ఆ రంగంలో నిష్ణాతులై రచనాశక్తి కలిగిన రచయితలూ ఈ విషయంపై దృష్టి పెట్టాలి. తేటతెనుగులో మన పిల్లలకు తమ మేధనందించేందుకు నడుం కట్టాలి. అందుకు అవసరం అయితే కొత్త పదాలనూ సృష్టించాలి. తెలుగులో మాట్లాడుతుంటే అమ్మ, నాన్న, అక్క, అన్న, అమ్మమ్మ, తాతయ్య, ఇరుగు పొరుగు, మన సమాజం, సంస్కృతి గుర్తుంటాయి. లేకపోతే 'మమ్మీ'లే మిగులుతాయి.

పాపం, పుణ్యం, ప్రపంచ మార్గం... కష్టం, సౌఖ్యం, శ్లేషార్థాలు... ఏమీ ఎరుగని పూవుల్లారా!... అందరికీ బాలల దినోత్సవ శుభాకాంక్షలు. దీపావళి తెలుగిళ్లను వెలుగిళ్లుగా మార్చాలని ఆకాంక్షిస్తూ...




భాష ఔన్నత్యాన్ని గుర్తు చేసింది
తెలుగును మరింత వెలుగులోకి తీసుకురావాలనే రామోజీ ఫౌండేషన్ ధ్యేయం పత్రికలో ప్రస్ఫుటించింది. ఏ శబ్దానికైనా అక్షరరూపమివ్వగలిగిన తెలుగు సోయగాలను భావగర్భితంగా ఇచ్చారు. తెలుగు జాతి ఎక్కడున్నా మరొకసారి భాష ఔన్నత్యాన్ని వారికి గుర్తుకు తెస్తుందీ పత్రిక. ఇలాంటి పత్రిక తెలుగు వారున్న అన్ని ప్రాంతాలకూ తప్పనిసరిగా చేరేలా, చర్యలు తీసుకోవాలి.

**- అట్లూరి పూర్ణచంద్రరావు, సినీ నిర్మాత, హైదరాబాదు**

పిల్లలు చదవాలి
రెండో సంచిక చాలా బాగుంది. అందులో కొన్ని వ్యాసాలు 200 కాపీలు నకళ్లు తీసి మా కళాశాలలో ప్రతి విద్యార్థికీ అందించాం. తరువాత మన సంస్కృతి, సంప్రదాయాలపై వ్యాసరచన పోటీ పెట్టి బహుమతులిచ్చాం. పిల్లలు ఈ పత్రికను తప్పకుండా చదవాలి. అలాగైతేనే ముందుతరాలకు భాష అందుతుంది. పిల్లలకు సంబంధించిన అంశాలు కూడా ఇస్తే బాగుంటుంది.

**- డా॥ పి.ఎల్.ఎన్.ప్రసాద్, ఆంధ్ర విద్యార్థివర్ధిని కళాశాల, అధ్యాపకులు, వరంగల్**

కొత్త శీర్షికలు కావాలి
తెలుగులో చాలా వైవిధ్యమైన పదసంపద ఉంది. అనేక మాండలికాలు సుసంపన్నమైన పదజాలాన్ని కలిగి ఉన్నాయి. అన్ని ప్రాంతాల మాండలికాల గురించీ తెలుసుకోవడం సాధ్యపడటం లేదు. కనుక పత్రికలో దానికో ప్రత్యేక శీర్షికను ప్రతి సంచికలోనూ ఇస్తే బాగుంటుంది.

**- కీరా, తమిళ రచయిత, తమిళనాడు**

శుభలక్షణం
శుభలక్షణ పరిపూర్ణై
ఈ భరతావనికి అన్నమిడు తల్లియు తా
నై భాసిలు ఆంధ్ర జనని
నే భక్తిగా మ్రొక్కి నిల్తు నీపాదములన్

**- డా॥ప్రయాగ రామకృష్ణ, విశాఖపట్నం**

మాతృభాషకు మణికిరీటం
దసరా ప్రత్యేక సంచిక కనువిందుగా ఉంది. వ్యాసాలు, కథనాలన్నీ బాగున్నాయి. సాహితీ విలువలు కూడిన మన మాతృభాషకు కిరీటం తెలుగు వెలుగు. అదే విధంగా భాషాభివృద్ధిలో భాగంగా సాహిత్య విలువల్ని తెలిపే నుడికారాలు ప్రతి నెలా ఇవ్వాలి.

**- జె.రాఘవేంద్రరావు, విశాఖపట్నం**

విందారగించినట్లుంది
సంచిక చూడగానే పెరట్లో అరటి చెట్టు నుంచి అప్పుడే తుంచిన ఆకుపై తెలుగింటి పిండి వంటలన్నీ కలిపి వడ్డించినట్టు, నేతి పెసరట్టు, వేడి అన్నంలో తెలుగు ఆవకాయ, కమ్మని కూరలు, గడ్డపెరుగుతో మృష్టాన్న భోజనం కడుపారా తిన్న అనుభూతి కలిగింది.

**- హెచ్.వి.రమణ, రాజాం, శ్రీకాకుళం**

అక్షరాలే శ్రీరామరక్షలు
ప్రచురించిన ప్రతి అంశమూ సాహిత్య విలువలను కాపాడటానికి, మరుగున పడిన మాణిక్యాలను వెలుగులోకి తీసుకురావడానికి చేసిన ప్రయత్నమేనని ప్రస్ఫుటమవుతుంది. ఈ సంచికలో వ్యాసాలన్నీ తెలుగుదనానికి శ్రీరామరక్షలే.

**- డా॥శివభూషణం, కర్నూలు**

## చిన్న కథలకు ఆహ్వానం

రమ్య భారతి సాహిత్య త్రైమాస పత్రిక ఆధ్వర్యంలో 'సోమేపల్లి సాహితీ పురస్కారాలు' ఇస్తున్నట్లు సంపాదకులు చలపాక ప్రకాష్ తెలిపారు. సోమేపల్లి హనుమంతరావు స్మృత్యర్థం జాతీయ స్థాయి 'చిన్న కథల' పోటీ నిర్వహిస్తున్నారు. కథలను ఈ నెల 15 తేదీలోపు 'రమ్యభారతి, పి.బి.నెం 5, 11-57/1-32, జె.ఆర్.కాంప్లెక్స్, రెండో అంతస్తు, రజకవీధి, విజయవాడ-520001' చిరునామాకు పంపించాలి. ఇతర వివరాలు, నియమ నిబంధనల కోసం 92474 75975 నంబరులో సంప్రదించవచ్చు.

అందరూ బాధ్యత వహించాలి
ఇతర రాష్ట్రాల్లోని తెలుగువారికి తెలుగు అకాడమీ, తెలుగు విశ్వవిద్యాలయాల పాఠ్య పుస్తకాలు, సాహితీ గ్రంథాలను మన ప్రభుత్వం అందించాలి. మన నాయకులంతా ఇతర రాష్ట్రాల్లో తెలుగు రెండో భాష అయ్యేట్లు ఉద్యమించాలి. తమిళనాడుతో ఇది మొదలవ్వాలి. అక్కడ 40% మందివి తెలుగు మూలాలే. ఎందరో తెలుగువారు కేంద్ర స్థాయి నాయకులుగా ఉన్న ఈ పరిస్థితుల్లో ఇది సులభసాధ్యమే. తమిళనాట తెలుగు జానపద కళల పరిరక్షణకు హైదరాబాద్ దూరదర్శన్, తెలుగు విశ్వవిద్యాలయాలు నడుం కట్టాలి.

**- సి.విజయనారాయణ, మౌలాలి, హైదరాబాద్**

ఆణిముత్యాలే..
'తెలుగు వెలుగు' మాసపత్రిక ప్రతీ నెలా ఒకటో తేదీనే సర్వాంగ సుందరంగా ముస్తాబై పాఠకుల చేతుల్లోకి రావడం ముదావహం. 'వాయులీనం' వంటి ఆణిముత్యాల్ని వెలుగులోకి తెచ్చినందుకు అభినందనలు. తెలుగు సాహితీలోకంలో అత్యద్భుత పత్రిక ఇది.

**- ఆనందరావు పట్నాయక్, హంసిని వెబ్‌పత్రిక, రాయఘడ, ఒడిశా**

కొత్తతరానికి ప్రాధాన్యత ఇవ్వాలి
ఆశించిన స్థాయిలో అక్టోబరు పత్రిక లేదన్నది నా అభిప్రాయం. పత్రికలో పాత వాసనలు ఉన్నాయి. భాషపై పాఠకులకు పట్టునిచ్చే కీలక విషయాలు, పిల్లలకు తెలుగు ఎలా నేర్పాలి వంటివి, ఉపయుక్త వ్యాసాలూ, ఆధునిక, అభ్యుదయ కవుల కవిత్వాలూ, రచయితలతో ముఖాముఖిలు ప్రచురించాలి.

**- బి.లలిత, విశాఖపట్నం**

కథలు స్ఫూర్తినిస్తాయి
దేశవ్రత కథ నాకు బాగా నచ్చింది. రాజు పరువు నిలిపేందుకు, రాజ్యంలో అలజడి రేగకుండా కాపాడేందుకు తమ జీవితాల్ని త్యాగం చేసిన తల్లి, కుమార్తెలు, వారి ప్రేరణతో మహిళల కోసం యువరాజు తీసుకున్న నిర్ణయం స్ఫూర్తిదాయకంగా ఉన్నాయి. మిగిలిన వ్యాసాలు, కథనాలు చాలా బాగున్నాయి.

**- ప్రియనాథ్ దోనెపర్తి (ఫేస్‌బుక్ ద్వారా)**

## తెలుగు వెలుగు ఘనత

ఈనాడు తెలుగు వెలుగు సాహిత్య మాస పత్రిక
తెలుగు వాడి, తెలుగునాడి జేయు చంద్రిక
మరచిపోని, విడువరాని సందేశ వాక్యాల కలయిక
తరతరాల తెలుగుదనం తెలియజేయు భూమిక

తెలుగుతల్లి ఆశీస్సులతో తెలుగు నేలను వెలువడింది
నేటి పిన్నలకవగతంజేయ పూనిక తోడ వచ్చింది
తెలుగు భాష తీయదనం పదుగురకు పంచుతుంది
ఈనాడు యజమానికి తెలుగు జాతి జోహార్లన్నది

తెలుగు తల్లి ముద్దు బిడ్డ- ఈ తెలుగు సాహితీ మాసపత్రిక
ఈ పత్రికలోన నలరె - తెలుగు పదాల- సోయగాల జిగి నడక
లాలిత్య సాహిత్య సాగరంలోన పరితులడెందాలు - ఓలలాడుగాక
ఆ చంద్రతారార్కం తెలుగువెలుగు మాసపత్రిక వెలుగులీన కోరిక

**- విద్వాన్ కోట శ్రీరామచంద్రమూర్తి, విల్లివాకం, చెన్నై**

### మేము సైతం భాష కోసం...




తెలుగు వెలుగు పత్రిక చూసి సంతోషించాం. భాషాభివృద్ధికి నడుం కట్టిన రామోజీ ఫౌండేషన్ స్ఫూర్తితో మేం ముద్రించే రాతపుస్తకాలను 'తెలుగుతేజం' పేరుతో విడుదల చేశాం. ఎవరికి వీలైన పద్ధతిలో వారు కృషి చేస్తే తెలుగుకు వెలుగు అసాధ్యమేమీ కాదు.

**- కంచర్ల సత్యసాయి, అమలాపురం**

### కావ్యభాగాలను ప్రచురించాలి

గ్రంథ పరిచయం వంటి శీర్షికలు తెలుగు ప్రజలకు దోహదపడతాయి. కానీ వ్యావహారిక నుడుల్లో గేయాలు ఎక్కువగా చోటు చేసుకున్నాయి. పద్య శీర్షికలు మరికొన్ని పెంచితే బాగుంటుంది. తెలుగువెలుగులో ప్రాచీన కావ్యభాగాలను ప్రచురిస్తే ఇంకా సౌందర్యంగా, శోభాయమానంగా ఉంటుంది.

**- కంచర్ల పాండురంగశర్మ, వినుకొండ, గుంటూరు**

### భాషా కార్యక్రమాలు వేయాలి

రెండో సంచిక చాలా బాగుంది. సైనిక దళాలు, అనుబంధ రక్షణ దళాలు, పారామిలటరీ, వాయుసేన, సముద్రసేన, తీర రక్షక దళాల్లో పనిచేసే తెలుగువారికి, దూర ప్రాంతాల్లోని వారికి మాతృభాషపై సహజంగానే మక్కువ ఎక్కువగా ఉంటుంది. వీరి భాషా సంఘాలు, విదేశాల్లోని తెలుగు సంఘాల కార్యక్రమాలను ఛాయా చిత్రాలతో ప్రచురించాలి.

**- సత్తి లలితారెడ్డి, వార్తా ప్రయోక్త, ఆకాశవాణి**

### ప్రశంసనీయం

భాషా పరిరక్షణకు రామోజీ ఫౌండేషన్ కృషి ప్రశంసనీయం. ప్రాచీన భాషా మాధుర్యానికి ఆటపట్టులైన శతకాలు, పురాణాలే కాకుండా నిఘంటువులు కూడా ముందుతరానికి అందేలా చేస్తున్నందుకు ధన్యవాదాలు.

**- వేదార్థం మధుసూదనరావు, పెంట్లవల్లి, మహబూబ్‌నగర్**

### సంస్కృతిని కాపాడాలి

ముందుతరాల వారు 'కంప్యూటర్'లా తయారవుతున్నారు. కష్టపడకుండా మన పనులన్నీ యాంత్రిక జీవితంతో సద్దుమణుగుతున్నాయి. కానీ మనం ఆ సౌకర్యాలను ఉపయోగించుకుని కమ్మని పదజాలాన్ని కాపాడుకుంటూ ముందుతరాలవారికి అందించాలి. భాషాపండితులు, అభిమానులు అందరూ కలిసి యువతకు ఉపయోగపడే వ్యక్తిత్వ, సంభాషణ తదితర సామర్థ్యాల్ని అందించే పుస్తకాల్ని అచ్చ తెలుగులో తయారు చేయాలి. దానిని పాఠశాలలు, కళాశాలల్లో తప్పనిసరి బోధనాంశంగా ప్రవేశపెట్టాలి.

**- సురూపా శాస్త్రి, సికింద్రాబాద్**

### పదేపదే చదవాలి

"ఏ భాష నీది ఏమి వేషమురా,
ఈ భాష ఈ వేషమెవరి కోసమురా
ఆంగ్లమందున మాటలనగానే
ఇంత కుల్కెదవెందుకు రా
తెలుగువాడివై తెలుగు రాదనచు
సిగ్గులేక ఇంక చెప్పుటెందుకురా
అన్యభాషలు నేర్చి ఆంధ్రమ్ము రాదంచు
సకిలించు ఆంధ్రుడా చావవెందుకురా"...

కాళోజీ రాసిన కవిత ఇది. తెలుగు మాట్లాడాలన్నా, చదవాలన్నా సిగ్గుపడే ప్రతి తెలుగువాడూ ఈ కవితను పదే పదే చదవాలి.

**- పి.రామ్మోహనరెడ్డి, ప్రత్యేకాధికారి, బాలల సంక్షేమం, సంస్కరణల శాఖ, హైదరాబాదు**

### సుగంధాల వెల్లువ

తెలుగు వెలుగు మలి సంచిక మల్లెల గుబాళింపు, జాజుల సౌరభం కలసిన తెలుగు సుగంధ పరిమళాల్ని వెదజల్లింది. కనువిందే గాదు, అన్ని అంశాలతో కడుపు నింపే షడ్రసోపేతమైన విందులా ఉంది.

**- పులుగుర్త వెంకటకృష్ణారావు, హైదరాబాదు**

### సవరణ

అక్టోబరు సంచికలో "మన నిఘంటువులకు మంగళారతి ఆంధ్రభారతి" కథనంలో పొరపాటు దొర్లింది. 'ఆంధ్రభారతి'కి తానా ఆర్థిక సాయం మంజూరైంది 2011 జులైలో కాగా, 2001 జులైలో అని అచ్చయ్యింది. ఈ సాయాన్ని నిఘంటువులను డిజిటైజ్ చేయటానికి ఉపయోగించారు. పొరబాటుకు చింతిస్తున్నాం.

### అంకురార్పణ

మాతృభాషాభివృద్ధికి, పరిరక్షణకు శ్రీకారం చుట్టి, భాష ఔన్నత్యానికి అంకురార్పణ చేసినందుకు కృతజ్ఞులం. జాతిని మేల్కొలిపి మరుగున పడిన సాహితీ వైతాళికులను మీ పత్రిక ద్వారా నేటి తరానికి అందించడమూ భాషకు వెలుగే.

**- కంకట సుబ్బారావు, గన్నవరం, కృష్ణా**

### సాహిత్య విలువలున్నాయి

తెలుగు వెలుగు పత్రిక ఆధునిక పత్రికా ప్రపంచ సాహిత్య విలువల్ని కలిగి ఉంది. ఇది ఓ ఆదర్శవంతమైన పత్రికగా నిలిచిపోవాలని కోరుకుంటూ హృదయపూర్వక శుభాకాంక్షలు తెలియజేస్తున్నాం.

**- డా॥ జక్కు రామకృష్ణ, విజయనగరం**

### సగర్వంగా తలెత్తుకోవాలి

తమిళనాడులో తెలుగు వారి పట్ల తమిళులు వివక్షచూపించడమే కాదు, ప్రభుత్వ ఉద్యోగ, విద్య విధానాల్ని రాజకీయపరంగా ఎదగకుండా అడ్డుతగులుతున్నారు. ఆంధ్రరాష్ట్ర ఏర్పాటును ఎదిరించిన రాజాజీది హోసూరే. ఇక్కడ నాటి నుంచి నేటిదాకా తెలుగు కోసం ఎన్నో ఉద్యమాలు జరిగాయి. ఫలితంగా హోసూరు ప్రాంతంలో 400పైగా ప్రభుత్వ తెలుగు పాఠశాలలున్నాయి. వీటికి భాషాభిమానులు, తెలుగు సంఘాలు అండగా నిలిచాయి. ఇపుడు తమిళనాడంతా తెలుగు భాషోద్యమం, స్వాభిమాన ఉద్యమం జరగాల్సి ఉంది. అప్పుడుగానీ మనం తలెత్తుకుని బతకలేం.

**- డా॥ ఎన్.వసంత్, హోసూరు, తమిళనాడు**

# అక్షరార్చన

సుదూరాన
అక్షరాలన్నీ ఎండమావుల్లా,
ఆ చివర ఏదో ఒక దృశ్యం!
లక్ష్యసాధనలో
అలసిపోతున్న మనిషి
ఏదో ఒక గమ్యానికి
నిరంతరంగా!
దారి తప్పినప్పుడల్లా
ఆ అక్షరమే అమ్మగా
ఉద్యమమే స్ఫూర్తిగా,
అనుభవసారమంతా
అక్షరాల్లో ఇమడనపుడు
ఎడారిలో వాన చినుకులా
జీవితమంతా నిస్సారమే
పదాల హోరులో
శిఖరాగ్రాన అంతా శూన్యమే
నాదమయం ఈ భూగోళం
అనురాగ రంజితం
సృష్టిమూలం
విధ్వంసం అంచులపై తిరిగి
అక్షరమే అనుసృజనగా
నూతన తరాల
మూలధాతువుగా,
అక్షర ఆరాధనలోనే
ఒక తేజస్సు ఒక రేతస్సు
ఫలించే యథార్థ జీవన
సృజనశక్తి!!

**- నిఖిలేశ్వర్**, హైదరాబాద్.
91778 81201



# కొక్కొరో...కో



కథ

మా మస్తాన్‌గూడలో ఉండే షమ్షీర్‌గాని ఇంటికి పోతే అక్కడున్నంత సేపు ఒక్కటే లొల్లి. ఎటు సూసినా కోళ్లు గిర గిరా తిరుగుతుంటయ్. ఎర్ర కోడి, జుట్టు కోడి, రాజ కోడి, కోడిపుంజు, కోడిపెట్ట వాటి పొంటి కోడి పిల్లలు. ఇగ కొక్కొరో...కో...

సెడ్డీలు ఏసుకునే అప్పటిసంది షమ్షీర్ గాడు నేను దోస్తులం. షమ్షీర్ ఇల్లు ఎనుకటి పెంకుటిల్లు. సిన్నప్పుడే షమ్షీర్‌గాని అయ్య తాగి తాగి లివర్ కరాబ్ అయి సచ్చిపోయిండు. అమ్మకు బళ్లో షపరాసి నౌఖరి ఇచ్చిండ్రు. ఇగ షమ్షీర్, నేను బడి సెలవు దొరికితే షమ్షీర్ ఇంటెన్క ఉన్న చింత చెట్టు కిందికి పోయి గోటీలు, కోతి కొమ్మ, వంగుడు దుంకుడు.. ఆటలే ఆటలు! మాతోటి కొక్కొరో...కో అంటూ షమ్షీర్‌గాని కోళ్ళు.

ఆళ్లింట్లో షమ్షీర్‌గాడు, వాళ్లమ్మ, ఇద్దరు అక్కలు. అల్లరి పోరడని నాకు సిన్నప్పటి నుంచి పేరు. షమ్షీర్ గాణ్ణి అందరు మంచి పోరడు అంటరు. నిజంగనే వాడు అమాయకుడు. మాకిప్పుడే పదమూడు నిండి పద్నాలుగు పడ్డయి. షమ్షీర్‌గాని అయ్య సిన్నప్పుడే సచ్చిపోవడం, ముగ్గురు ఆడోళ్ళ మధ్య పెరగడంతో వాడికి భయమెక్కువ. ఎవ్వరి జోలికి పోడు. ఈత కొడదాం రారా అంటే అమ్మ తిడ్తది అంటడు. పక్కింట్లో మామిడికాయలు తెంపుత ఎవ్వాలన్న వత్తె చెప్పురా అంటే భయపడ్తడు. కాని వాడు నా సోపతి కదా! తప్పదు.

ఐతారం, ఐతారం ఎవరో ఒకరు రావడం, ఒక కోడిని కొనుక్క పోవడం. నాటు కోడికి మా ఊళ్లో మంచి గిరాకి. అందులో షమ్షీర్ గాని కోళ్ళు సూస్తె నోట్లె నీళ్లూరుతయి. కాని షమ్షీర్‌గాడు మాత్రం వాడు పెంచిన కోళ్ళను తినడు. తినాలంటే మనసొప్పదంటడు.

గ రోజు రానే అచ్చింది. షమ్షీర్ పక్క పొంటి ఇంట్లో ఉండే బడేమియా అంగడి వ్యాపారి. వారంల ఎక్కడ అంగడి ఉంటె అక్కడ బోల్‌ప్యాలాలు, ఇంకొన్ని పప్పులు అమ్ముతూ ఉంటడు. ఒక రోజు బడేమియా షమ్షీర్ ఇంట్లకు కోపంగ అచ్చి 'అరేయ్ షమ్షీర్‌గా నీ కోళ్ళు నా ఇంట్లో సొచ్చి రెట్టలేసి ఇల్లంతా రోత రోత చేస్తున్నయ్' అని లొల్లి వెట్టిండు. మాటా మాటా పెరిగింది. "ఇంకో సారి నీ కోళ్ళు నా ఇంట్లో సొత్తె వాటికి విషం వెడ్త" అని పోయిండు. బడేమియా అన్నంత పని చేస్తడు. మా వాడలో బడేమియానే పహిల్వాన్. కోపం వస్తే ఈరంగమే ఇక!.

ఈ దెబ్బతో షమ్షీర్‌గాని ఇంట్లో అందరు కోళ్లు అమ్మాలని అనుకున్నరు. షమ్షీర్ కోళ్ళు పూరాగా అమ్ముతున్నడు అన్న ముచ్చట ఊరంతా పాకింది. పొద్దూకంగా గొల్ల మల్లి గాడు అచ్చి మొత్తం కోళ్ళను రెండు వేలు వెట్టి కొనుక్కున్నడు. షమ్షీర్‌గానికి రాత్రి నిద్ర వట్టలే. పాపం ఆనికేమో కోళ్ళు పెంచుడంటే ఇష్టం. ఎందుకంటే కోళ్ళు, వాటి గుడ్లు అప్పుడో ఇప్పుడో అమ్మితే వాని కీసలో పైసలు మెదిలేవి. బడేమియాతో లొల్లి ఎందుకని అన్ని అమ్మిండు. షమ్షీర్ ఇంట్లోల్లు కోళ్లు పోయిన మంచిగ పైసలచ్చినందుకు సంబరపడుతుర్రు.

పొద్దున్నే షమ్షీర్ ఇంటికి పోయిన నాకు కొక్కొరో...కో సప్పుడు లేకపోయేసరికి అంత ఎటో అనిపిచ్చింది. గ దినమంతా చింతచెట్టు కింద మొకం అంతా ఎటో వెట్టి కూర్చున్నం.

నెల రోజులైనంక గ కోళ్ల సంగతి మరిసి పోయినం. మా దోస్తు రాము గాడి ఇంట్లో వాళ్ళ అక్క కొడుకు పుట్టిన రోజు దావత్ అంటే పోయినం. ఒక ముప్పై మందిదాక ఉన్నరు. అందులో నేను, షమ్షీర్. అందరికి అన్నం వెట్టిండ్రు. కోడి కూర అయితే లొట్టలేసుకొని తిన్న. ఇగ వెళ్దామని బయటికొస్తే గొల్ల మల్లిగాడు రాము గాని అయ్య దగ్గర పైసల్ తీసుకొని షమ్షీర్ గాన్ని పిలిసిండు.

"షమ్షీర్ భాయ్ నీ కోళ్ళు మస్తుగ అమ్ముడు పోయినయ్. ఇయ్యాల రాము ఇంట్లో దావత్‌కి నీ కోళ్లే అమ్మిన" అన్నడు. ఇగ షమ్షీర్‌గానికి కళ్లలో నీళ్లు.. ఆ రాత్రంతా నా కడుపులో షమ్షీర్ గాని కోళ్ళు.. కొక్కొరో...కో...!



కార్తీక్‌రాం
ఆదిలాబాద్.



# నాటి మేటి తెలుగు పద్యం

పసుల వన్నె వేరు పాలేక వర్ణమౌ,
పుష్పజాతి వేరు పూజ యొకటీ;
దర్శనములు వేరు దైవంబు యొక్కటీ
విశ్వదాభిరామ వినురవేమ! – వేమన

వేమన ప్రజాకవి అంటారు ఆధునికులు. ప్రజలలోని మూఢ విశ్వాసాలను పోగొట్టడానికే కలం పట్టాడు యోగి వేమన. నా కులం గొప్పది, నా మతం గొప్పది అంటూ కొట్లాడుకొంటున్న సమాజాన్ని దర్శించాడు ఆ మహాకవి. అతని విశ్వమానవ భావనకు ఈ సమాజ రూపం విపరీతంగా తోచింది. తనకు అభిప్రాయాన్ని నిర్భయంగా చెప్పటం అతని పద్ధతి. ఈ సమాజాన్నే నిరసించి దూరంగా వెళ్ళిన కవికి సమాజ నగ్న రూపాన్ని వర్ణించడానికి భయమెందుకు?

సంఘంలోని మన కళ్ళకెదురుగా కనిపిస్తున్న రెండు ఉపమానాలు తీసుకొన్నాడు కవి. నల్లవి, తెల్లవి, ఎర్రవి, మచ్చలవి పశువులను ఎన్నిటినో చూశాడు. కాని, అవి ఇస్తున్న పాలు అన్నీ తెలుపువే! అంటే అవి కనిపించే రూపాలు, రంగులు వేరైనా; వాటి పాల రూపం, రంగు- ఒక్కటే! అలాగే ఎన్నో జాతుల పూలు ఎన్నో రంగులు కలిగిఉంటాయి. కాని దేవుని వద్దకు చేరగానే అవన్నీ ఒక పూలమాలగానో, కదంబంగానో కలసి అందాలు వెలువరిస్తాయి.

లోకరీతి ఇలా ఉండగా- వివిధ కాలాల్లో, వివిధ ప్రవక్తలు చెప్పిన మత గ్రంథాలు, రకరకాల పద్ధతులలో ఆ భగవంతుని కీర్తించి వర్ణించారు. అంత మాత్రం చేత వాటి అంతస్సారమైన భగవంతుని తత్త్వం వేరుగా ఎందుకుంటుంది? ఆ తత్త్వాన్ని పూజించే ప్రజలు వేరువేరైనప్పటికి ఒకే సమాజంగా కలిసిమెలసి ఒకే దైవంగా పూజిస్తే ఎంత అందంగా ఉంటుంది- అని వేమన భావం. అదే నేటి వసుధైక కుటుంబ భావన.

- డా॥ సిహెచ్. వెంకటేశ్వర్లు



# మేఘసందేశం

ప్రత్యేక సందర్భాలకు... శుభాకాంక్షలు
విజయసాధకులకు... అభినందనలు
మేలు మరువలేనపుడు... కృతజ్ఞతలు
తప్పు మన్నించాలన్నపుడు... క్షమాపణలు
భావం భాషగా మారడం ఒక కళ. అందులో మీకు అభినివేశం ఉంటే... తెలుగు అక్షరాల ఒంపులను, వినసొంపులను సంక్షిప్త సందేశాలలోనూ పలికిద్దాం రండి. సృజనాత్మక, భావగర్భిత అచ్చ తెనుగు సందేశాలకు వేదిక ఈ పుట. ఆకాంక్షల పూదోట ఈ పుట!

## పుట్టిన రోజు శుభాకాంక్షలు

ఆరోగ్యం, అదృష్టం, అభిమానం,
అభివృద్ధి అన్నీ ఆయుష్షు పోసుకుని నీ వయసుకి తోడు రావాలని కోరుకుంటూ.

ఈ ఏడు మీ రాశిఫలం
ఆదాయం - 10, వ్యయం - 1, రాజపూజ్యం - 10, అవమానం 1 వెరసి సంతోషం సముద్రమంత, బాధ దరికి రానంత. పుట్టినరోజు శుభాకాంక్షలు.

నదులకు, ఋషులకు పుట్టినరోజు ఉండదు. కానీ ఈ రోజు పుట్టినరోజు జరుపుకుంటున్న మీరు నదికి ఉన్నంత అనుభవాన్ని, ఋషికి ఉన్నంత జ్ఞానాన్నీ పొందాలని కోరుకుంటూ.

నువ్వు పంచే ఆనందాలు
నీతో ఇతరులు పొందే సంతోషాలు
... అంతలంతలై తిరిగి నీకు అందాలని ఆకాంక్షిస్తూ...

ఇలా మీరు రాసినవో... మీరు మెచ్చినవో ఉంటే... మాతో పంచుకోండి. బాగున్నవి ప్రచురిస్తాం! పాఠకులకూ నచ్చితే అవి ప్రపంచవ్యాప్తంగా విహరిస్తాయి. మీ సందేశాన్ని 800 800 1656కు పంపండి. లేదా teluguvelugu@eenadu.netకి మెయిల్ చేయండి.

## బాలల దినోత్సవ శుభాకాంక్షలు



ఎత్తుకోండి... హత్తుకుపోతారు
మాట్లాడండి... మురిసిపోతారు
కథలు చెప్పండి... కేరింతలు కొడతారు
ఆటలాడించండి... అల్లుకుపోతారు
ఒక్క రోజు చేయండి ఇలా... ఎదురు చూస్తారు మీకోసం ప్రతిరోజూ
వారి సంతోషం కంటే విలువైందా మన సమయం
బాలల దినోత్సవ శుభాకాంక్షలు

అమ్మ ఒడి
నాన్న ఛాతి
మావయ్య భుజం
తాతయ్య వీపు
అన్నీ వారి ఆటస్థలాలే.
మురిపాల ముచ్చట్లకు వేదికలే
రోజులలా సాగిపోవాలి. సంతోషాలకు చిరునామాలవ్వాలి.

బుజ్జాయిలు... గడుగ్గాయిలు...
చిచ్చురపిడుగులు... చిన్నారి దేవుళ్లు...
మా అందమైన ఆశలకు ప్రతిరూపాలు మీరే!
ఆడుకోండి... పాడుకోండి... ఈ లోకం మీదే!

# ఆహ్వానం

ఏదైనా శుభకార్యానికి ఇలాంటి సృజనాత్మక ఆహ్వానాన్ని మీరూ రూపొందిస్తే... దాన్ని మాకు పంపండి. బాగుంటే ప్రచురిస్తాం. ఎంపికైన ఆహ్వానానికి చక్కని బహుమతీ ఉంటుంది. తెలుగు సమానార్థకాలు లేకపోతే తప్ప అందులో ఆంగ్ల పదాలు ఉండకూడదు, తాజా ఆహ్వానం అయి ఉండాలన్నవి నిబంధనలు.

## "వేద" 1వ పుట్టిన రోజు వేడుక.. ఆహ్వాన పత్రిక

నా పేరు "వేద". మా అమ్మ-నాన్నలు గారాల పట్టిని.
నేను సంతోషంగా, ఆరోగ్యంగా ఉండాలని,
ఒక ఆదర్శవంతమైన వ్యక్తిగా ఎదగాలని మా అమ్మ-నాన్నల తపన.
అందుకే వాళ్ళే నా బలం. ఆ బలానికి తోడుగా మీ చల్లని మనస్సుతో
మీరిచ్చే ఆశీర్వచనాలు, దీవెనలు కలిస్తే...
నా జీవితం ఆనందమయమవుతుందని నా ఆశ...
కావున 09-10-2012 మంగళవారం రోజున
జరిగే నా మొదటి పుట్టిన రోజు వేడుకకు సకుటుంబ సమేతంగా
విచ్చేసి మీ సహృదయంతో నన్ను దీవించాలని నా మనవి...

09-10-2012 మంగళవారం రోజున సా॥ 5గం॥లకు
మా గృహమునందు, బాసర.
విందు : కార్యక్రమానంతరం...
మీరు తప్పకుండా వస్తారనే ఆశతో మీ రాక కోసం ఎదురుచూస్తూ ఉంటా...

జీవితంలో ఎలాంటి సంఘటన ఎదురైనా చిరునవ్వుతో ఎదుర్కోవాలని చెప్పాడు మా నాన్న...

సదా నా క్షేమం కోరుకునే...
**అమ్మ - నాన్న :**
**శ్రీమతి & శ్రీ అనురాధ - జయకృష్ణ**

నానమ్మ - తాతయ్య : శ్రీమతి & శ్రీ లీల - శంకర్ రెడ్డి
అమ్మమ్మ - తాతయ్య : శ్రీమతి & శ్రీ సుశీల - హన్మయ్య
అత్తమ్మ - మామయ్య : శ్రీమతి & శ్రీ విజయ - మచ్చేందర్ రెడ్డి
బాబాయి : వంశీకృష్ణ
పిన్ని : కుమారి దీపిక

శ్రీమతి & శ్రీ హిమబిందు - అంజనాప్రసాద్, రాజయ్య బాబాయి, శ్రీనాథ్ మామయ్య మరియు బంధుమిత్రుల అభినందనలతో...

# తెలుగు కేసరి... దాసరి...

150 సినిమాలకు దర్శకత్వం, 130 చిత్రాలకు కథారచన, 130 చిత్రాలకు సంభాషణలు, 450 చిత్రగీతాల రచన... ఇదీ దర్శకరత్న దాసరి నారాయణరావు ప్రస్థానం. తెలుగుదనానికి, భాషకు, ప్రయోగాలకు ఆయన చిత్రాలు పుట్టినిళ్లు. భాషతో ఆయన చేసినన్ని ప్రయోగాలు బహుశా మరే దర్శక రచయితా చేసి ఉండరు. తెలుగు నాట ప్రసిద్ధమైన 'చిల్లరకొట్టు చిట్టెమ్మ' నాటకాన్ని చిత్రంగా మార్చి అందించినా... కాళిదాసు మేఘసందేశాన్ని సామాజీకరించినా... జయదేవుని అష్టపదుల్ని తెలుగు చేయించినా... అది దాసరికే చెల్లింది. మాతృభాషపై తన అభిమానాన్ని వెల్లడిస్తూ, ప్రస్తుత పరిస్థితి గురించి తన మనోభావాలిలా పంచుకున్నారు...



నాకు తెలుగన్నా, తెలుగుదనమన్నా ఇష్టం. దాన్నే నా చిత్రాల్లోనూ చూపాలని అనుకుంటాను. అందుకే 'మేస్త్రి' చిత్రంలో తెలుగు కోసం ప్రత్యేకంగా ఒక గీతాన్ని సినారెతో రాయించి జాతికి అంకితం చేశాను. దీన్నో పండగగా భావించాను! అలానే చేశాను ఈ కార్యక్రమాన్ని.

నేనేమీ పండితుల వంశంలో పుట్టలేదు. మా అమ్మానాన్నలు పెద్దగా చదువుకున్న వారూ కాదు. నాకెందుకో చిన్నప్పటి నుంచి నాటకాలంటే ఆసక్తి. ఎక్కడ నాటకం వేసినా ఎంత దూరమైనా సరే సైకిల్ తొక్కుకుంటూ వెళ్లి చూసొచ్చే వాడిని. ఇంటి కొచ్చాక ఆ నాటకంలో సంభాషణల్ని వల్లె వేస్తూండే వాడిని. అలా తెలియకుండానే భాషపై పట్టు వచ్చింది. పుస్తక పఠనంపై మక్కువ పెరిగింది. తరువాత చదవడం చాలా కాలం పాటు వ్యసనంగా మారిపోయింది.

### నాటకాల అభిరుచి

9వ ఏట తొలిసారి రంగస్థలంపై నాటక ప్రదర్శన ఇచ్చాను. రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల వాళ్లూ వచ్చి మా ఊర్లో, చుట్టు పక్కలా నాటకాలు వేసేవాళ్లు. వాటి సంభాషణలను సాధన చేయడం వల్లేనేమో నా భాషలో గోదావరి యాస కనిపించదు. భారతం, భాగవతం, కాశీమజిలీ కథలు, పెద్ద బాలశిక్ష, కథాసరిత్సాగరం... ఒకటేమిటి నేను చదివిన, నాకు బాగా నచ్చిన పుస్తకాలు చాలానే ఉన్నాయి. ఈ మధ్య కూడా పెద్దబాల శిక్ష, తెలుగు సినిమా చరిత్ర, కథాసరిత్సాగరం ప్రతులు కొన్ని తెప్పించాను. నాకు నచ్చిన పుస్తకాల్ని నాకు నచ్చిన వాళ్లకు ఇవ్వటం ఓ తృప్తి. అన్నిటికన్నా బాగా ఇష్టం పాలగుమ్మి పద్మరాజు 'గాలివాన', శ్రీశ్రీ 'మహాప్రస్థానం'.

నాలో కళాకారుడు, రచయిత ఉన్నాడని మొదట గ్రహించింది, నాకు తెలియజేసింది, ప్రోత్సహించింది మా తెలుగు ఉపాధ్యాయుడు దూర్వాసుల సుబ్బయ్య శాస్త్రి. ఆయన శిష్యరికంలోనే మంచి భాష, సమయోచిత హాస్య ప్రయోగాలు, చమత్కారాలు నాకు అలవాటయ్యాయి. నేను మర్చిపోలేని వ్యక్తుల్లో ఆయనొకరు. ఆయన ప్రోత్సాహంతోనే 13వ ఏట 'నేను - నా స్కూలు' పేరుతో 11 నిమిషాల నాటిక రాశాను. తరువాత దానికి మరింత మెరుగులద్ది 40 నిమిషాలకు పెంచాను. ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్ సమావేశాల్లో దాన్ని ప్రదర్శించడం, దానికి బహుమతి రావడం మంచి అనుభూతులు. ప్రతి వారూ గురువుల్ని గౌరవించాలని, వారూ విద్యార్థుల్ని సొంత పిల్లల్లా చూసుకోవాలని చెబుతూ రాసిన నాటకమది. తరువాత చాలా నాటకాలు రాశాను, ప్రదర్శించాను. అలా సినిమాల్లోకి ప్రవేశించాను.

### పేరుకే తెలుగు సినిమాలు...

చాలా కాలం పాటు సినీ రంగంలో తెలుగు భాష మీద మంచి పట్టు, గౌరవం, మమకారం ఉన్న వాళ్లు ఎక్కువమంది ఉండేవాళ్లు. అందువల్లే మన చిత్రాల్లో తెలుగుదనం ఉట్టిపడేది. అద్భుతమైన భాషా ప్రయోగాలు జరిగేవి. కారణాలేమైనా ఇప్పుడు అలాంటి వారి సంఖ్య బాగా తగ్గిపోయింది. మొదట్లో పరభాషా నటులు వచ్చీ రాని తెలుగులో మాట్లాడితే హాస్యంగా అనిపించింది. ఇక అందరూ అదే దారిన వెళ్లడం ప్రారంభించారు. దాని వల్ల మనదైన ఉచ్చారణ, భావవ్యక్తీకరణ పోతున్నాయని గ్రహించడం లేదు. పైగా బూతులొకటి.

> "మనమేదో తెలుసుకున్నాం, రాసేస్తున్నాం అని అనుకుంటాం. కానీ తెలుగులో ఉన్న 56 అక్షరాలను ప్రయోగించడానికి మన జీవితాలే సరిపోవు"
>
> ఇదీ తెలుగు గురించి దాసరి తరచూ సన్నిహితుల దగ్గర అనే మాట.

ఇప్పటి తెలుగు సినిమాలు చూస్తే ఇది తెలుగేనా అని కళ్లనీళ్లు పెట్టుకోవాల్సిన పరిస్థితి. మన ఇళ్లల్లో మగపిల్లలు కూడా బయటికి మాట్లాడలేని పదాల్ని సినిమాల్లో కథానాయికలతో చెప్పిస్తున్నారు. ఇలా రాస్తేనే చూస్తున్నారని అంటున్నారు! కథానాయకుడో, నాయికో తల్లిదండ్రులతో 'తొక్క' అంటే ప్రేక్షకులు చప్పట్లు కొడుతున్నారంటే చాలా బాధనిపిస్తుంది. ఎటుపోతున్నాం మనం? అది చూసి ఇప్పుడు మనం చప్పట్లు కొడితే తరువాత మన పిల్లలు అంతకన్నా ఘోరమైన మాటల్ని అంటారన్న స్పృహ ఉండదా? మన ఇళ్లల్లో అలానే మాట్లాడుకుంటామా? పెద్దల్ని అలానే పిలుస్తామా? ఇదంతా ఆకట్టుకునే కథను చెప్పడం చేతకాక భాషను వక్రీకరించి అమ్ముకోవడం కాకపోతే ఏంటి? ఎందుకీ దౌర్భాగ్యం?

మన చిత్రాల్లో తెలుగుదనం ఎందుకు లోపిస్తోందంటే... కథలు ఇక్కడే పుట్టేవి. మన సమాజం నుంచి, మన సాహిత్యం నుంచి, మన జనంలోంచీ పుట్టేవి. ఎక్కువ నవలల్ని సినిమాలుగా తీసింది నేను. టీవీ ధారావాహికలు వచ్చాక నవలలు రాసే, చదివే వారి సంఖ్య తగ్గింది. దాంతో ఇప్పుడు కథల్ని దిగుమతి చేసుకుంటున్నారు. ఇప్పుడు పది విదేశీ చిత్రాల డీవీడీలు పెట్టుకుని ఒక సినిమా కథ తయారు చేస్తున్నారు! అందువల్లే తెలుగుదనం లోపిస్తోంది.

### మార్పు తెచ్చేది ప్రభుత్వాలు కాదు

చివరికి చిత్రాలకు తెలుగు పేరు కూడా పెట్టుకోలేని దుస్థితి. తెలుగులో పెడితే పాతదని, ఆంగ్లంలో పెడితే కొత్తగా ఉంటుందని భ్రమపడుతున్నారు. పేరుతోనే చిత్రాలు విజయం సాధిస్తాయా? ఇటీవల విజయం సాధించిన చిత్రాల్ని తీసుకోండి. బొమ్మరిల్లు, అరుంధతి, పూలరంగడు, అందాలరాముడు, మర్యాదరామన్న... ఇవన్నీ తేట తెలుగు పేర్లు కాదా? మరి ఇవెలా విజయం సాధించాయి? నేనూ 'యంగ్ ఇండియా' అని ఒక చిత్రానికి పెట్టాను. కానీ అది గాంధీ మహాత్ముడి పత్రిక పేరు కాబట్టి ఆ స్ఫూర్తి చిత్రంలో రావాలని తప్పనిసరై పెట్టాను. సినిమా అంటే వ్యాపారమే. కానీ అందులోనూ కొద్దో గొప్పో సామాజిక నిబద్ధత ఉండాలి కదా! ఆంగ్ల పేర్లు పెట్టి మసిపూసి మారేడు కాయ చేద్దామంటే అవుతుందా?

ఈ పరిస్థితి మారాలంటే ప్రజల్లోనే ఆ చేతన రావాలి. కన్నడంలో డబ్బింగ్ సినిమాలు, ధారావాహికలను జనమే చూడరు. వాళ్లకు ఏ ప్రభుత్వం చెప్పింది అలా చేయమని? తమిళులకు ఏ ప్రభుత్వాలు చెప్పాయి భాషను, సొంత సాంస్కృతిక, సాంప్రదాయ మూలాల్ని గౌరవించుకోమని? అలానే తెలుగుదనాన్ని కాపాడుకోవాలన్న ధ్యాస, ఆరాటం తెలుగువాడి గుండెల్లోంచీ రావాలి.

ప్రభుత్వ కార్యక్రమంగా దీన్ని మొదలు పెడితే ఏం జరుగుతుందో మీకే బాగా తెలుసు. తెలుగుకు ప్రాచీన హోదా తెచ్చుకోవడం కోసం చాలా మంది వ్యక్తులు ఎంతగానో పాటు పడ్డారు. చాలా సంస్థలూ

కృషి చేశాయి. నా వంతుగా నేను మంత్రి పదవికి రాజీనామా చేస్తానని ఒక సభలో ప్రకటించాను. చాలా పోరాటాల తరువాత ప్రాచీన హోదా వచ్చింది. తరువాత ఏం జరిగిందో, జరుగుతోందో చూస్తున్నారు కదా!

**నా భావావేశం వారికి ప్రేరణ**

దాశరథి, శ్రీశ్రీ, కొసరాజు, కృష్ణశాస్త్రి, ఆరుద్ర, ఆత్రేయ, సినారె... ఇలా చాలా మంది హేమాహేమీలతో పని చేశాను. నాకు భావావేశం ఎక్కువ. సన్నివేశాన్ని సంభాషణల, పాటల రచయితలకు కళ్లకు కట్టినట్టు చెప్పేవాడిని. దాంతో వాళ్లు ప్రేరణ పొందేవారు. అద్భుతమైన రచనల్ని ఇచ్చే వారు. 'బలిపీఠం' చిత్రానికి కృష్ణశాస్త్రి గీతరచనలో ఉన్నారు. ఒక సందర్భానికి ఎంత ప్రయత్నించినా పాట కుదరడం లేదు. పాట ఇస్తే బాణీ కట్టేందుకు పక్కనే చక్రవర్తి సిద్ధంగా ఉన్నారు. ఇంతలో ఎవరో కృష్ణశాస్త్రిని చూడటానికి వచ్చారు. శాస్త్రి మాట్లాడలేరు కనుక కాగితం మీద కుశలమేనా అని రాశారు. ఆ వ్యక్తి తలూపి, మీరు కుశలమేనా అని రాసి చూపారు. తరువాత సైగలతో కొంత సంభాషణ నడిచింది. ఆ వ్యక్తి వెళ్లిపోయారు. కృష్ణశాస్త్రి చిన్న పని ఉండి బయటికి వెళ్లారు. చక్రవర్తి ఆ కాగితాన్ని చూసి ఇది బానే ఉంది కదా అని 'కుశలమా, మీరు కుశలమేనా' అన్నది చరణంగా చేసి బాణీ కట్టేశారు. వచ్చాక వినిపిస్తే దేవులపల్లి ఆశ్చర్యపోయారు. ఆ స్ఫూర్తితో ఆ గీతాన్ని వెంటనే పూర్తి చేశారు. కొసరాజు గారైతే మరో అద్భుతం. ఒక పల్లవి బాగుందని అనుకుంటే దానికి 20 చరణాలు రాసేసే వారు. అంత సమయోచితంగా, తీవ్ర కాంక్షతో ఉండే వారు కొత్తదనం కోసం... కచ్చితత్వం కోసం... ఆకట్టుకునే రచనల కోసం. ఇలాంటి మధురానుభూతులెన్నో!

నటులు కూడా తమ సంభాషణల్ని క్షుణ్ణంగా అర్థం చేసుకునే వారు. ఒక్కో సారి చిన్న పదం గురించి పెద్ద చర్చలు జరిగేవి. వాటి మూలాలతో సహా ఆకళింపు చేసుకునే వారు. ఇప్పుడెంత మందికి ఆ శక్తి, ఆసక్తి ఉన్నాయి? అందుకే హాస్యం స్థాయి కూడా పడిపోయింది. కేవలం ముఖకవళికలు, సంభాషణలతోనే నవ్వించేవారు. మరి ఇప్పుడో, అసభ్య చేష్టలు చేసినా నవ్వించలేకపోతున్నారు. ఇదంతా ఎందుకంటే భాష, పదాల్ని సరిగా వాడుకోవడం తెలియక. అయినా ఇంకా కొందరు దర్శకులు, రచయితలు ఉన్నారు. వారు ఈ విషయంలో కొంత నయం.

**దాసరి సినీ ప్రస్థానంలో తొలినాళ్ల చిత్రం బలిపీఠంలో (1975)లో శ్రీశ్రీ రాసిన పాట నుంచి నిన్నా మొన్నటి మేస్త్రి (2009) చిత్రంలో సినారె రాసిన ఈ పాట దాకా ఆయనలో తెలుగు పట్ల అభిమానాన్ని తెలిపే వ్యక్తీకరణలు ఎన్నో:**

శాతవాహనుల ఏలుబడిలో
తొలి అడుగు వేసింది తెలుగు
కాకతీయుల గొడుగు నీడలో
కదను తొక్కింది తెలుగు
కృష్ణరాయల పాలనలో
పడగెత్తి నిలిచింది తెలుగు
నవీన యుగాన వివిధ రీతులకు
నాంది పలికింది తెలుగు
మన మాతృభాష తెలుగు
మన రక్తఘోష తెలుగు
గోదావరి, కృష్ణ, తుంగభద్ర నదుల
సాదుసలిల క్షీరధారలే సాక్షులుగా
ప్రఖ్యాత భాష తెలుగు
అత్యంత ప్రాచీన భాష తెలుగు

మన సినిమాలకు జాతీయ స్థాయి పురస్కారాలు రావడం లేదంటే కారణం తెలుగుదనం లోపించడమే. నుడికారం, సంస్కృతి, భాష, సాంప్రదాయం, స్థానిక సంగీతం, కళ... ఇవన్నీ ఆ చిత్రంలో ప్రతిబింబించాయా లేదా అన్నది పరిశీలిస్తారు. వీటన్నింటినీ దృష్టిలో పెట్టుకునే ఎంపిక చేస్తారు. కావాలంటే పురస్కారాలు వచ్చిన చిత్రాల్ని విశ్లేషించి చూడండి.

**మాండలికాలన్నీ ప్రియమే...**

నాకు రాష్ట్రంలోని అన్ని మాండలికాలూ ఇష్టమే. వాటన్నింటితోనూ బాగా పరిచయం ఉంది. నేను పల్లెలో పుట్టి పెరిగాను. మేం చిన్నప్పుడు చూసిన, వేసిన నాటకాల్లో అవన్నీ ఉండేవి. అందువల్లే వాటి మాధుర్యం తెలిసింది. వాటిపై చక్కటి అవగాహన వచ్చింది. ఇప్పటి రచయితల్లో, నటుల్లో చాలా మందికి మాండలికాలతో పరిచయం లేదు. విని రాయడం వేరు, సంపూర్ణ అవగాహనతో రాయడం వేరు. అది లేకపోవడం వల్లే మాండలికంలో సంభాషణలు చెబితే వ్యంగ్యంగా అనిపిస్తోంది. 'ఒసేయ్ రాములమ్మ' తెలంగాణ యాసలోనే తీశాను. మరి అది వ్యంగ్యంగా అనిపించలేదెందుకు? ఎందుకంటే ఆ యాసలో జీవాన్ని ఆ చిత్రం ప్రతిబింబించింది.

నాకు స్ఫూర్తి ఎవరంటే... దేవులపల్లి, ఆత్రేయ. మిగిలిన వాళ్లూ ఇష్టమే కానీ. మాట్లాడే మాటల్లోంచీ అద్భుతమైన పాటల్ని రూపుదిద్దడం ఆత్రేయకు మాత్రమే సాధ్యం. ద్విత్వాలు లేకుండా లఘువులతో పాటలు రాసి మెప్పించడం దేవులపల్లికి మాత్రమే సాధ్యం. వీళ్లిద్దరూ నామీద ప్రగాఢముద్ర వేశారు. నేను రాసేటప్పుడు వీరు నేర్పిన ఈ విషయాల్ని స్మరించుకుంటాను. నాటకాల ఫలితంగా చిన్నప్పటి నుంచే తెలియకుండానే వామపక్ష భావజాలం అలవాటయింది. అందువల్లేనేమో

## చదవడు - రాయడు

మధునాపంతుల వారి తమ్ముడి కుమారుడు చంటి 'చిక్కడు-దొరకడు' సినిమా చూసి వచ్చాడు. కొద్దికాలంగా చంటి ఎక్కువగా సినిమాలు చూడటాన్ని ఆయన గమనిస్తూనే ఉన్నారు. కొట్టక్కర్లేదు. తిట్టక్కర్లేదు. ఎత్తిపొడిచేలా ఒక్కమాట నెమ్మదిగా అన్నా భయపడి పెద్దల పట్ల గౌరవప్రవృత్తులు వెలిబుచ్చే కాలం కదా అది. చంటిని పిలిచి - "నిన్నుంచి 'చదవడు-రాయడు' సినిమా తీయాలి రా" అన్నారు శాస్త్రిగారు. ఆ తరువాత ఏం జరిగిందో చెప్పక్కర్లేదు కదా!



**(ఈ సంచికలోని మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి చతురోక్తులను పంపింది దాట్ల దేవదానం రాజు)**

ఒక్క రూపాయి సంపాదించడానికే మనిషి కష్టపడతాడు. ఆ తరువాత ఆ రూపాయే మరొక రూపాయిని సంపాదించమని మనిషిని కష్టపెడుతుంది. పేకాటలో కూర్చున్న వాడు ఇంటిని, పెళ్లాన్ని, పిల్లల్ని మర్చిపోతాడు. రూపాయి వేటలో పడ్డవాడు కూడా అలానే మర్చిపోతాడు. పేకాటకీ రూపాయి వేటకీ తేడా లేదు.

(ఏడంతస్తుల మేడ చిత్రంలో దాసరి రాసిన సంభాషణ)



ఫొటోలు: ఎస్. రవికిషోర్

శ్రీశ్రీ అన్నా ఆయన రచనలన్నా నాకు చాలా ఇష్టం.

**రచయితల చేతుల్లోనే ఉంది**

ఇప్పుడు చాలా మంది అనుకుంటున్నట్టు రచయితలు ఆకాశంలోంచీ పుట్టరు. మన చుట్టూ ఉన్న జీవితాల్లోంచీ, సమాజంలోంచీ పుడతారు. సామాజిక స్పృహ, నిశిత పరిశీలనలకు భాష తోడైనప్పుడే అతను రాసింది జీవితానికి దగ్గరగా ఉంటుంది. అప్పుడే ప్రేక్షకులు దాంతో మమేకం అవుతారు, ఆదరిస్తారు. ఇప్పుడంతా క్షణికోద్వేగాల్ని, తాత్కాలిక భావోద్రేకాల్ని రగిలించి సరిపుచ్చుకుంటున్నారు. ఆ ఉద్రేకాలు పాలపొంగులా థియేటర్ దాటకముందే చల్లారిపోతాయి. అందుకే ఇప్పటి చిత్రాల్లో అత్యధిక భాగం కొద్ది రోజుల తరువాత ప్రేక్షకులకు గుర్తుండవు.

భాష బతకాలంటే పదసృష్టి, భావవ్యక్తీకరణల్లో నిరంతరం కొత్త ప్రయోగాలు జరగాలి. ఓ చిత్రంలో 'మూలిగే నక్క మీద తాటికాయ పడ్డట్లు' అనే సామెతను వాడాల్సి వచ్చింది. అప్పటికే అది ప్రాచుర్యంలో ఉంది. అందుకే అర్థం చెడకుండా కొత్తగా చెప్పాలనుకున్నాను. 'కుంటి కుక్క మీద కొబ్బరికాయ పడ్డట్టు' అని రాస్తే జనం బాగా మెచ్చుకున్నారు. తరువాత అది వాడుకలోకి వచ్చింది. ఇలా పదసృష్టి, ప్రయోగాలు తమిళంలో బాగా జరుగుతుంటాయి. అవి వెంటనే వాడుకలోకి వచ్చేస్తుంటాయి. ఈ విషయంలో ప్రధాన పాత్ర రచయితలదే. ఇప్పటి రచనల్లో నన్ను ఆకట్టుకోగలిగినవి పెద్దగా లేవనే చెప్పాలి. వాటిలో జీవం ఎక్కడుంటోంది?

నాకు అయిదారు భాషల్లో ప్రావీణ్యం ఉంది. నిష్పాక్షికంగా చెప్పాలంటే తెలుగులో అద్భుత శబ్ద సౌందర్యం ఉంటుంది. మన తరువాత తమిళం. ఆ తరువాతే మిగతావి. నేను కేంద్రమంత్రిగా ఉండగా ఒకసారి కోల్‌కతాలో ఒక సమావేశంలో మాట్లాడాల్సి వచ్చింది. అందులో తెలుగు వాళ్లు చాలా మంది ఉండటంతో వాళ్ల కోరిక మేరకు తెలుగులోనే మాట్లాడాను. అందులో ఉన్న బెంగాలీలు తరువాత "తెలుగు వింటుంటే చాలా బాగుందండీ" అని ప్రశంసించారు! అది మన భాష గొప్పదనం. అంతే కాదు... మన కళలు, సంప్రదాయాలు వంటి వాటినీ పరిరక్షించుకోవాలి. భావితరాలకు అందించాలి. ఇందుకోసం జరిగే కృషిలో నా వంతు పాత్రను తప్పనిసరిగా నిర్వర్తిస్తాను.

**- తెలుగు వెలుగు బృందం**




## అమ్మ నేర్పిన భాష

ఎవరు నేర్పారమ్మ ఈ భాషను?
అమ్మ నేర్పిందమ్మ ఈ తెలుగును!
మాధుర్య పదజాల మావికొమ్మల పూల
తావి అంతా తెచ్చు ఈ పునుగును
అమ్మ నేర్పిందమ్మ ఈ తెలుగును!
ఎవరు కూర్చారమ్మ లిపిలోని అందాలు
అచ్చులతో అలరించి హల్లులతో పులకించి?
మాటలన్నీ తేనె ఊటలోనే అద్ది
కమ్మనైనది భాష కవుల కలమున దిద్ది
ఎందరో అద్దారు ఈ సొగసును
అమ్మ నేర్పిందమ్మ ఈ తెలుగును!
అందరూ మెచ్చేలా చేర్చారు జిలుగును
అమ్మ నేర్పిందమ్మ ఈ తెలుగును!

**- అప్పరుసు రమాకాంతారావు, హైదరాబాద్**
**95505 44592**








# భావదీపావళి

మన ఘన సంస్కృతిని నిండా ప్రతిబింబించేవి పండుగలు. అందులోనూ వెలుగుల విందులు చేసేది దీపావళి.

కాల్చేవీ, పేల్చేవి ఎన్ని ఉన్నా రకరకాల దీపాల వరుసలు చూడటమే కళ్లకు వేడుక. అసలు దీపా'వళి' అంటేనే దివ్వెల వరుస.

దీపావళి అమావాస్యను తెలుగులో దివ్వెల అమాస అంటారు. దీపస్తంభాన్ని దివ్వె కంబం అంటాం. దీపాలు పెట్టడాన్ని 'దివ్వెలెత్తు' అంటారు. దీపావళి కాంతుల్లో ఇవి తెలుగు వెలుగులు.

అసలీ పండుగ చేసుకోవడానికి మూలకారణాలు అనూచానంగా చెప్పే సందర్భాలున్నాయి. శ్రీకృష్ణుడు సత్యభామా సమేతంగా వెళ్లి నరక రాక్షసుణ్ని చంపడం అనే ఆనందపు రోజు నుంచి దీపావళి చేసుకోవడం వచ్చింది. బలిచక్రవర్తి తన రాజ్యాన్ని వామనుడికి ఇచ్చేసిన రోజు నుంచి ఈ పర్వనిర్వహణం ఉంది. శ్రీరామచంద్రుడు రావణుణ్ణి సంహరించాక, సీతాసమేతుడై రాజ్యపట్టాభిషిక్తుడైన శుభ సందర్భ దినం నుంచి ఈ పండుగ జరుపుకోవడం ఉంది. అంతేకాదు, విక్రమార్క చక్రవర్తి పట్టాభిషిక్తుడైన రోజు నుంచే ఏటా ఇలా పండగ చేసుకోవడం ఉంది. ఏ కథను బట్టినా, ఏ సందర్భాన్ని బట్టినా దీపావళి జరుపుకోవడం, ఇంటింటికీ వెలుగు మేలి రాకలకు ఎదురుచూడటం ఉంది.

ఇంతటి గొప్ప పండక్కి స్పందించడం ప్రజాజీవనాన్ని ప్రతిబింబించే కవులకు అత్యంత సహజం. ఆనందాలు 'మందికి' చెందడం సంస్కృతిలో భాగం. దీపావళినాడు మార్వాడీలు , లక్ష్మీపూజను లక్షణంగా, వైభవంగా చేస్తారు. అది వారి నుంచి ఇతరులకూ వచ్చింది.

లక్ష్మీ పూజల్లో- లక్ష్మిని ఇంటికి ఆహ్వానిస్తూ ఓ మంగళ హారతి ఇలా పాడతారు:

మహాలక్ష్మీ అని నిన్ను చాలగొల్చితే ఓ లక్ష్మీ నీకింత



జాలమేలా?

పాలసముద్రుని పట్టిరో అని నిన్ను
పలుమారు పిలిచితే పాలించవేవమ్మా!
మంగళం, మహలక్ష్మి మంగళం మంగళం
అలికి పూసిన యింట్లో చిలుకు చల్లితినేను,
మెరపు చూపుతూ రావే అలుకలేలా?
కళకళ నవ్వుచు కలయిండ్ల నెక్కుచు
కలికిముద్దుల చిలుక రావమ్మా,
ఒంటిగానీవు మా యింటికి రావమ్మ
జంట బాయక నావెంట ఉండూ,
కంఠాన మెరిసేటి కంఠహారములిత్తు, ఇంట్లోకి
రావమ్మ ఇపుడూ
॥మంగళం మంగళం॥

ఈ పాటలో జానపదుల్లోని ఓ ప్రేమ పూర్వక అమాయకత్వపు ఆలోచనలున్నాయి. మనకు సంపద లివ్వడానికి లక్ష్మిని ఆహ్వానిస్తూ, వస్తే ఆమెకు మెరిసే కంఠహారాల్ని ఇస్తామనడం అలాంటిదే! జానపద వాఙ్మయంలో భాగమైన సామెతలు దీప సంబంధంగా ఉన్నాయి. 'దీపావళి వర్షాలు ద్వీపాంతరాలు దాటుతాయి; 'దీపావళికి దీపమంత చలి', 'దీపాన వెలిగించిన దివిటీ పెద్ద దైనట్లు', 'దీపం పేరుకు చీకటి పరుగు'; 'దీపముం డగనే నిప్పుకు దేవుళ్లాడినట్లు', 'దీపం ఆరిన తర్వాత దినుసంతా ఒకటే', 'దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి' - అనేవి అందులో కొన్ని మెరుపులు.

కవులు మానవ కల్యాణాన్ని కోరతారు. సమయ సందర్భాల రచనల్లో సైతం ఏదో ఓ భావుకత, ఓ చమత్కారం, ఓ అనుభూతి! ఇలా ఏదో ఒకటి ప్రతిఫలిస్తాయి. తెలుగులో కవులు ప్రధానంగా ఆధునిక కాలంలో దీపావళి కవితలు ముఖేముఖే సరస్వతి అన్నట్లుగా స్పందించి రాసి అందించారు. విహంగావలోకనం చేద్దాం రండి...

1938లో భాగవతుల లక్ష్మీపతిశాస్త్రి 'నీతి దీపావళి' పేర పిల్లల కథల పుస్తకం తెచ్చారు. విషయ సూచికలో 22 దీపాలు అంటూ ఆ కథల పేర్లిచ్చారు.

వైజయంతీవిలాసంలో సారంగు తమ్మయ కవి 'దీపము మన్మథ రాగోద్దీపము' అంటూ అది 'భవ హరము' శుభంకరము అన్నాడు. దాసరి లక్ష్మణస్వామి సేకరణ గ్రంథం 'వర్ణన రత్నాకరం' పద్య సేకరణ గ్రంథాల్లో మంచి పద్యాలకు ఆకరం. అందులో 'విద్యుద్దీపములు' అన్న ఓ ఖండిక ఆరి, వెలిగే దీపాల స్థితిని వర్ణించింది. అది ఓ గునుగు సీసం వంటిది.

తెలుగులెంక తుమ్మల సీతారామమూర్తి చౌదరి 'దీపావళి' ఖండికలో-

వచ్చినది దీపా
వళి మహస్సని ఎట్లు పొంగెద
చచ్చిచావని బక్క బ్రతుకులు
సకల మహినుండన్
ఎపుడు సంతృప్తిని స్వతంత్రత
నెల్లపేదయుననుభవించునొ
అపుడు పొంగెద నిక్కమగు దీపావళిని గను

చున్" అంటూ బీదాబిక్కీ అందరూ సంపదను అనుభవించే ఆర్థిక స్వాతంత్ర్యాన్ని కోరుకున్నారు.

నడవడిక మంచిగా మార్చుకోమని మానవలోకానికి సూచించారు కవికోకిల జాషువా:

ఘనఘనాఘనము చీకటి మేడ వెలిగించు
మెఱపు దివ్వెల నూనె తఱగ లేదు
... ... ...
ఇనబాలకుని దినమ్మున గర్భమునబూను
పొడుపు దిక్సతి కాన్పులుడుగలేదు
... ... ...
విశ్వనిర్మాత చల్లని వీక్షణమున
నేటికిని కెంపు చారగాన్పింపలేదు
మూర్ఖలోకము దినమెల్ల ముగియ లేదు
దీపమున్నది హృదయంబు దిద్దుకొనుము.

చీకటి మేడను వెలిగించే మెఱుపు దీపాలు వెలుగుతూనే వున్నాయి. వాటిని వెలిగించే నూనె తరగడం లేదు. గర్భవతి అయిన పొడుపు దిక్కనే సతి రోజూ సూర్యబాలకుని కంటూనే ఉంది. కాని కాన్పులుడుగలేదు. ఈ విశ్వాన్ని నిర్మించిన సృష్టికర్త లోకాన్ని చల్లగా చూస్తూనే ఉన్నాడు. ఓ మూర్ఖలోకమా సమయం మించి పోలేదు. దీపముంది కనుక హృదయాన్ని దిద్దుకో - అన్నారు. ఇల్లు సరిదిద్దుకో అని కాక హృదయాన్ని సరిదిద్దుకోమనడం విశేషం.

దీపావళి అనగానే ఠకీమని గుర్తుకొచ్చే కావ్యం 'గౌతమీ కోకిల' వేదుల సత్యనారాయణశాస్త్రి భావ కవితా సంపుటి 'దీపావళి'. అందులో నిశీధినితో ఒక అవ్యక్త భావ కవితా వ్యక్తీకరణ, ఒక దుఃఖ వేదనా నివేదనం, హృదయం దహించుకుపోవడం, ఒక ఇమడలేనితనం వంటివెన్నో ఉంటాయి.

జగతి ఈనాటి ఈ మహోత్సవమునందు
మునిగి ఆనందమున బొంగి పోవుచుండ
ఇటు రగుల్కొల్పిరెవరు నీ హృదయమందు
అణచుకొనియున్న ఘోరదుఃఖానలమ్ము

అని నిశీధిని అంటే నేను అంటూ కవి

కాఱుకొన్న యమాస చీకటులనడుమ
నేనొకండనె ఈ శూన్యనిలయమందు
అదురువడిపోయి మరణవాద్యమ్ములట్లు
గుండియలు కొట్టు కొననేడ్చుకొనుచు నుంటి

నన్నాడు.

పైగా నా హృదయం దహించుకొనిపోయే ఈ సందర్భంలో కన్నీటి చుక్కల వల్ల అది చల్ల బడునేమో అంటూ

మూసికొనిపోయె నా నేత్రములు తమంత
రాత్రియే యింక బహిరంతరముల నాకు

అంటాడు.

బయట అమావాస్య రాత్రి చీకటి ఎలాగూ ఉంది. కళ్లు మూసికొని పోవడం వల్ల ఆ కళ్లలో చీకటి ఉంది కనక- బయట, లోనా చీకటే ఉంది అనేది భావుకతకు సంబంధించిన అంశం.

బయట ఇంత వైభవంగా దీపావళి ఉత్సవం ఫెళఫెళార్భాటాలతో జరుగుతూంటే దీపావళి భావకవి-

లోనజ్వలియించుచున్న మహానలమున
కొకస్ఫులింగమెకాదె యీ ఉత్సవాగ్ని అంటారు.

తనలోని చెప్పలేని 'వేదనాగ్ని'కి ఇంత దీపావళి ఒక విస్ఫులింగమేనట. చివరకు 'చిమ్మట' కూడా కవిగారూ ఈ బాణసంచాల మ్రోతల మధ్య మీ జీవితాశల్ని మోగించుకుంటున్నారని అంటుంది.

నన్ను నిరసించే జనం ఆనందంలో నాకు భాగం వద్దు. చిమ్మెట లైన మీరు చేసే ధ్వనులే గానరవాలు నాకంటారు.





'దినములు పరస్పర ప్రతిధ్వనులు'గా అంటే మామూలుగా ఉన్నాయంటారు. ఈ మాట చాలాకాలంగా కవి రసజ్ఞ జనంలో ఒక సామెతలా ఉండిపోయింది. చివరగా వేదులవారు-

ప్రొక్కిన కొలంది కాలితోఁద్రొక్కివేయు
ఈ కఠినలోకమెల్ల బహిష్కృతమ్ము
రండు చిమ్మెటలార ఈ రాత్రివేళ
నావలెన్ పాడుకొను మీరె నాకు సఖులు

అంటారు. మొత్తంపై ఖండికంతా సఖులు, సమాజం, నిరాశ అంశాలతో వేదనాదీపావళే!

ప్రజల గొడవలే 'నాగొడవ'గా రాసిన కాళోజీ దీపావళి దీపాలు కవితలో...

ఊరి వెలుపలనున్న పూరి గుడిశల దూరి
లోని చీకటి బాపలేని దీపాలు
దోచిదాచిన దెంతో దుర్భాగులకు జూప
ధనపూజ చేయించు ధర్మదీపాలు

అంటూ సామాన్య మానవుల బాధలు, దోపిడీదారుల గురించి వాస్తవ చిత్రాలు చెప్పారు.

తెనాలి కవి గోనుగుంట పున్నయ్య 'చెదరు చినుకులు' ఖండకావ్యంలో దీపావళిపై రాసిన కవితలో 'దీపావళి'ని హద్దులు దాటి చేసుకోకండనే అవసర ప్రబోధం ఇలా వ్యక్తమైంది.

'సిరులు గల వారి వైభవపరత తోడ
వీధుల సురేంద్ర సభలు గావింత్రుగాక!
మేరమీరిన యెడల ఈ ఘోరకేళి (దీపావళి)
జాలిగుండెల గరగించు నీరువోలె'

మందుగుండు సామాను కాల్చడం మానుకోండి అనేవరకూ ఈ ప్రబోధం సాగుతుంది.

మందుమండించు టికన్నైన మాయమగుచు
ధవళశాల్యన్న కాంతియు ధవళధౌత
వస్త్రముల చల్వనిగ్గులు బదులునిలిచి
పేదకడుపును తనువు నింపెడిని
గాత!

మందుకాలిస్తే
వెలుగులు వస్తాయి.

తెల్లని వరి అన్నం, తెల్లని చక్కని బట్టలు ఉండి పేదల కడుపులు నిండితే అంతకన్నా వెలుగులు ఏమి ఉంటాయి అన్నారు. తెల్లనివి బాగా వెలగడం సహజం కదా!

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి 'కేళాకుళి' (ఫౌంటెయిన్‌కు తెలుగు) ఖండకావ్యంలో



'దీపోత్సవం' ఖండికలో...

తెలుగు బిడ్డల చేత తివిరి కాల్పించిన
గోగువత్తుల వెలుంగులకు బెదరి
దిబ్బుదిబ్బుగ వారు దివ్వటీల్ కొట్టెడి
ఉత్సాహ
వాక్కుల నొదిగి
నిల్చి

కాళ్లపై బోసిన నీళ్లు లారకమున్న
తిన్నబిడ్డల నోటి తీపి కలరి
మైనంపు వత్తి లేమంట భగ్గనజల్లు
గుగ్గిలపుం బూల కొసలనరసి
దొడ్డిలో పశ్చిమపువైపు తులసికోట
తొలి టపాకాయ ప్రేలుడు నలుకు తగిలి
లేగదుడుకుల నడచుపాలేరు గదిసి
లీల నరుదెంచె దీపావళీ మహస్సు.

గోగువత్తులు- దివిటీలు కొట్టడం, కాళ్లు కడుక్కువచ్చి నోళ్లు తీపి చేసుకోవడం- వంటి వన్నీ జరిగితేనే దీపావళి పర్వ సంస్కృతి ఉన్నట్లు. ఆరోజు కూడా రెండుమూడు సినిమాలు చూసి ఊరుకుంటే మనం సంస్కృతిలో జీవించినట్లు కాదు. 'మధ్యతరగతి మందహాసం'లో సి.నారాయణరెడ్డి 'దీపం ముట్టిస్తున్నావా' కవితలో ఒక తరంవారి సామాజిక వెనుకబాటుతనాన్ని ఎండగడుతూ 'పాప' ద్వారా వర్తమాన తరంలోని చీకటిని పోగొట్టాలని ఆశిస్తూ...

దీపం ముట్టిస్తున్నావా! పాపా!
పాపచ్ఛాయలు సోకని పాలవ్రేళ్లతో
దీపం ముట్టిస్తున్నావా పాపా!
ముట్టించు నీవైనా ముట్టించు
మట్టి దీపమైనా మనసారా ముట్టించు
... నిండు వెలుగులు కోరుకున్న మాకు
నీడలే చేతికందుతున్నాయి
ఇంక మేము దీపాలు ముట్టించలేము
చల్లారిపోయిన మా ఆశయగర్భాల్లో
జ్వాలాముఖిని దట్టించలేము
మంచిని వెలిగించలేని భీరువులం మేము
మయసభలో జారిపడ్డ కౌరవులం మేము
ఇరుకులోయల్లో తలదాచుకున్న మేము
ఎలా నవ్వులు పండించగలం?
ముట్టించు పాపా దీపం
ముట్టించు

అన్నారు.

'అమృతం కురిసిన రాత్రి'లో

బాలగంగాధర తిలక్ 'దీపం' కవిత దీపాల వెలుగుల పార్శ్వాల్ని విప్పి చెబుతుంది.

దీపాల మధ్య చీకటి మెరిసిపోతుంది.

దీపం ఆసరాతో చీకటి నైజాన్ని తెలుసుకో..

పాపం ఆసరాతో మానవుని నైజాన్ని తెలుసుకో..

ఎన్నెన్నో ప్రాణాలు! ఇవన్నీ దీపాలు.

సమాధి మీద దీపం చావుని వెలిగించి చూపుతుంది.. అంటూ సాగుతుందది.

అగ్నిహంస కవితా సంపుటిలో రాళ్లబండి కవితాప్రసాద్ 'వెలిగే చీకటి' అని ఒక కవితా వచనం రాశారు. అందులోని 'దీపం కన్న పసిపాప కదా వెలుతురు; మరి చీకటికి కన్నతల్లెవరు? అనే ప్రశ్న జవాబునివ్వదు కానీ వెలితిని గుండెల్లో మిగులుస్తుంది.

దాశరథి 'ప్రాణదీపం' కవితలో -

'గగనములు పడిపోయి, సాగర
గణము పాతాళమున కింకినగాని
ఈ ప్రాణ దీపము
కాంతి తగ్గదు, సత్యము'

అంటూ ప్రాణదీపానికి ఉన్నకాంతి ఉన్నతం అంటారు. ప్రాణదీపాల ఆనందాలకే కదా ఈ దీపావళైనా. ఏమైనా అద్దేపల్లి రామమోహనరావు 'అంతర్జ్వాల'లో 'దీపావళి కాదు తిమిరావళి' ఖండికలో-

భవిష్యదద్దంలో ముఖం చూసుకుంటే
ఒక కంట్లో సహారా ఎడారీ
ఒక కంట్లో హిందూ మహాసముద్రమూ కనిపించి
రాతివలె స్తంభించిపోయిన
వర్తమాన యువతరం యొక్క బ్రతుకు మెలికలో
ఎక్కడ పడితే అక్కడ చీకటి
ఏ తలుపు తెరిస్తే అక్కడ చీకటి

అంటూ తిమిరావళిని ఆవిష్కరిస్తూ వారి బతుకుల్లో దీపావిష్కరణలు ఆశిస్తారు.

రసరాజు 'రసభారతి' ఖండకావ్యంలో 'దీపలక్ష్మి' మన ఇళ్లలోకి కొన్ని షరతులపై మాత్రమే వస్తుందని మనల్ని ఇలా భయపెడుతున్నారు.

ద్వార బంధాలపై
తోరణమ్ములు
కట్టి
స్వాగతం
బనిన లాభంబు
లేదు
వెండిపళ్లెరమందు
పిండివంటలు పెట్టి
ఆతిథ్యమనిన సంప్రీతి లేదు
దివ్వెల తోటలో పువ్వులు పూయించి
సత్కారమనిన హర్షమ్ము లేదు
వైభవంబీనగా బాణసంచా కాల్చి
కనులవిందనిన సౌఖ్యమ్ము లేదు
ముందు-మీ గుండెలందున ముసురుకొన్న
కరడుగట్టిన కటిక చీకటుల దునిమి
వెలుగు జెండాలనెత్తు-డవ్వేళ నేను
'దీపలక్ష్మి'గ మీ యింట తేజరిలుదు

నిజమే ముందు మనం మన గుండెల్లో కరడుగట్టిన దుష్టభావాల చీకట్లను చీల్చుకోగలిగితే దీపలక్ష్మి మన ఇళ్లకు వస్తుంది. వెలుగు పూస్తుంది. మానవ కల్యాణాన్ని కోరడం కవుల నైజం. వారి భావాలు ఎందరెందరి కలాల మతాబుల వెలుగుల చిందుల్లోనో ఉంటాయి. ఈ చిందడం కొన్ని చిలకరింపులే, మరెన్నో ఉంటాయి. వెలుగుల కవితలు అనంతం.

**- తెలుగు వెలుగు బృందం**



# వేయి వెలుగుల ఆశావళి

దీపావళి, రాగ దీపావళి
అనురాగ దీప్తి కిరణావళి
వేయి వెలుగుల ఆశావళి
హాయి విరిసిన రసకేళి
ఇంటి ముంగిట ముగ్గులు విష్ణుచక్రాలు
ఇల్లాలి నునుసిగ్గుల బుగ్గలపై విచిత్ర చిత్రాలు
మమతల కాంతి ధారలు మతాబులు
కలల చిరునామాలు కాకర పువ్వొత్తులు
మింట తారల తోటి తారా జువ్వల పోటీ
పూలు విరజిమ్ము బుల్లి పిరమిడ్లు చిచ్చుబుడ్లు
బావమరదల మధ్య 'తుపాకుల' సవ్వడి
అత్తకోడళ్ల విరసాల సీమటపాసుల సందడి
కొత్త దంపతుల మధ్య సరసాల సిసింద్రీల అలజడి
నవప్రేమికుల ఊహల 'విమానాల' వరదగుడి
అవినీతి నరకుల అంతిమ హోమావళి
నిఖిలాంధ్ర జగత్తుకు నిత్య దీపికావళి!

**కె.యజ్ఞన్న, విజయవాడ, 0866–2532158**

మిన్ను విరిగి మీద పడినట్లు, కాళ్ళ కింద భూమి రెండుగా చీలి అందులోకి కూరుకుపోతున్నట్లు, సునామీ వస్తున్నట్లు అనిపిస్తుందనుకున్నాను-ఆ వార్త విని! కానీ కథలు, కవితల్లో రాసినట్టు అలా ఏమీ అనిపించలేదు. అంతకంటే మామూలుగా, చాలా సాధారణంగా అనిపించింది. కేవలం మనసంతా స్తబ్దుగా అయింది. అందుకు నాక్కొంచెం చిరాగ్గా కూడా అనిపించింది. ఇంతకీ నేను విన్నది మా అమ్మ అనారోగ్య వార్త.!

# అమ్మ

నన్ను కాదనుకొని, నా ఇంటి నుంచి వెళ్లి పోయి నగరానికి దూరంగా ఓ వృద్ధాశ్రమంలో ఉంటున్న అవిడ చావు బతుకుల్లో ఉందని ఆశ్రమ నిర్వాహకులు కబురు చేశారు. వెళ్లడానికి నాకు తీరిక లేదు. నిజంగానే లేదు. మా అమ్మ పరిస్థితికి మనసు భరించలేని బాధతో మూలుగుతున్నా, ఇక్కడ నేను నిర్వహించాల్సిన విలువైన విధ్యుక్త ధర్మాలున్నపుడు వెంటనే ఎలా వెళ్ళగలను? అన్నిటి కంటే ముఖ్యంగా నేను చాలా సాధారణమైన మనిషిని. సమయం విలువ, డబ్బు విలువ బాగా తెలిసిన మనిషిని. డబ్బుని, మానవ సంబంధాలని త్రాసులో చెరో వైపు వేస్తే డబ్బు వైపే తూగుతుందని నా అభిప్రాయం. అందుకే నాకు రావడం కుదరదని, కావలసిన వైద్య సదుపాయాల్ని చూడమని ఆశ్రమ నిర్వాహకులకు ఏడుపు గొంతుతో చెప్పాను. తర్వాత వారం రోజులకు వీలు చూసుకొని ఇప్పుడు కారులో బయలుదేరాను. ఆశ్రమానికి చేరుకోవడానికి సుమారు గంట ప్రయాణం.

నగర పొలిమేరలు దాటాక కారు మెత్తగా సాగిపోతోంది. చుట్టూ పచ్చటి పొలాలు. నా శరీరం కారుని నడుపుతున్నా మనసు మాత్రం గతంలో జరిగిన సంఘటనలను వీక్షించడం ప్రారంభించింది!

ఆ రోజు ఆఫీసు నుంచి ఇంటికొచ్చేటప్పటికి సాయంత్రం ఏడు గంటలు దాటింది. అప్పటికే పనితో బాగా అలిసి పోయాను.

ఆరంతస్తుల పెద్ద భవనంలో రెండో అంతస్తులో ఉంది మా ఇల్లు. ఇంట్లోకి ప్రవేశించేసరికి విపరీతమైన ఆశ్చర్యం కలిగింది నాకు. ఎందుకంటే ఎప్పుడూ హడావుడిగా గోలగోలగా ఉండే మా ఇల్లు అత్యంత ప్రశాంతంగా ఉంది. ఎందుకో అది భీకర యుద్ధానంతర నిశ్శబ్దంలా అనిపించింది. ఇల్లు పీకి పందిరేసే నా పిల్లలిద్దరూ బుద్ధిగా కూర్చొని చదువుకుంటున్నారు. అలుపూ సొలుపూ లేకుండా నిరంతరం మాట్లాడే దూరదర్శిని మూగబోయి బిక్కు బిక్కుమని చూస్తోంది. యుద్ధంలోని ఇరుపక్షాల జాడ.. అంటే నా తల్లి, నా భార్య ఎక్కడా కనిపించలేదు. ప్రశ్నార్థకంగా పిల్లల వైపు చూశా. మా అమ్మ గది వైపు వేలు చూపించారు. దానర్థం నా భార్య వంటగదిలో వంట చేస్తుంటే నా తల్లి తన గదిలో పడుకుని ఉందన్న మాట! అంటే అలక ప్రారంభమన్న మాట! ఇటువంటి విపత్కర పరిస్థితుల్ని ఎలా ఎదుర్కొవాలో నాకు బాగా తెలుసు.

నిశ్శబ్దంగా దుస్తులు మార్చుకుని, వరండాలో కూర్చొని టీవీ పెట్టాను. వెంటనే వంటగదిలో నుంచి నా భార్య ముఖం బయటకు వచ్చి నా ఉనికిని గమనించి ఉరుముతో కూడిన పిడుగు లాంటి చూపులు విసిరి మళ్ళీ మాయమైంది. టీవీలో ఏదో వార్తా చానెల్లో వస్తున్న ఊకదంపుడు వార్తల్ని దీక్షగా చూస్తున్నట్లు నటిస్తూ అప్పటికి తప్పించుకున్నాను.

రాత్రి పదకొండు! పడకగదిలో నా భార్యను అనునయంగా అడిగాను "ఎందుకా ముభావం? ఏం జరిగింది?" అని.

సమాధానం చెప్పకుండా అటు తిరిగి పడుకొని సన్నగా ఏడవడం ప్రారంభించింది. చాలా బలమైన ఆయుధం అది! భార్య ఏడుస్తూ ఏదైనా విషయాన్ని చెబితే భర్త తేలిగ్గా దారికి వచ్చేస్తాడు. ఆ సంగతి తనకు బాగా తెలుసు. మనసు చివుక్కుమంది.

"ఏం జరిగింది చెప్పు?" రెట్టించాను.

"ఏం చెప్పను! నా బతుకు ఇలా తగలడింది. మిమ్మల్ని చేసుకున్న





పాపానికి ఒక సుఖం లేదు, సంతోషం లేదు! ఆమెకు దగ్గరగా జరిగి "నన్ను చేసుకుని నువ్వేమి నష్టపోయావు? అన్నీ నీ ఇష్టప్రకారమే చేసుకుంటూ బాగానే ఉన్నావు కదా!" మెత్తగా అడిగాను.

"ఆ..బా..గా..నే... బతుకుతున్నాను... హు..." అంటూ ముసుగు తన్ని నిద్రపోయింది.

లాభం లేదనుకొని ఇటు తిరిగి ఆలోచనలో పడ్డాను. ఏం జరిగిందో చెబితే నాకు కాస్త ప్రశాంతంగా ఉండేది. కానీ చెప్పకపోవడం వల్ల అసలేం జరిగిందో అన్న కుతూహలానికి, నా భార్య ప్రత్యర్థి అయినా నా తల్లి ఏం తప్పు చేసిందో అన్న ఆందోళన కలిసి గుండె దడ పెరిగింది. తర్వాత నిద్ర రాలేదు.

అసలీ సమస్యలన్నింటికీ మూలకారణమైన మా అమ్మ మొదటి నుంచీ మాతో పాటు ఉండేది కాదు. కేవలం నెల రోజుల క్రితమే నా దగ్గరకు వచ్చింది. నేను ప్రస్తుతం జీవిస్తున్న విశాఖపట్నం నగరానికి ఏభై కిలోమీటర్ల దూరంలో ఉన్న ఒక పల్లెటూరు మా స్వగ్రామం! నా తండ్రి అచ్చంగా బతకలేని బడిపంతులు. నేను, నా వెనుక ఒక చెల్లి, ఇద్దరమే పిల్లలం. నా చదువంతా మా ఊళ్ళోనూ, చుట్టుపక్కల పట్టణాల్లోనూ సాగింది. తర్వాత నేను విశాఖపట్నంలో ఇంజనీరింగ్ చదివి అక్కడే ఉద్యోగంలో స్థిరపడ్డాను. నా మనసుకి నచ్చిన అమ్మాయిని సాగరతీరం సాక్షిగా ప్రేమించి పెళ్ళి చేసుకున్నాను. నా చెల్లి మాత్రం మా తల్లిదండ్రులు చూపించిన అబ్బాయిని చేసుకుని మా ఊరికి దగ్గరలోనే ఉంటోంది.

కొంత కాలానికి నా తండ్రి పదవీ విరమణ చేశారు. నేను, నా చెల్లి దూరం కావడంతో నా తల్లిదండ్రులకి ఒంటరితనం ప్రారంభమైంది. కాలగమనంలో వృద్ధాప్యంతో వచ్చే అనారోగ్యం నా తండ్రిని నెమ్మదిగా కబళించసాగింది. కొంతకాలానికి ఆయన కాలం చేశారు. దాంతో నా తల్లి మరింత ఒంటరిదయింది. ఆ పల్లెటూళ్లో లంకంత ఇంట్లో ఒక్కతే ఉండటం కష్టం కాబట్టి నా దగ్గరికి రమ్మన్నాను. చిత్రంగా రానంది. ఒకప్పుడు కోడలిగా ఆ ఇంట్లో అడుగు పెట్టి తల్లిగా మారి, పిల్లల్ని పెంచి పెద్ద చేసి తండ్రితో సహజీవనం చేసిన ఆ ఇంటిని, కష్ట సుఖాల్లో చేదోడు వాదోడుగా ఉన్న ఆ ఊరి ప్రజల్ని వదిలి రావడం ఆమెకు ఇష్టం లేదేమో! నేనూ బలవంతం చేయలేదు.

కానీ కాలం ఎప్పుడూ ఒకేలా ఉండదు. అది ఎన్నో కొత్త కొత్త పరిణామాల్ని నిరంతరం సృష్టిస్తూ ఉంటుంది. ఉన్నట్టుండి ఒక రోజు అమ్మ దగ్గర నుంచి ఫోన్ వచ్చింది "ఘోరం జరిగి పోయింది, తొందరగా రా నాయనా!" అని. వీలు చూసుకొని వెళ్ళాను. ఎప్పుడో నాన్న చనిపోయినప్పుడు వెళ్ళాను ఆ ఊరు, మళ్ళీ ఇప్పుడు వెళుతున్నాను. అప్పటి నుంచీ ఇప్పటి దాకా ఆ ఊరి మొహం నేను చూడలేదు. ఒంటరిగా ఉంటున్న అమ్మ ఎలా బతుకుతుందో అని కూడా నేను పట్టించుకోలేదు. అందుకు కారణం నా పనుల ఒత్తిడి!

వెళ్ళగానే అడిగా - "చెప్పమ్మా ఏం జరిగింది? ఉన్న పళంగా రమ్మన్నావు?" అని. అమ్మ ఏడుస్తూ "ఇంట్లో దొంగతనం జరిగింది నాయనా! ఉన్న బంగారమంతా దోచుకుపోయారు" అని ఏడుస్తూ చెప్పింది.

ఆశ్చర్యం వేసింది నాకు. ఈ పల్లెటూళ్లో కూడా దొంగతనాలా? అయినా నాదే తప్పు. మా ఆస్తిపాస్తుల గురించి నా తల్లినెప్పుడూ నేను అడగలేదు. అందుకు కారణం చాలా చిన్నది. అలా అడిగి ఆమె దగ్గరనుంచి నేనేదైనా పొందితే, ఫలితంగా ఆమెను పోషించవలసిన బాధ్యత నా మీద పడుతుందని నా భయం. అలాకాకపోతే ఆ బంగారం ఇంతకాలం నా తల్లి దగ్గర ఎందుకు ఉంటుంది? ఎప్పుడో నా చేతుల్లోకి చేరిపోయేది.

"అయితే ఇప్పుడేం చెయ్యమంటావు? పోయిన బంగారం ఎలాగూ పోయింది, పోలీసులకు ఫిర్యాదు ఇచ్చి ఊరుకుందాం. అంతకంటే ఏం చేస్తాం!" విసుగ్గా అన్నాను.

"ఏమో నాయనా! నాకైతే ఇక్కడ భయంగా ఉంది. ఈ మధ్య ఆరోగ్యం కూడా బాగుండటం లేదు, మాటిమాటికీ రక్తపోటు తగ్గిపోతోంది, రెండు మూడు సార్లు కళ్ళు తిరిగి ఇంట్లో పడిపోయాను. ఏ క్షణానికి ఏం జరుగుతుందో ఎవరు చెప్పగలరు? నన్ను నీ దగ్గరకు తీసుకుపో నాయనా!" అంటూ బతిమాలింది.

"సరే! చూద్దాంలేమ్మా! నేను వెళ్ళగానే నీ కోడలికి కూడా ఒక మాట చెప్పి నీకు ఫోన్ చేస్తాను. అప్పుడు వద్దువుగాని" అని చెప్పి,

వెంటనే దొరికిన బస్ ఏదో పట్టుకొని విశాఖ వచ్చేశా. తర్వాత నా భార్యతో చర్చించి, తర్జన భర్జనలు పడి, లాభ నష్టాలు బేరీజు వేసిన తర్వాత 'కన్న తల్లిని ఒంటరిగా వదిలిన దుర్మార్గుడు' అన్న లోకనింద వస్తుందేమో అని భయపడి చివరకు మా దగ్గరకు తీసుకొచ్చాను.

అప్పుడు మొదలైంది అసలు కథ! అడ కత్తెరలో పోక చెక్క, పిల్లికి చెలగాటం ఎలుక్కి ప్రాణ సంకటం అన్న మాటలకి అర్థం నెమ్మదిగా నాకు తెలిసి వచ్చింది. అటు తల్లి, ఇటు భార్య, ఏంచేస్తాను? అత్తా కోడళ్ళ మధ్య సఖ్యత అనేది చాలా అరుదైన విషయం కదా! అలా... అలా... ఆలోచిస్తూ ఎప్పటికో నిద్రలోకి జారుకున్నాను.



పొద్దున్న లేచేటప్పటికి నా భార్య హడావుడి చేస్తోంది. విషయమేంటని అడిగితే చెప్పింది - మా అమ్మ ఇంట్లోంచి వెళ్ళిపోయిందని. 'హమ్మయ్య!' అనుకున్నాను. నా భార్య మొహంలో కూడా అదే భావం! అంతకు మించిన ఊరట. 'అయినా ఎక్కడికి వెళుతోంది? మా ఊళ్ళో ఉన్న ఇంటికే కదా! పోనీ! ఆమెకు అలవాటైన ప్రదేశం కాబట్టి అక్కడ హాయిగానే బతుకుతుంది' అని నాకు నేను సర్దిచెప్పుకున్నాను. ఆ తర్వాత ఎవరు అడిగినా "ఇక్కడ ఉండలేక మా ఊరు వెళ్ళిపోయింది" అని చెబుతుండేవాడిని. కానీ ఒక రోజు మా ఊరి దగ్గరి నుంచీ చెల్లి ఫోన్ చేసి "అన్నయ్యా! అమ్మ ఎలా ఉంది?" అని అడగటంతో నాకు చెమట్లు పట్టాయి. ఒక క్షణం అర్థం కాలేదు. కొంచెం తేరుకొని "ఆ..ఆ.. బాగానే ఉంది లేవే, నువ్వెలా ఉన్నావు? పిల్లలూ.. బావగారూ ఎలా ఉన్నారు?" అంటూ పొడి పొడిగా మాట్లాడి ఫోన్ పెట్టేశాను.

అంటే నా తల్లి నా దగ్గరినుంచీ సరాసరి ఊరికి వెళ్ళలేదన్నమాట! అయితే ఇప్పుడు ఎక్కడ ఉంది? అసలు బతికే ఉందా? ఎన్నో సందేహాలు. పోలీసు ఫిర్యాదు ఇద్దామనుకున్నాను, కానీ నా పరువు పోతుంది. టీవీల్లో, పత్రికల్లో ప్రకటన ఇద్దామనుకున్నాను, అలా చేస్తే విషయం మొత్తం మా ఊళ్లో వాళ్లకి కూడా తెలిసిపోతుంది. మరి ఎలా? సందిగ్ధావస్థలో పడ్డాను. నా భార్య మాత్రం 'ఇది నా సమస్య కాదు' అన్నట్లు ప్రవర్తించసాగింది. మింగలేక, కక్కలేక, ఎవరికీ చెప్పుకోలేక కొన్ని రోజుల పాటు నరకం అనుభవించాను. అయితే నా సమస్య తీర్చడానికన్నట్లు ఒక రోజు మా అమ్మ ఎక్కడినుంచో ఫోన్ చేసింది. "ఎక్కడున్నావమ్మా నువ్వు? నాకు చెప్పకుండా ఎందుకు వెళ్లిపోయావు? కనీసం ఫోన్ అయినా చెయ్యొచ్చు కదా!" అంటూ కోపంగా అరిచాను. "ఎక్కడికీ వెళ్లలేదు నాయనా! మీ ఊళ్ళోనే ఉన్నాను. ఎవరికీ భారం కాకుండా నా దారి నేను చూసుకున్నాను. నా గురించి నువ్వు ఆరా తీయవద్దు. అవసరమైనప్పుడు నేను నీకు ఫోన్ చేస్తాను" అని చెప్పి పెట్టేసింది. ఆ తర్వాత మళ్ళీ ఇంత కాలానికి ఆశ్రమం వాళ్ళు ఫోన్ చేస్తే తెలిసింది నా తల్లి వృద్ధాశ్రమంలో శేష జీవితం గడుపుతోందని.

అమ్మని చూసి ఎన్నో సంవత్సరాలైంది, ఇంకాసేపట్లో ఆమెని చూడబోతున్నాను, అయినా నాకు ఏ ఉద్వేగ్నతా లేదు.

ఆశ్రమం లోపల ఒక చిన్న గదిలో మంచమ్మీద పడుకొని ఉంది అమ్మ. బాగా చిక్కిపోయి, ఎముకలు కనిపిస్తున్నాయి. అపస్మారక స్థితిలో ఉంది. అందరూ ఉండి కూడా ఎవరూ లేని అనాథలా పడి ఉంది. నాకు కళ్ళల్లో నీళ్ళు తిరుగుతాయనుకున్నాను. కానీ రాలేదు. మంచం పక్కనే నా చెల్లి కూడా ఉంది. ఎప్పుడొచ్చిందో మరి! కళ్ళతోనే దాన్ని పలకరించాను. ఇంతలో డాక్టర్ వచ్చారు. లేచి నిలబడి ఆయనకు నమస్కారం చేశా, పెద్ద సంస్కారవంతుడిలా!

ఆయన తల పంకించి, "చూడండి బాబూ! మీ అమ్మగారి పరిస్థితి బాగాలేదు. మూత్రపిండాలు బాగా దెబ్బతిన్నాయి. ఇలాగే కొనసాగితే ఆమె మనకి దక్కకపోవచ్చు. కాబట్టి మూత్రపిండ మార్పిడి చేయాలి. మిమ్మల్ని, మీ చెల్లెల్నీ పరీక్షించి ఎవరిది సరిపోతుందో చెబుతాను, అదీ మీకు నచ్చితేనే!" అంటూ చావు కబురు చల్లగా చెప్పాడు.

నాకు గుండె గుభేల్మంది. ఎందుకంటే మా ఇద్దరిదీ సరిపోకపోతే బయట నుంచి కొనాలన్నా చాలా ఖర్చు అవుతుంది. అంత డబ్బు చావు బతుకుల్లో ఉన్న నా తల్లి మీద ఖర్చు పెట్టడం నాకు ఇష్టం లేదు. తర్వాత మా ఇద్దరికీ వైద్య పరీక్షలు నిర్వహించి నా మూత్రపిండం సరిపోతుందని తేల్చారు! నాకు మెదడు మొద్దుబారిపోయింది. ఏం చెప్పాలో పాలుపోలేదు. "డాక్టర్‌గారూ! ఆలోచించుకొని ఏ విషయమూ చెబుతాను" అని బయటపడ్డాను.

ఇంటికి వెళ్ళగానే విషయం నా భార్యకు చెప్పాను. "నీకు బుద్ధుందా!

నీ మీద మేమంతా ఆధారపడి ఉన్నాం, రేప్పొద్దున్న నీకు జరగరానిది ఏమైనా జరిగితే మా బతుకేం గాను? అయినా రేపో మాపో చనిపోయేదాని కోసం ఎందుకంత ఆరాటం? పిచ్చి వేషాలు వెయ్యకు!" అని గట్టి హెచ్చరిక చేసింది.

ఆమె వాదన సబబే అనిపించింది. చిత్రంగా, తన ప్రాణాన్ని పణంగా పెట్టి అమ్మ నాకు జన్మనిచ్చిందన్న విషయం ఆ క్షణాన నాకు గుర్తుకు రాలేదు.

ఈ విషయం మీద నిశ్శబ్దంగా ఉంటే మంచిదని అనిపించింది. 'చెల్లి కూడా ఉంది కదా, అదే చూసుకుంటుందిలే' అనుకుని తప్పించుకున్నాను. మూడు రోజుల తర్వాత ఆఫీసులో హడావిడిగా ఉన్నప్పుడు నా ఫోన్ మోగింది. "అన్నయ్యా! అమ్మ చనిపోయిందిరా! నేను ఇక్కడ ఉండలేను... మన ఊరు వెళ్ళిపోతాను" చెల్లి ఏడుస్తూ చెప్పింది. "అరే... అలాగా.. సరే.. నేను ఇప్పుడే మళ్ళీ మాట్లాడతాను" అని పెట్టేశాను. ఒక సమస్య తీరిపోయింది అనిపించింది. లేకపోతే ఎంత మానసిక వ్యథ. ఇది నేను సంబరం చేసుకోవలసిన రోజు. నా భార్య కళ్ళల్లో ఆనందం వెల్లి విరిసే రోజు. వెంటనే నేను చెయ్యవలసిన పనులు, ఊళ్ళో మా ఆస్తులని చేజిక్కించుకోడానికి ఏం చెయ్యాలా అని ఆలోచించడంలో మునిగి పోయా.

ఆదివారం వేళ భార్యా పిల్లలతో టీవీ చూస్తూ విశ్రాంతిగా కాలక్షేపం చేస్తున్నాను. వారమంతా పనితో అలిసి పోయే నేను, ఆదివారం మాత్రం కుటుంబ సభ్యులతోనే గడిపి విశ్రాంతి పొందుతాను. ఇంతలో గంట మోగింది. వెళ్ళి తలుపు తీసి చూసాను. ఎవరో అపరిచిత వ్యక్తి!.

"నమస్కారం సార్! ఆశ్రమం నుంచి వస్తున్నాను, మీతో కొంచెం పని ఉంది" అని తనను తాను పరిచయం చేసుకున్నాక లోనికి ఆహ్వానించాను. నా భార్య అదోలాచూసి వంటగదిలోకి వెళ్ళిపోయింది. పిల్లలిద్దరూ వాళ్ళ గదిలోకి వెళ్ళారు. "చెప్పండి! ఏంటి విషయం?" ప్రశ్నించాను. నా గొంతులో చిరాకు అప్రయత్నంగా తొంగి చూసింది. ఎందుకంటే ఆ ఆశ్రమంతో బంధం ఎప్పుడో తెగిపోయింది కదా! "అయ్యా! అమ్మగారు చనిపోయాక గదిలోని ఆమె వస్తువులని తీసినప్పుడు ఈ సంచి దొరికింది. దాని పైన 'నా కుమారునికి అందజేయండని' రాసి ఉండటంతో, ఆశ్రమం వాళ్ళు నాతో వీటిని పంపించారు" అంటూ నా చేతిలో పెట్టి, కనీసం మంచినీళ్ళు కూడా తాగకుండా వెళ్ళిపోయాడు.

సంచి తెరిచి చూశాను. ఒక ఉత్తరం, దానితో పాటూ పాత పత్రికలో చుట్టిన చిన్న డబ్బుకట్ట. ఉత్తరం చదవసాగాను.

'బాబూ, నిన్ను వదిలి దూరంగా పారిపోయిన తల్లి ఇప్పుడు ఉత్తరం రాసిందేంటా అని ఆశ్చర్యపోకు! ఇప్పుడంటే నిన్ను వదులుకోగలిగాను, కానీ పది నెలలు నిన్ను నా కడుపులో మోసి నీకు జన్మనిచ్చాక నిన్ను వదులుకోలేక పోయాను. నువ్వు చిన్నప్పుడు రోగాలు రొప్పులు పాలైతే కాపాడుకోడానికి నేనూ, మీ నాన్నా మా అరచేతులు అడ్డం పెట్టాం. ఎంతో జాగ్రత్తగా నిన్ను పెంచాం. నువ్వు పెరిగి విద్యాబుద్ధులు నేర్చుకొని వృద్ధిలోకి వస్తుంటే ఎంతో సంతోషించాం. మేం అర్ధాకలితో ఉండి నీ కడుపు నింపాం. నీకు రెక్కలొచ్చాక మమ్మల్ని వదిలి ఎగిరిపోయావు. అది లోక రీతి అనుకొని సర్దుకుపోయాం. నీకు భారం కాకూడదని దూరంగానే ఉన్నాం. కానీ మీ నాన్నగారు చనిపోయాక ఒంటరి దాన్నైపోయాను. దిక్కు తోచని పరిస్థితుల్లో నీ పంచన చేరాను. నా కొడుకే కదా అనుకున్నాను. కాని నువ్వు నన్ను ఒక భారంలా భావించావు. నీ సుఖసంతోషాలకి ఒక అవరోధం అనుకున్నావు. అందుకే నీ నుంచి దూరంగా పారిపోయాను.

'ఈ ఆశ్రమంలో నాలాంటి వాళ్ళు ఎంతోమంది ఉన్నారు. వాళ్ళకి సేవ చేయడంలో సంతృప్తి పొందుతున్నాను. మానవ సేవే మాధవ సేవ అనుకొని ఆనందపడుతున్నాను. ఈ మధ్యన ఎవరో అభాగ్యుడికి మూత్రపిండం అవసరం పడిందని తెలిసింది. నేను స్వచ్ఛందంగా దానం చేస్తానని చెప్పాను. పిచ్చివెధవలు ఊరికే తీసుకోనన్నారు. లక్ష రూపాయలు చేతిలో పెట్టారు. అవి కూడా నీకే అందేలా ఏర్పాటు చేస్తున్నా. ఈ డబ్బులు నీకు ఊరికే ఇస్తున్నాననుకోకు! నేను నీ ఇంటిలో ఉన్నన్ని రోజులూ ఎంతో అవస్థ పడ్డావు. నాకు తిండి పెట్టడమే ఘనకార్యంలా భావించావు. దానికి ప్రతిఫలంగా ఈ డబ్బులు నీకు ఇస్తున్నాను. తక్కువవుతాయని బాధ పడకు, ఊళ్ళో పొలం, పుట్రా కూడా నీ పేరు మీదే రాశా. అప్పటికీ సరిపోకపోతే ఈ పేదదాన్ని క్షమించి వదిలెయ్!

'నేను, మీ నాన్నా నిన్ను ఎంతో ప్రేమించాం. ప్రేమంటే ఇవ్వడమే కదా! ప్రేమంటే... సంతోషపెట్టడం. కనీసం నీ పిల్లలకైనా వాటిని నేర్పు. అప్పుడు ఈ ప్రపంచం ఎంత మారినా మానవత్వం అనేది కొంచెం మిగిలి ఉంటుంది...

'సరే... ఇదంతా లోకరీతి నాయనా. ఊరుకోలేక రాశాను. అయినా నువ్వు నా బిడ్డవి. నీ మీద నాకేమీ కోపం లేదు. నీ భార్య కూడా పిచ్చిది. తనూ అందరి కోడళ్ళలానే ఆలోచించింది. పిల్లల్ని బాగా చూసుకోండి. నీ ఆరోగ్యం జాగ్రత్త. ఉంటాను. -- అమ్మ'

ఉత్తరం మసకబారింది హఠాత్తుగా. చేతుల మీద రెండు కన్నీటి బొట్లు. చేతులు సన్నగా వణుకుతున్నాయి. కళ్ల వెంట నీళ్లు కారిపోతున్నాయి. అవును... నిజంగానే నేను ఏడుస్తున్నాను. అవును... నాక్కూడా ఏడుపొచ్చింది!

**సన్నిహిత్**
డి.ఆర్.డి.ఓ., సీనియర్ సైంటిస్ట్,
హైదరాబాద్. 94909 56012

# చిట్టి చేతులు మంచి రాతలు

ఊహాశక్తి ఏ సూత్రాలకూ కట్టుబడదు. దానికి క్రమశిక్షణ లేదు. ఎవరి ఊహాశక్తి వారిదే. మరొకరితో పోలిక ఉండదు. అది నిజమనే నిర్ధరణా లేదు. అలా అని అబద్ధమని అనలేం.

- బ్రిటీష్ తత్వవేత్త బెర్ట్రాండ్ రస్సెల్

బాల్యంలో ఎన్నో ఊహలు, ఎన్నో కోరికలు, ఎన్నో ఆలోచనలు, సందేహాలు చిన్నారి బుర్రల్ని నిత్యం తొలచివేస్తుంటాయి. వాటిని పంచుకోవడానికి ఓ వేదిక ఉంటే? లేత గులాబీ మొక్కల్లాంటి పిల్లలకు స్వేచ్ఛనిస్తే వారి మెదడు వికసిస్తుంది. సృజన మొగ్గలు తొడిగి అందమైన పూలు పూస్తుంది. దీనికి వాస్తవ రూపం అందించారు తూర్పుగోదావరి జిల్లాలోని ఈ పాఠశాల విద్యార్థులు. ఇదంతా చేసిన వీరు ఏ కార్పొరేట్ పాఠశాలల్లోనో చదువుతున్నారనుకుంటే పొరపాటే. అందరూ సర్కారు బడుల్లోని పిల్లలే.

ఇంట్లో పెద్దవారు, బడిలో ఉపాధ్యాయులు పత్రికలు చదువుతుంటే ఆ చిన్నారులు ఆసక్తిగా గమనించేవారు. తాము కూడా బడిలో జరిగే విషయాలను, తమ భావాలను మిత్రులతో పంచుకుంటే బాగుంటుందని ఆలోచించారు. దాన్ని ఆచరణలో పెట్టడానికి ప్రధానోపాధ్యాయుడు అంగర గోపాలకృష్ణాచార్యులు (కృష్ణశ్రీ) సహకరించారు. సాటి పిల్లలకు నచ్చేలా, ఇతరులు మెచ్చేలా చిట్టి పత్రికను ఎలా తయారు చేయాలో వారికి వివరించారు. దగ్గరుండి వారితో రాయించారు. వారి మెదళ్లను సాన పెట్టారు. చిన్నారుల ప్రయత్నాన్ని నిరంతరం ప్రోత్సహించారు.

మొదట తూర్పుగోదావరి జిల్లా పెదపూడి మండలం కుమారప్రియం మండల పరిషత్ ప్రాథమిక పాఠశాలలో 2009లో 'చిట్టి ఊహలు' పత్రిక ప్రారంభమైంది. ఇక్కడ పిల్లలే సంపాదకులు. ఇందులో చిన్నారులు తమకిష్టమైన పొడుపు కథలు, బొమ్మలు, సామెతలు, కవితలు, వింతలు - విశేషాలు, గళ్ల నుడికట్టు, శాస్త్ర విశేషాలు, లేఖలు, సూక్తులు, దినచర్య ప్రాధాన్యం, బడిలో జరిగే కార్యక్రమాల వివరాలు సహా అనేక అంశాలు చేర్చారు. పాత సంచిక కంటే కొత్తదాన్ని మరింత వైవిధ్యంగా తీర్చిదిద్దుతున్నారు. భిన్న అంశాలను స్పృశిస్తూ రెండు నెలలకోసారి సంచిక వెలువరిస్తున్నారు. వీటిలో కొన్ని ముద్రితమైతే మరికొన్ని లిఖిత రూపంలో వస్తున్నాయి. ఒక్కోదాన్ని 100 నుంచి 200 ప్రతులు తయారు చేసి తోటి విద్యార్థులకు పంచుతున్నారు. ఇది ఇతర విద్యార్థులకు స్ఫూర్తినిచ్చింది. ఆ తర్వాత జిల్లాలో మరో ఆరు చోట్ల బడి పిల్లలే స్వయంగా పత్రికలు నడపడం ప్రారంభించారు. ప్రస్తుతం నైకవోలు, సంధిపూడి, వీరవరం, కొమ్మనాపల్లి, గైగోలుపాడు, కాకినాడ



**తెలుగంటే ఇష్టం**

పులిమేరు బడిలో 4వ తరగతి చదువుతున్నపుడు గోపాలకృష్ణ మాస్టారి ప్రోత్సాహంతో నేను, మా మిత్రులు 'చిట్టి ఊహలు' పత్రిక ప్రారంభించాం. దీనికి మేమే సంపాదకులం. నేను రాసిన కథలు, గేయాలు, బొమ్మలు పత్రికలో వచ్చాయి. దీనికోసం ఎన్నో పుస్తకాలు చదివేవాళ్లం. తెలుగు భాషపై ఎంతో ఇష్టం ఏర్పడింది. ప్రస్తుతం దివిలి ఉన్నత పాఠశాలలో చదువుతున్నాను. ఇలాంటి చిన్నపత్రికను ఇక్కడ కూడా మిత్రులతో కలిసి ప్రారంభించాలనుకుంటున్నా.

**- మావే సునీల్, 6వ తరగతి**



**పక్క ఊళ్లకూ...**

'చిట్టి ఊహలు' పత్రికను నేనే కాదు మా ఇంట్లో అందరూ చదువుతారు. మా ఊరిలోనే కాదు తెలిసిన వారి ద్వారా చుట్టుపక్కల ఊళ్లకూ వెళ్తోంది. ఇతర పాఠశాల విద్యార్థులు కూడా వాళ్లు తయారు చేసిన పత్రికను మాకు ఇస్తున్నారు. దీనివల్ల చాలా విషయాలు తెలుస్తున్నాయి. పత్రికలో నా పేరు చూసుకుని చాలా మురిసి పోయాను. 'నాయకర్ స్ఫూర్తి' పత్రిక నాకు బాగా నచ్చింది. ముఖ్యంగా అందులో వచ్చే కథలంటే నాకు చాలా ఇష్టం.

**- డి.నందిని, 5వతరగతి**

పట్టణంలో ప్రభుత్వ పాఠశాలల్లో చిన్నారుల పత్రికలు వెలువడుతున్నాయి. కొన్ని చోట్ల స్థానికులే పిల్లల పత్రికల ముద్రణ ఖర్చుల్ని భరిస్తున్నారు.

చిట్టి పత్రికల నిర్వహణ వల్ల పిల్లల్లో నాయకత్వ లక్షణాలు, బృందంగా కలిసి పనిచేసే తత్వం, సృజనాత్మకత, భావ వ్యక్తీకరణ, స్వీయ పఠన సామర్థ్యం వృద్ధి చెందుతున్నాయి. 'గుణాత్మక విద్య' అన్న కల ఆచరణ రూపం దాల్చుతోంది.

ఆలోచన మంచిదైతే అది విస్తరిస్తుంది. ఆచరణలో సరదా తోడైతే పిల్లలు దాన్ని వెంటనే అక్కున చేర్చుకుంటారు. అందుకే ఈ చిన్నారి పత్రికలు కేవలం పాఠశాలలకే పరిమితం కాలేదు. అపార్ట్‌మెంట్లు, వీధుల్లోని పిల్లలంతా బృందాలుగా ఏర్పడి చిట్టి పత్రికల రూపకల్పనలో నిమగ్నమయ్యారు. కాకినాడలో ఇంద్రపాలెంలోని ఒక వీధిలో ఇదే స్ఫూర్తితో ఒక పత్రిక నడుస్తోంది. దీన్ని మొదలుపెట్టింది గోపాలకృష్ణాచార్యులు కుమారుడు సందీప్ కావడం విశేషం. వీధిలో వేర్వేరు పాఠశాలల్లో చదివే ఓ ఐదుగురు విద్యార్థులు పోగయ్యారు. డిసెంబరు 2011లో 'జాబిల్లి' పేరిట ఒక మాస పత్రికను స్థాపించారు. ఇది రాతప్రతిగానే వెలువడుతోంది. పిల్లలే కూర్చొని స్వయంగా ప్రణాళిక రూపొందించుకుని దీన్ని తయారు చేస్తారు. వేర్వేరు తావుల్నించి విషయసేకరణ చేసి చక్కని దస్తూరితో పేజీలు నింపుతారు. తర్వాత నకళ్లు తీసి అందరికీ పంచుతారు. ఈ జిరాక్సు కాపీలకు అయ్యే ఖర్చు



మా బడిలో **'చిట్టి ఊహలు'** పత్రిక రావడం నాకు చాలా సంతోషాన్నిచ్చింది. అందులో నా పేరు రావడం మర్చిపోలేని రోజు. మా నాన్నగారికి పత్రికను చూపించి, చదివి వినిపించాను. ఆయన చాలా ఆనందించారు. మా పత్రికను చూసి కైకవోలులో **'చిన్నారి కృత్యాలు'**, **'పొదరిల్లు'**, **'ధ్రువతార'**, **'నాయకర్ స్ఫూర్తి'** వంటి ఎన్నో పత్రికలు వచ్చాయి. మేము గ్రంథాలయంలో బాలసాహిత్యం చదువుతాం. అందులో నచ్చిన చతుర్లు, పొడుపు కథలు, గేయాలు, పాటలు, సూక్తులు, సామెతలను పత్రికలో వేస్తాం. గోడపత్రికల్లో కూడా పెట్టుకుంటాం. మీకు తెలుసా మా తరగతిలో ప్రథమ స్థానం నాదే.

**– పి.విజయకుమారి**

చిట్టి ఊహలు

పాఠశాలలో చిన్నారుల సభ

Failure is nothing but sucess postponed

పొదరిల్లు



భరించటానికి 'జాబిల్లి నిధి' పేరుతో ఒక డిబ్బీని కూడా ఏర్పాటు చేసుకున్నారు. ఈ పత్రికను ఆదరించే పెద్దలు స్వచ్ఛందంగా ఇచ్చే మొత్తాన్ని ఇందులో కూడబెడతారు. పిల్లల మనస్సుల్లో ఒక సదాశయాన్ని బలంగా నాటితే ఎంతటి సత్ఫలితాల్ని ఇస్తుందనటానికి ఇది ఉదాహరణ.

ప్రస్తుతం పోటీ పేరుతో పిల్లలు తీవ్ర ఒత్తిడికి గురి అవుతున్నారు. బండెడు పుస్తకాలు, హోంవర్కులు, వాటిని పూర్తి చేయడానికి ట్యూషన్లు. వాటితోనే వారి సమయమంతా గడిచిపోతోంది. ఫలితంగా పిల్లలు ఆలోచన, విశ్లేషణ శక్తి, ప్రశ్నించే తత్వాన్ని కోల్పోతున్నారు. బట్టీ పట్టి మార్కులు తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. ఇలాంటి వాటినుంచీ బయటపడేందుకు ఈ చిన్నారులు చేస్తున్న ప్రయత్నాలు ఉపకరిస్తాయి.

**- తెలుగు వెలుగు బృందం**

## స్వేచ్ఛనిద్దాం - ప్రోత్సహిద్దాం



పిల్లల్ని మంచిగా మలిచే అత్యుత్తమ మార్గం వారిని సంతోషంగా ఉంచడమే అంటారు ఆస్కార్ వైల్డ్. ఇంట్లో ఒకరిద్దరు పిల్లల్ని ఇలా ఉంచడం ఇబ్బంది కాదు గానీ తరగతిలోని పిల్లలందర్నీ అలా ఉంచడం కాస్త కష్టమైన పనే. బాలల ప్రపంచాన్ని పిల్లలకు అందుబాటులో ఉంచితే సంతోషంగా ఉంటారు. ఆటలంత ఆనందంగా పాఠాలుంటే, పాటలంత ఆహ్లాదంగా చదువులుంటే పిల్లలు చక్కగా విద్యనభ్యసిస్తారు. పాతికేళ్లుగా పిల్లలే ప్రపంచంగా వారి మధ్యే మసలుతున్న నేను వారి నుంచి ఎన్నో నేర్చుకున్నాను. వారిని అతి సమీపంలో నుంచి పరిశీలించాక నా అనుభవం నాకు ఎన్నో పాఠాలు, గుణపాఠాలు నేర్పింది. అందులోంచి వికసించిన ఆలోచనే 'చిట్టి ఊహలు'.

సర్వశిక్షా అభియాన్ 2006-07లో నిర్వహించిన బాలసాహిత్యం రూపకల్పన, ముద్రణ కార్యక్రమంలో జిల్లా తరపున రాష్ట్ర రిసోర్స్ గ్రూప్‌లోనూ పాల్గొన్నాను. ఆ ప్రేరణతో నా పాఠశాలనే ప్రయోగశాలగా మార్చి పిల్లలకు బాలసాహిత్యాన్ని చేరువ చేశాను. తర్వాత విద్యార్థులతో స్వయంగా పత్రిక ప్రారంభింపజేశాను. సాటి ఉపాధ్యాయులు, అధికారుల మద్దతుతో అది నిర్విఘ్నంగా సాగుతోంది. చిట్టి పత్రికలు ఇతరులకు స్ఫూర్తిగా నిలవడం సంతోషాన్ని, ధైర్యాన్నిచ్చింది. ఈ విజయం పూర్తిగా పిల్లలదే.

**- అంగర గోపాలకృష్ణాచార్యులు**
ప్రధానోపాధ్యాయులు, ఎం.పి.పి.ప్రాథమిక పాఠశాల,
కుమారప్రియం, తూర్పుగోదావరి

## 1991 వచ్చాక... చెప్పు

ఒక రోజు మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారింటికి ఉదయాన్నే ఒక వ్యక్తి వచ్చారు. ఆయనకు మర్యాదలు చేసి కుర్చీలో కూర్చోబెట్టారు ఇంట్లో వారు. కాసేపటికి శాస్త్రిగారు వచ్చారు. పరిచయాలు అయ్యాయి. వచ్చినాయన సంభాషణ మొదలుపెట్టాడు. 1940 సంవత్సరం నుంచీ తేదీలతో సహా తన సాహిత్య కార్యక్రమాలు, రచనా వ్యాసంగం, తన జీవితంలో అతి అల్పమైన విషయాల్ని సైతం విడిచిపెట్టకుండా పూసగుచ్చినట్లుగా చెప్పుకుపోతున్నాడు. చెప్పేవాడికి వినేవాడు లోకువ అన్నట్లుగా సంభాషణ సా...గిపోతోంది. 1945..., 1950..., 1960... సంవత్సరాల్ని ఉట్టంకిస్తూ మాట్లాడేస్తున్నారాయన. మధునాపంతుల వారిలో అసహనం పెరిగిపోతోంది. విలువైన కాలం అనవసర వాగాడంబరంగా శుష్కక్షణాలుగా మిగిలిపోవడం ఆయనకు ఇష్టం లేదు. ఇక ఆగలేకపోయారు. ఒక్కుదుటన లేచారు. అక్కడకు కొంచెం దూరంలో ఉన్న తమ్ముడి కుమారుడు చంటితో- "ఒరేయ్, చంటీ... 1991 వచ్చాక... చెప్పు." పెద్దగొంతుతో అరచి తన గదిలోకి వెళ్లిపోయారు.



# తల్లిదండ్రులూ...

# తవసుప్రభాతం!

ఇద్దరు తమిళులు ఒకరికొకరు ఎదురైతే తమిళంలోనే మాట్లాడుకుంటారు. మహారాష్ట్రీయులు ఎదురైతే మరాఠీలో మాట్లాడతారు. బెంగాలీలు బెంగాలీలో, కన్నడిగులు కన్నడ భాషలో మాట్లాడుకుంటారు. అదే ఇద్దరు తెలుగువారు మాట్లాడుకోవాల్సి వస్తే ఆంగ్లంలో సంభాషిస్తారు. తమిళనాడు, కర్ణాటక, మహారాష్ట్ర... ఇలా అనేక రాష్ట్రాల్లో ఏ కాన్వెంటులో పిల్లల్ని చేర్పించినా అక్కడి మాతృ భాష తప్పనిసరిగా నేర్చుకోవాలి. కానీ మన రాష్ట్రంలో అలాంటి నియమమే లేదే...! తెలుగు ఔన్నత్యం గురించి 2012లో ప్రత్యేకంగా చెప్పుకోవాల్సిన అవసరం లేదు. ఎందుకంటే కన్నడ మహారాజు శ్రీకృష్ణ దేవరాయలు 'ఆముక్త మాల్యద'లోనే ఈ భాష ప్రాశస్త్యం గురించి చెబుతూ 'దేశ భాషలందు తెలుగు లెస్స' అని ప్రవచించాడు. ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్ అనే ఖ్యాతీ మనకు సొంతం. ప్రముఖ తమిళ కవి సుబ్రహ్మణ్య భారతి 'సుందర తెలుంగు' అన్నాడు. దురదృష్టవశాత్తూ మనం మాట్లాడాల్సినంత, వినియోగించుకోవాల్సినంత స్థాయిలో మన భాషను వినియోగించుకోవడంలేదు. ఈ దురదృష్టం దేశంలో మరో భాషకి లేదు. వృత్తిపరమైన వికాసానికి, మంచి ఆదాయం కోసం, మన జీవితాలు రాణించడం కోసం తెలుగును విస్మరించి, ఆంగ్లం నేర్వడాన్ని ఒక అవసరంగా ఈతరం పెద్దలు భావిస్తున్నారు. ఆర్థిక వికాసాన్ని కోరుకోవడం ప్రాథమిక సంస్కారం. అయితే సంస్కృతిపై కాకుండా ఆర్థికవృద్ధిపైనే ఆధారపడటం తగదు. వాడుకలో లేని జలాశయంలో నీరు తెట్టుకట్టినట్లే వినియోగంలో లేని భాష అంతరించిపోయే ప్రమాదం ఉంది. భాషనే కాదు.. మన సంస్కృతి సంప్రదాయాలనూ మరిచిపోతున్నాం. అంతెందుకు...? గురజాడ అప్పారావు, వేమన, సుమతి శతకకారుడి గురించి చెప్పమంటే 50 మంది పిల్లల్లో ఇద్దరైనా చెప్పలేరు. ఉద్యోగం, వృత్తివిద్యల్లో ఉన్నవారు తెలుగుభాషని పక్కనపెట్టి ఇతర చదువులకు ప్రాధాన్యం ఇస్తున్నారు. ఇంతకంటే దురదృష్టం ఏమైనా ఉంటుందా? ఈ బాధ్యత పెద్దలది. 'పెద్ద బాలశిక్ష' గురించి పెద్దలకి తెలియదు. సమగ్రమైన వ్యావహారిక జ్ఞానాన్ని ప్రసాదించడానికి శతాబ్దాల క్రితమే దీనిని మనకు అందించారు. సుమతీ శతకం, ఎక్కాలు, పాటలు, తిథి, వార, నక్షత్రాల పేర్లు, నెలల పేర్లు, దేశభక్తుల కథలు, పద్యాలు.. ఇవన్నీ ఈ పుస్తకం ద్వారా మనకు వాటి అవసరం తెలియని వయసులోనే రంగరించి నేర్పారు. మన జాతి వారసత్వం, మన సంప్రదాయాలను చెప్పేవే ఇవన్నీ. ఆరో ఏట చదువుకున్న 'పెద్ద బాలశిక్ష' పాఠాలు ఇరవయ్యో ఏట ఉపయోగపడవచ్చు. ఐటీ రంగంలో నిష్ణాతులైనవారూ ఒక్క వేమన పద్యాన్ని చెప్పలేరు. ఇది పెద్దలు పిల్లలకిస్తున్న దురదృష్టం. దసరా, సంక్రాంతి వంటి పండుగల పరమార్థం మనవాళ్లకి తెలియడం లేదు. ఆయనం అంటే ఏమిటి? రుతువులు అంటే ఏమిటి? అనేవీ తెలియవు. భాషద్వారా, భాష కారణంగా మనకు దక్కే వైభవాన్ని దూరం చేసుకుంటున్నాం.



**తెలుగు మాట్లాడకపోవడం గర్వకారణమా?**

మనిషి రానురానూ ఒక ఆర్జన యంత్రంగా మారిపోతున్నాడు. తమ పిల్లలు తెలుగు మాట్లాడలేకపోవడాన్ని చాలామంది తల్లిదండ్రులు గర్వకారణంగా భావిస్తున్నారు. ఇంజినీరింగ్, ఎంబీఏలు చేయమంటూ పిల్లలపై ఒత్తిడి తీసుకురావడం వల్ల వారు మానసికంగా కుంగి ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. పిల్లల అభిరుచుల కంటే పెద్దల లక్ష్యాలు పిల్లల నెత్తిన రుద్దుతున్నారనిపిస్తోంది. ఈ పిల్లల్లో ఎవరు గాయకులవగలరో, చిత్రకారులు కాగలరో, క్రీడాకారులు కాగలరో మనకు తెలీదు. తెలిసే అవకాశమూ లేదు. రచనా వ్యాసంగం వైపు నా తండ్రి నన్ను ప్రోత్సహించి ఉండకపోతే నేనూ ఓ సాధారణ గుమాస్తాగా మిగిలిపోయి ఉండేవాడిని. మన సమాజం, సంస్కృతి, భాష గొప్పతనాన్ని గర్వంగా భావించాలని ముందుగా పెద్దలకి తెలియజెప్పాలి. తల్లిదండ్రులకు, పిల్లలకు మధ్య ఉన్న దూరం భర్తీ కావాలి. ఒక్కమాటలో చెప్పాలంటే చికిత్స అనేది పెద్దల నుంచే ప్రారంభం కావాలి. భాషా వైభవం తెలియాలంటే వైభవం అంటే ఏమిటో తెలియని బాల్య దశలోనే ఆ రుచిని వేదంలాగా పసివాడికి అందించాలి. జ్ఞాపకశక్తి పరంగా మన మెదడు అత్యద్భుతంగా పనిచేసేది ఆ వయసులోనే. తెలుగుభాషకి చికిత్స పసితనంలోనే ప్రారంభం కావాలి. అది పెద్దలు చేయాలి. భాషపట్ల అభిమానం ఆత్మగౌరవం స్థాయిలో నిలవాలి. తమిళులు తమిళం మాట్లాడడం గర్వంగా భావిస్తారు. తెలుగువారు ఆంగ్లం మాట్లాడడం విజయంగా భావిస్తారు. రుగ్మత ఇక్కడ ఉంది. ఇక్కడే ఉంది.

**- గొల్లపూడి మారుతీరావు**

# యూదులు భాషాయోధులు



రెండు వేల ఏళ్ల అజ్ఞాతవాసాన్ని వీడి జాతిజనుల నాలుకలపై నాట్యమాడుతున్న ఇరవై రెండు అక్షరాల చరిత్ర ఇది. మృతభాషగా మారిపోయిందనుకున్న 'పలుకు' తిరిగి ప్రాణం పోసుకుని జాతి మాతృభాషగా మారిన ఉజ్వల ఘట్టానికి అక్షరీకరణ ఇది. ప్రజల్లో జాతీయతా భావాన్ని రగిల్చి... ఓ జాతిని పునర్నిర్మించుకున్న భాషా యోధుల అసమాన పోరాటకథ... తెలుగు వారందరికీ స్ఫూర్తినందించే అపూర్వ విజయగాథ...

హిబ్రూ... నేటి ఇజ్రాయిల్ జాతీయ భాష. అక్కడి ప్రజల్లో 75 శాతం (59 లక్షలు) మందికి అమ్మభాష. అదే 130 ఏళ్లు వెనక్కి వెళ్తే, ఆ గడ్డపై ఆ భాష మాట్లాడే వారు ఒక్కరు కూడా లేరు. ఆ మాటకొస్తే ప్రపంచంలోనే లేరు. అలాంటి దశ నుంచి అతి తక్కువ సమయంలో అంత మంది మాతృభాషీయులను ఎలా సముపార్జించుకోగలిగింది?

అస్సేరియన్ లేదా యూదు లిపికి చెందిన హిబ్రూది దాదాపు మూడు వేల ఏళ్ల చరిత్ర. హల్లులు తప్ప అచ్చులు లేని ఇరవై రెండు అక్షరాల భాష ఇది (ఇలాంటి వాటిని 'అబ్జాద్'లుగా పిలుస్తారు). బైబిల్‌ను తొలిసారిగా ఈ భాషలోనే రాశారు. క్రీ.శ. రెండో శతాబ్దం వరకూ పాలస్తీనా (నేటి ఇజ్రాయిల్) వాసుల మాతృభాషగా ఉండేది. ఆ తర్వాత ఆ స్థానం కోల్పోయింది. అప్పట్లో కారణాంతరాల వల్ల యూదులు పాలస్తీనాను వదిలి వెళ్లాల్సిన పరిస్థితి తలెత్తింది. అక్కడి నుంచి ప్రయాణాన్ని ప్రారంభించి ఆసియా, ఆఫ్రికా, అమెరికా, యూరప్ ఖండాల్లోని అనేక ప్రాంతాల్లో స్థిరపడ్డారు. మన దేశానికీ (కేరళ, ఆంధ్రప్రదేశ్) వచ్చారు. ఈ వలస యూదులు క్రమేణా స్థానిక భాషల ప్రభావంతో తమ పలుకును కోల్పోయారు. అయితే... వారి 'ప్రార్థనా భాష'గా మాత్రం హిబ్రూ కొనప్రాణంతో నిలిచింది.

## ఒకే జాతి... ఒకే భాష

రెండు సహస్రాబ్దాలు గడిచాక, క్రీ.శ 18వ శతాబ్దంలో యూదు జాతీయత తెరపైకి వచ్చింది. వందల ఏళ్ల కిందట చెల్లాచెదురైపోయిన యూదులందరూ తమ మాతృభూమికి తిరిగి రావాలనుకున్నారు. తమకంటూ ఒక ప్రత్యేక దేశం ఉండాలని భావించారు. ఒక్కరొక్కరుగా పాలస్తీనాకు రావడం ప్రారంభించారు. స్థానికంగా భూములను కొనుగోలు చేస్తూ స్థిరపడ్డారు. పాలస్తీనా భూభాగంలో యూదులు అత్యధికంగా ఉన్నపుడే ప్రత్యేక దేశం సిద్ధిస్తుందన్న భావన ఈ వలస ఉద్యమానికి స్ఫూర్తిగా నిలిచింది. 1881లో దాదాపు 35 వేల మందితో తొలి విడత వలస మొదలైంది. అలా అలలుగా వలసలు సాగుతూ 1905 నాటికి ప్రపంచ యూదు జనాభాలో అత్యధిక శాతం పాలస్తీనాకు తిరిగి చేరుకున్నారు. ఈ క్రమంలో తాము జాతిగా ఎదగడానికి, స్థిరపడటానికి హిబ్రూ ఒక చోదక శక్తిగా పని చేస్తుందని వారు గుర్తించారు. భాషాపునరుద్ధరణ ఉద్యమానికి నడుంకట్టారు. ఇలాయజర్ బెన్ యెహుదా లాంటి భాషావేత్తలు దాన్ని ముందుండి నడిపించారు.

క్రీ.శ.1870 ప్రాంతంలో తూర్పు యూరప్, ఉత్తరాఫ్రికా, యెమన్‌లలో ఉండే యూదు మగవారిలో 50 శాతం మంది మాత్రమే హిబ్రూలో ఉండే ప్రార్థనలను అర్థం చేసుకొనగలిగేవారు. 20 శాతం మంది హిబ్రూను చదవగలిగేవారు. పశ్చిమ దేశాల్లో ఉండే వారికి ఆ మాత్రం కూడా వచ్చేది కాదు. మాట్లాడేవారు ఎవరూ లేరు. ఆ తర్వాత నలభై ఏళ్లలో హిబ్రూ, యూదుల దేశీయ భాష అయింది. హిబ్రూ భాషా పునరుద్ధరణ రెండు దశల్లో జరిగింది (లిఖిత, వ్యావహారిక భాషా పునరుద్ధరణ).

## 'కొత్త'గా రాశారు

క్రీ.శ. 1850 వరకూ హిబ్రూ భాషలో మత సాహిత్యం తప్ప మరే ఇతర రచనా లేదు. ఆ సమయంలో ప్రారంభమైన 'హస్కలాహ్' ఉద్యమఫలితంగా హిబ్రూలోనే రచనలు చేయాలని కవులు, రచయితలు నిర్ణయించుకున్నారు. బైబిల్‌లోని భాషను వినియోగించి రాయడం మొదలుపెట్టారు. కానీ వేల ఏళ్ల నుంచి ప్రార్థనా భాషగా మాత్రమే ఉన్న హిబ్రూలో పద సంపద పెరగలేదు. శాస్త్ర, సాంకేతిక రంగాలకు సంబంధించిన అంశాలను వివరించడానికి కావాల్సిన విస్తృతమైన, ఆధునిక పదసంపద అందులో కొరవడింది. అప్పట్లో హిబ్రూ మొత్తమ్మీద ఉన్న

మూలపదాలు ఎనిమిది వేలు మాత్రమేనంటే పరిస్థితిని ఊహించుకోవచ్చు.

ఈ అవరోధాలను అధిగమించడానికి 1886లో మొదటిసారిగా మెండలె మెచర్ స్ఫెలిమ్ అనే రచయిత ప్రయత్నించారు. బైబిల్ హిబ్రూతోపాటు ఇతర దేశీయ భాషల నుంచి పదాలను తీసుకుని రచనలు చేశారు. భావాలను వ్యక్తీకరించడానికి సరిపోయే పదాలు లభ్యమవక పోతే... హిబ్రూ ఉచ్చారణతో, వ్యాకరణంతో దగ్గరి సంబంధమున్న భాషల నుంచి పదాలను తీసుకునేవారాయన. సమకాలీన రచయితల్లో ఈ శైలి సంచలనం సృష్టించింది. అంతా దీన్ని అనుసరించడం ప్రారంభించారు. ప్రసిద్ధ యూరోపియన్ పుస్తకాల అనువాదం మొదలైంది. 19వ శతాబ్దం ఆరంభంలో ఈ రచయితలందరూ పాలస్తీనాకు తిరిగి రావడం ఆరంభించారు. కాల్పనిక రచనలు మొదలయ్యాయి.

## యోధుడా... వందనం

**'భాషా పునరుద్ధరణ ఉద్యమాలను లోతుగా అధ్యయనం చేస్తే ఒక విషయం స్పష్టంగా అర్థమవుతోంది. ఏ జాతి భాష అయితే నిర్లక్ష్యానికి గురవుతుందో... ఆ జాతీయుల నుంచే భాషా పునరుద్ధారకులు ఉద్భవిస్తారు. తిరుగుబాటుకు కేంద్రంగా మారతారు. సమైక్యతకు ప్రతీకగా నిలుస్తారు'**

ఈనార్ హౌగర్ అనే ప్రసిద్ధ అమెరికన్ భాషావేత్త మాటలివి. ఇలియేజర్ బెన్ యెహుదాకు ఈ మాటలు పూర్తిగా వర్తిస్తాయి. అతి ప్రాచీనమైన ప్రార్థనా భాషను దేశీయ భాషగా, యూదు జాతి మాతృభాషగా మార్చడంలో ఆయన 'ఉత్ప్రేరక' పాత్ర పోషించారు. హిబ్రూను బతికించుకోవడమే తన జీవితానికి పరమార్థమన్నట్లుగా కృషి చేశారు.

లిథువేనియా (ఒకప్పటి రష్యా)లోని లుజ్కి గ్రామంలో జనవరి 7, 1858న యెహుదా జన్మించారు. మతాచారాల్లో భాగంగా మూడేళ్ల వయస్సులో హిబ్రూ నేర్చుకోవడం ప్రారంభించారు. పన్నెండేళ్లప్పుడు ఆయన్ను దగ్గర్లోని మతపరమైన శిక్షణా సంస్థలో చేర్పించారు. కానీ అక్కడ యెహుదా లౌకిక భావనలను అలవరచుకున్నారు. ఫ్రెంచ్, జర్మన్, రష్యన్ భాషలను ఔపోసన పట్టారు. ఆ తర్వాత పైచదువులకు డ్యూనాబర్గ్‌కు వెళ్లారు. ఇక్కడ 'హషాహర్' పేరిట ఓ హిబ్రూ పత్రిక వచ్చేది. యూదు జాతీయతపై అందులో ప్రచురితమయ్యే కథనాలు చదువుతూ ఆ భావాలను వంటబట్టించుకున్నారు. 1877లో ఆయన చదువు పూర్తయింది. అదే సమయంలో ప్రపంచవ్యాప్తంగా జరుగుతున్న సాంస్కృతిక పరిరక్షణోద్యమాలు యెహుదాను ప్రభావితం చేశాయి. మాతృభూమికి తిరిగి వెళ్లి తమ సంస్కృతిని కాపాడుకోవాలని ఆశించారు. యూదులందరూ ఒక జాతిగా ఎదగాలంటే ఒకే మాతృభాష ఉండాలని భావించారు. అది హిబ్రూనే కావాలని కోరుకున్నారు.

తన భావాలను సాటివారితో పంచుకోవడానికి హిబ్రూ పత్రికలను వేదికలుగా మలుచుకున్నారు. మొదటిసారిగా 1879లో 'జ్వలిస్తున్న ప్రశ్న' శీర్షికన ఆయన వ్యాసం 'ది డాన్' పత్రికలో ప్రచురితమైంది. ఆ తర్వాత వరుసగా రాశారు. యూదులందరూ వేర్వేరు భాషలు మాట్లాడుతూ, వివిధ దేశాల్లో ఉండటం వల్ల వారికంటూ అస్తిత్వం ఉండట్లేదని, తిరిగి పాలస్తీనాకు వెళ్లాలని, హిబ్రూ భాష మాట్లాడాలని రాతలతో పిలుపునిచ్చేవారు. ఆ తర్వాత వైద్య విద్యను అభ్యసించడానికి పారిస్ వెళ్లారు. సాటి యూదులతో అక్కడ హిబ్రూలో మాట్లాడటం ప్రారంభించారు. సంభాషణల్లో తప్పులు దొర్లుతున్నా కూడా ప్రయత్నాన్ని విరమించలేదు. మిత్రులూ ఆయన్ను అనుసరించారు. అప్పుడే తమ భాషను వ్యావహారికం చేసుకోగలమన్న నమ్మకం ఆయనకు చిక్కింది. అందుకు తగిన ప్రణాళికలను రూపొందించుకుని 1881లో యెహుదా పాలస్తీనాకు తిరిగి వచ్చారు. జెరుసలేంలో స్థిరపడ్డారు. హిబ్రూను జాతిజనుల గుండెచప్పుడుగా మార్చడానికి ఆయన మూడు పద్ధతులను అనుసరించారు. అవి... ఇళ్లలో హిబ్రూ, పాఠశాలల్లో హిబ్రూ, పదాల సృష్టి.



యెహుదా

మొదట్లో ఆయన ప్రయత్నాలకు తీవ్ర వ్యతిరేకత వ్యక్తమైంది. యూదులందరూ హిబ్రూను దైవభాషగా కళ్లకద్దుకునేవారు. సాధారణ వ్యక్తులు అందులో మాట్లాడకూడదని భావించారు. తీవ్ర భావోద్వేగాలతో ముడిపడిన అంశమిది. అందర్నీ సమాధానపరిచే బాధ్యతను యెహుదా, ఆయన స్నేహితులు స్వీకరించారు.

## చేసి చూపించారు

హిబ్రూను తిరిగి బతికించుకోవాలంటే మాతృభాషీయులను సృష్టించాలని భావించారు యెహుదా. తన ఇంట్లోనే ఆధునిక హిబ్రూను మాతృభాషగా మాట్లాడగలిగే తొలి చిన్నారిని తయారు చేయాలని కంకణం కట్టుకున్నారు.

యెహుదా 1882లో తన చిన్ననాటి స్నేహితురాలు దేబొరా జోనాస్‌ను పెళ్లి చేసుకున్నారు. ఆమె మాతృభాష రష్యన్. యెహుదా తన తొలి సంతానాన్ని హిబ్రూలోనే పెంచాలని మొదట్లోనే ఆమె దగ్గర మాట తీసుకున్నారు. ఆ దంపతులకు అబ్బాయి... ఇతామర్ బెన్ అవీ జన్మించాడు. అతనికి హిబ్రూనే మాతృభాషగా చేయడానికి యెహుదా ఎన్నో జాగ్రత్తలు తీసుకున్నారు. ఇంట్లో ఆ పిల్లాడి ముందు ఎవరూ హిబ్రూ తప్ప వేరే భాష మాట్లాడకుండా చేశారు. ఇంటికి వచ్చే అతిథుల చేత ఆ కుర్రాణ్ని హిబ్రూలోనే పలకరింపజేసేవారు. చివరకు పక్షుల కిలకిలరావాలు, జంతువుల అరుపులు కూడా ఇతామర్‌ను విననిచ్చేవారు కాదు. అవి వింటే హిబ్రూ ఉచ్చారణ ధ్వనులు కాకుండా ఇతరాలు కూడా ఉంటాయనే ఆలోచన ఆ చిన్నారికి కలుగుతుందన్నది ఆయన భయం. పొరుగు వారందరూ పిల్లవాణ్ని ప్రత్యేకంగా గమనించేవారు. ఇదంతా ప్రకృతి విరుద్ధమని కొందరు యెహుదాను నిందించేవారు. అమ్మ రష్యన్‌కు చెందినదైతే అబ్బాయికి హిబ్రూలో మాటలు వస్తాయా అని వేళాకోళమాడేవారు. వారి దెప్పుళ్లను నిజం చేసేలా నాలుగేళ్ల దాకా ఇతామర్‌కు మాటలు రాలేదు. ఆ తర్వాత వచ్చాయి. అదీ హిబ్రూలోనే.

పూర్తి స్థాయి హిబ్రూ మాట్లాడగలిగే తన కొడుకునే సజీవసాక్ష్యంగా చూపిస్తూ భాషోద్యమాన్ని యెహుదా ముందుకు తీసుకెళ్లారు. ఈ



స్ఫూర్తితో ఆయన స్నేహితులు 10 మంది తమ పిల్లలనూ హిబ్రూలోనే పెంచనారంభించారు. క్రమేణా మాతృభాషీయుల సంఖ్య పెరిగింది.

అయితే... యెహుదాకు కొత్త అవాంతరం వచ్చి పడింది. కొడుకు రోజువారీ జీవితంలో వాడే వస్తువులను, తినే పదార్థాలను హిబ్రూలోనే పరిచయం చేయాల్సి వచ్చేది. సైకిల్, బొమ్మ, ఐస్‌క్రీం, చేతి రుమాలు తదితర పదాలకు హిబ్రూలో సరైన మాటల్లేవు. దాంతో ఆయనే కొత్త పదాలను కనిపెట్టడం ప్రారంభించారు. పాత 'సాహిత్యాన్ని వెతికి, అందులోని పదాలకు నూతన అర్థాలనిస్తూ కొత్త వాటిగా మలిచారు. గతించిన పదాలను తిరిగి వాడుకలోకి తెచ్చారు. మొత్తమ్మీద ఆయన 229 నామవాచకాలను, 32 విశేషణాలను, 20 క్రియా పదాలను సృష్టించారు. అవి నేటికీ వాడుకలో ఉన్నాయి.

**పాఠశాలల్లో విప్లవం**

కొత్త విషయాలను పిల్లలు తొందరగా నేర్చుకుంటారు. సార్వజనీన సత్యమిది. దీన్నే ఉపయోగించుకున్నారు యెహుదా. పాఠశాలల్లో హిబ్రూలో బోధన జరిగితే కొత్త తరానికి ఆ భాష అలవడుతుందని భావించారు. కానీ, పాలస్తీనా బళ్లలో రష్యన్, ఫ్రెంచి, యిడ్డీష్ భాషల్లోనే బోధన జరిగేది. అలాంటి పరిస్థితుల్లో 1882లో జెరుసలేంలోని 'ఎల్లియ్ ఇజ్రాయెలేట్ యూనివర్సిల్లే'లో అధ్యాపకుడిగా యెహుదాకు ఉద్యోగం వచ్చింది. అక్కడి ప్రధానోపాధ్యాయుడిని ఒప్పించి హిబ్రూ బోధన ప్రారంభించారు. 'బెర్లిట్జ్ పద్ధతి'లో దీన్ని నేర్పేవారు. భాషా బోధనలో ఇది విజయవంతమైన శైలి. వ్యాకరణాలు తదితర క్లిష్టమైన వాటి జోలికి పోకుండా మాట్లాడుతూ, మాట్లాడిస్తూ నేర్పించే పద్ధతిది. ఒకపక్క విద్యార్థులకు హిబ్రూని నేర్పుతూనే పాఠ్యాంశాలనూ అందులోనే బోధించేవారు. కానీ ఉన్నత విద్యకు పనికిరాని భాషను తమ పిల్లలకు నేర్పవద్దని తల్లిదండ్రులు విరుచుకుపడ్డారు. యెహుదా పట్టువిడవలేదు. దాంతో కొన్ని నెలల్లోనే పిల్లలు హిబ్రూలో మాట్లాడగలిగే స్థాయికి వచ్చారు.

ఈ స్ఫూర్తితో ఇతర ఉపాధ్యాయులు తమ పాఠశాలల్లో హిబ్రూను బోధించడం ప్రారంభించారు. మొత్తం 60 మంది కలిసి 'హిబ్రూ ఉపాధ్యాయుల సంఘం'గా ఏర్పాటయ్యారు. వారి కష్టానికి ప్రతిఫలంగా ఆధునిక హిబ్రూను మాట్లాడగల తొలితరం తయారైంది. ఈ విజయం వెనుక ఆసక్తికర కారణం ఉంది. అమ్మానాన్నలు వద్దన్నా పిల్లలు ఇష్టపడి హిబ్రూను నేర్చుకున్నారు. ఎందుకంటే, ఆ భాష పూర్తిగా వ్యక్తిగత అవసరాలకు ఉపయోగపడేదిగా భావించారు. ఇళ్లలో పెద్దవాళ్లకు అర్థం కాకుండా తమలో తాము మాట్లాడుకోవడానికి దీన్ని వాడేవారు. దాంతో తప్పక పెద్దలూ ఆ భాషను నేర్చుకోవడం ప్రారంభించారు.

**భాషామతల్లికి పురిటినొప్పులు**

హిబ్రూ పునరుద్ధరణలో అత్యంత కీలక దశ

## పద సృష్టికి పది సూత్రాలు

యూదులు భాషాపునరుద్ధరణ కోసం 10 మార్గాలను అనుసరించారు. వాటి ద్వారా వేల కొత్త మాటలను వాడుకలోకి తెచ్చారు.

**1. పాత హిబ్రూ సాహిత్యంలోని పదాలకు కొత్త అర్థాలను ఇవ్వడం.**

ఉదా: 'కిద్మా'... ఆధునిక హిబ్రూలో ఈ పదానికి అర్థం 'పురోగతి'. దీన్ని బైబిల్ నుంచి తీసుకున్నారు. అందులో దీని అర్థం 'తూర్పు'. సాధారణంగా అన్ని సమాజాల్లోనూ తూర్పు దిక్కును ప్రగతి, పురోగతులకు చిహ్నంగా వర్ణించడం సహజం. దీన్ని గమనంలోకి తీసుకునే 'కిద్మా'కు కొత్త అర్థం ఇచ్చి ఉంటారు. ఈ పద్ధతిలోనే xashmal (విద్యుత్తు), mexena (యంత్రం) తదితరాలకు ప్రాణం పోశారు.

**2. పాత సాహిత్యంలోని మాటలకు మార్పులు చేసి కొత్త అర్థాన్ని తీసుకురావడం.**

ఉదా: 'త్సెలెం'... బైబిల్‌లో ఈ మాటను 'చిత్రం' గురించి చెప్పేందుకు వాడారు. దాన్ని ఆధునిక హిబ్రూలో 'మత్లెమా'గా మార్చుకుని 'కెమెరా'కు పర్యాయంగా వినియోగిస్తున్నారు.

**3. పాత సాహిత్యం నుంచి ధాతువులను తీసుకుని, వాటి సాయంతో కొత్త పదాలను తయారు చేయడం.**

ఉదా: 'x.v.r.' ఇది ఒక ధాతువు. దీనికి అర్థం... 'అనుబంధం'. దీన్ని ఉపయోగించుకుని 32 పదాలను సృష్టించారు. xaver... స్నేహితుడు, xevra... పరిశ్రమ, xibur... మిశ్రమం; ఇలా అంతర్లీనంగా 'అనుబంధం'తో ముడిపడ్డ ప్రతి మాటనూ ఈ ధాతువు నుంచి రూపొందించారు. అలాగే...'p.k.d.' ఇది మరో ధాతువు. దీన్నుంచి 24 పదాలను పుట్టించారు.

**4. హిబ్రూ వ్యాకరణంతో సరిపోయే ప్రత్యామ్నాయాలను ఇతర భాషల నుంచి స్వీకరించి, వాటికి హిబ్రూ పదాలను జోడించి కొత్త మాటలను రూపొందించడం.**

ఉదా: 'ya', 'on' ఇవి అరబిక్ ప్రత్యయాలు. దీంతో రూపొందించిన హిబ్రూ మాటలివీ...

| హిబ్రూ మాట | అర్థం | ప్రత్యయం జోడిస్తే | వచ్చిన కొత్త అర్థం |
|---|---|---|---|
| సెఫెర్ | పుస్తకం | సిఫ్రియా | గ్రంథాలయం |
| మాతార్ | వాన | మిత్రియా | గొడుగు |
| ఇర్ | నగరం | ఇర్యా | నగరపాలక సంస్థ |
| అవిర్ | గాలి | అవిరాన్ | విమానం |
| ఎత్ | సమయం | ఇతాన్ | పత్రిక |

**5. ధాతువులకు హల్లులను పూర్వపదాలుగా చేర్చి కొత్త పదాలను తయారు చేయడం.**

ఉదా: 'mi' అనేది ఒక హల్లు దాన్ని మూడు ధాతువులకు పూర్వపదంగా చేసి మూడు పదాలను రూపొందించారు.

మిస్కాల్ - అర్థం, మిబ్రాక్ - టెలిగ్రాం, కేబుల్, మిద్గాం - నమూనా

**6. నామవాచకాలకు క్రియావిశేషణాలను కలిపి కొత్త పద సృష్టి**

ఉదా: 'al' అంటే 'లేదు' 'xut' అంటే 'తీగ' రెంటిని కలిపితే 'al-xut '... తీగల్లేని సమాచార వ్యవస్థ

**7. నామవాచకాలకు స్వల్ప మార్పులు చేసి క్రియా పదాలను తయారు చేయడం**

ఉదా: 'సాబూన్' అంటే 'సబ్బు'. (హిందీలో కూడా ఇదే పదం వాడుకలో ఉండటం గమనార్హం) దీన్ని 'సెబెన్'గా మార్చారు. దీనికర్థం... 'సబ్బు రుద్దుకోవడం'

**8. రెండు పదాలు కలిపి మూడోది సృష్టించడం.**

ఉదా: మిగ్దాలర్ - దీపస్తంభం. ఈ పదంలో... 'మిగ్దాల్'(స్తంభం), 'అర్'(కాంతి) అనే మాటలున్నాయి. మద్క్సోం - థర్మామీటర్. 'మద్'(కొలత), 'క్సోమ్'(ఉష్ణోగ్రత)ల కలయిక ఇది.

**9. ఇతర భాషా పదాలను మార్పులతో వాడటం**

ఉదా: 'adib' ఈ అరబిక్ పదానికి అర్థం... 'మంచి పద్ధతి'. దీన్ని 'adiv'గా మార్చి హిబ్రూలోకి తీసుకున్నారు. ఇక్కడ దీనికిచ్చిన అర్థం... 'మర్యాద'

**10. మరుగున పడిన హిబ్రూ మాటలను గుర్తించి తిరిగి వినియోగంలోకి తేవడం.**

పదాల సృష్టి. తమ భాషను సుసంపన్నం చేసుకోవడానికి కవులు, రచయితలు, ఉపాధ్యాయులు, వృత్తి నిపుణులు తదితర అన్ని వర్గాల వారూ కలిసికట్టుగా పని చేశారు. ఆధునిక సమాజావసరాలకు అనుగుణంగా కొత్త పదాలను పుట్టించారు. ఈ పదాల ప్రామాణికతను నిర్ధరించడానికి, వాటిని ప్రజల్లోకి విస్తృతంగా తీసుకెళ్లడానికి యెహుదా, ఆయన స్నేహితులు 'హిబ్రూ భాషా సంఘా'న్ని (ప్రస్తుత హిబ్రూ అకాడెమీకి పూర్వ రూపం) ఏర్పాటు చేశారు. తాము రూపొందించిన పదాలను ప్రజలందరూ ఈ సంఘానికి పంపేవారు. అందులోని సభ్యులు వాటిని పరిశీలించి, ఏమైనా మార్పులుంటే చేసి ప్రజల్లోకి తీసుకెళ్లేవారు. అలాగే, యువతీ యువకులతో 'సామాజిక దళాల'ను ఏర్పాటు చేశారు. సభలు, సమావేశాలు పెట్టి హిబ్రూను ప్రచారం చేయడం, కొత్త మాటలు వాడుకలోకి తేవటం ఈ దళాల కర్తవ్యం.

మరో ప్రభావవంతమైన వేదిక కూడా అవసరమని భావించి 'హజ్వీ' పేరిట పత్రిక ప్రారంభించారు. యెహుదానే సంపాదకునిగా వ్యవహరించేవారు. ప్రజలకు ఆసక్తికరమైన అన్ని అంశాలతో వార్తలు ఇచ్చే వారు. వాటితో పాటు సంఘం నిర్ధరించిన పదాలను జాబితాలను ఎప్పటికప్పుడు పత్రికలో ప్రకటించేవారు.

వీటి కారణంగానే టర్కీ పాలకుల (అప్పట్లో పాలస్తీనా వారి ఆధీనంలోనే ఉండేది) ఆగ్రహానికి గురయ్యారు. తిరుగుబాటును ప్రోత్సహిస్తున్నాడంటూ యెహుదాను అరెస్టు చేశారు. ఏడాది జైలుశిక్ష విధించారు. దీనిపై యూదుల్లో నిరసనలు వెల్లువెత్తడంతో వెనక్కి తగ్గి కారాగారం నుంచి విడుదల చేశారు. ఆ సమయంలో యెహుదా భార్య క్షయ రోగంతో చనిపోయారు. కొద్దిరోజులకే ముగ్గురు పిల్లలు పదిరోజుల వ్యవధిలో కంఠవాతంతో కన్నుమూశారు. వ్యక్తిగతంగా కోలుకోలేని దెబ్బలు తగిలినా యెహుదా నిలబడ్డారు. మిగిలిన పెద్ద కొడుకు ఇతామర్, మరో అబ్బాయిని చూసుకోవడానికి మరో వివాహం చేసుకున్నారు. మొదటి భార్య చెల్లెలయిన ఆమె యెహుదాకు ఇంటాబయటా చేదోడువాదోడుగా నిలిచింది.

## నవశకానికి నాంది

పందొమ్మిదో శతాబ్దం ఆరంభానికి పరిస్థితులు మారాయి. యెహుదా, ఆయన స్నేహితుల ఇళ్లలో 'మాతృభాషీయులు'గా ఎదిగి, వారి పాఠశాలలో చదువుకున్న చిన్నారులు యుక్తవయస్సులోకి వచ్చారు. హిబ్రూను మరింతగా ముందుకు తీసుకెళ్లడంలో కీలకపాత్ర పోషించడం ప్రారంభించారు. 'యూదుడా... హిబ్రూ మాట్లాడు' పేరిట యెహుదా కుమారుడు ఇతామర్ ఓ ఉద్యమాన్ని నిర్వహించాడు. చివరికి అందరి ప్రయత్నాలూ ఫలించి... 1909లో తొలి హిబ్రూ నగరం 'టెల్ అవివ్' ఏర్పాటైంది. పాలన మొత్తం హిబ్రూలోనే జరిగేది. బోర్డులు, సూచికలు అన్నీ ఆ భాషలోనే. ఈ స్ఫూర్తితో పాలస్తీనాలోని మిగిలిన నగరాలూ హిబ్రూను అనుసరించాయి. అపుడే జరిగిన 'ప్రపంచ యూదు సమ్మేళనం'లో హిబ్రూను తమ జాతి అధికారిక భాషగా స్వీకరిస్తూ తీర్మానం చేశారు.

1910లో 17 సంపుటాలతో యెహుదా 'సమగ్ర హిబ్రూ పద నిఘంటువు'ను రూపొందించడం ప్రారంభించారు. దీనిపై రోజుకు 18 గంటలు కష్టపడేవారు. హిబ్రూ పుట్టినప్పటి నుంచి వాడిన ప్రతి మాటనూ నిఘంటువులోకి తీసుకొచ్చారు. అహోరాత్రాలూ పని చేయడంతో ఆరోగ్యం దెబ్బతింది. మరోవైపు... అప్పటికే పాలస్తీనా బ్రిటిష్‌వారి అధికార పరిధిలోకి వచ్చింది. కొన్ని తప్ప యూదు కుటుంబాలన్నీ హిబ్రూనే మాట్లాడుతున్నాయి. దాన్ని దేశ అధికార భాషగా ప్రకటించాలని పాలకులపై యూదు ప్రముఖులు, విద్యావేత్తలు, రచయితలు, సాధారణ ప్రజలు ఒత్తిడి తెచ్చారు. ఫలితంగా 29.11.1922న హిబ్రూను పాలస్తీనా అధికార భాషగా ప్రకటించారు. యూదుల భాషా పునరుద్ధరణోద్యమానికి పరిపూర్ణ ఫలితం దక్కింది.

తన స్వప్నం సాకారమైన నెలకే యెహుదా తనువు చాలించారు. 64 ఏళ్ల వయస్సులో క్షయ వ్యాధితో మరణించారు. అంత్యక్రియలకు 30 వేల మంది హాజరయ్యారు. తుదిశ్వాస వరకూ యెహుదా నిఘంటు రచనను కొనసాగిస్తూనే ఉన్నారు. మొత్తం ఆరు సంపుటాలను ప్రచురించారు. మిగిలిన సంపుటాల బాధ్యతలను భార్య, కుమారుడు చేపట్టారు. 1959 నాటికి సమగ్ర నిఘంటువును పూర్తి చేశారు. అప్పటికే స్వతంత్ర దేశంగా ఇజ్రాయిల్ (1948లో) ఏర్పాటైంది. యెహుదా లాంటి త్యాగధనులను స్మరించుకుంటూ హిబ్రూను జాగ్రత్తగా కాపాడుకుంటూ, దాని అభివృద్ధికి పటిష్ఠ చర్యలు తీసుకుంటూ ఇజ్రాయిల్ ముందుకు సాగుతోంది.



### నేతలూ దారి చూపుతారు!

ఇజ్రాయిల్‌లో రాజకీయ నాయకులు కూడా కొత్త పదాలను సృష్టించడంలో ముందుంటారు. అలాంటి వారికి ఉదాహరణ మోషే షారెట్. ఆ దేశ రెండో ప్రధాన మంత్రి. ఈయన పుట్టించిన పదాల్లో కొన్ని...

'తక్రీత్'... ఘటన. 'కారా' (సంభవించినది) అనే పదం నుంచి దీన్ని తీసుకొచ్చారు.

'సమార్తాఫ్'... తల్లిదండ్రుల పరోక్షంలో పిల్లల బాగోగులను చూసుకునే వ్యక్తి. (దీనికి తెలుగులో సరైన పదం లేదు). 'సమర్' (చూడటం), 'తాఫ్' (శిశువు) అనే రెండు పదాలను కలిపి మోషే దీనికి సృష్టించారు.





**శైలేష్ నిమ్మగడ్డ,**
ఉపసంపాదకుడు, ఈనాడు,
హైదరాబాద్. 96523 33226



# మాతృభూమికి దూరంగా.... మాతృభాషకు దగ్గరగా...

నిక్కమైన మంచి నీలమొక్కటి చాలు... తళుకు బెళుకు రాళ్లు తట్టెడేల అని అన్నాడు వేమన. మాతృభాషంటే మమకారమున్న వారు పది మంది ఉన్నా చాలు... తమ 'పలుకు'ను అజరామరం చేసుకోగలరు. అలా చేసుకుంటున్న వారు మన మధ్యనే ఉన్నారు. తరాల తరబడి మాతృభూమికి దూరంగా మనుగడ సాగిస్తున్నా, మాతృభాషను మరువని మనసులు వారివి.


ఫోటో: నాజర్

ప్రపంచంలో ఎక్కడ, ఏ మూల నివసిస్తున్నా ప్రయూదులు తమ మూలాల్ని మర్చిపోరు. గుంటూరు జిల్లా చేబ్రోలు మండలంలోని కొత్తరెడ్డిపాలెం వెళితే ఈ మాటల్లోని యథార్థాన్ని చూడవచ్చు. క్రీ.పూ. 722లో ఇజ్రాయిల్ నుంచి వలస వచ్చిన యూదుల వారసులు నాలుగు వందల మంది ప్రస్తుతం అక్కడ నివసిస్తున్నారు. ప్రభుత్వ ఉపాధ్యాయులుగా, సాఫ్ట్‌వేర్ వృత్తి నిపుణులుగా, వైద్యులుగా, వ్యవసాయ కూలీలుగా స్థిరపడ్డారు.

పూర్వీకులు వందల ఏళ్ల కిందటే పుట్టిన గడ్డను వదిలి వచ్చినా, వీరు తమ జీవిత కాలంలో ఆ నేలను ఎప్పుడూ చూడకపోయినా తమవైన వారసత్వాలను వదులుకోలేదు. వీరిలో ప్రతి ఒక్కరికీ హిబ్రూలో మాట్లాడటం, రాయడం, చదవడం వచ్చు. ప్రతి శనివారం తమ చిన్నారులకు భాష నేర్పుతారు. పెద్దవారిలో ఎవరో ఒకరు హిబ్రూ ఉపాధ్యాయుడిగా వ్యవహరిస్తారు. తమ సంపాదనలో దేవుడికి పదో వంతు ఇవ్వడం యూదుల ఆచారం. ఆ సొమ్ములో నుంచి కొంత భాగాన్ని ఈ ఉపాధ్యాయుడికి గౌరవవేతనంగా అందజేస్తారు. ప్రస్తుతం భాషా బోధకునిగా సాదోక్ యాకోబీ ఉన్నారు.

**తెలుగుతో చుట్టరికం**

కొత్తరెడ్డిపాలెం యూదులందరూ ఇళ్లల్లో మాట్లాడుకునేది తెలుగే. వారి పిల్లలూ స్థానిక తెలుగు పాఠశాలల్లోనే చదువుకుంటున్నారు. వీరందరికీ రెండు పేర్లుంటాయి. ఒకటి పాఠశాల దస్త్రాల్లో తెలుగు పేరు. పిల్లలు పుట్టిన ఎనిమిదో రోజున సాంప్రదాయకంగా హిబ్రూలో మరో నామకరణం చేస్తారు.

**చరిత్ర పేజీలను తిరగేస్తే...**

ఈ యూదుల పూర్వీకులు టర్కీ, ఇరాక్, ఇరాన్‌ల మీదుగా జమ్మూకాశ్మీర్‌లోకి ప్రవేశించారు. అనంతరం మన తెలంగాణాకు చేరుకున్నారు. అక్కడ ద్రాక్ష తోటలు పెంచుకుంటూ జీవించేవారు. అక్కడి నుంచి కర్నూలు జిల్లా నంద్యాలకి, గుంటూరు జిల్లా అమరావతిలకు చేరారు. చివరికి కొత్తరెడ్డిపాలెంలో స్థిరపడ్డారు. 'ఎఫ్రాయిమ్' తెగకు చెందిన ఈ యూదులను 'మగ్దిమ్'లని పిలుస్తారు. ఈ పిలుపును బట్టే తెలంగాణాలో ఉన్నప్పుడు సర్కారీ దస్త్రాల్లో మాదిగలుగా నమోదు చేశారు.

హిబ్రూ లిపికి భట్టిప్రోలు శాసనంలోని తెలుగు లిపికి పోలికలున్నట్లు వీరు చెబుతారు. రెండు భాషల మధ్య ఉన్న సంబంధాన్ని వివరిస్తూ యాకోబీ సోదరుడు షమయేల్ 'ది కల్చరల్ హెర్మాన్‌క్యుటీస్' పుస్తకాన్ని రాశారు. తెలుగు పదాలతో దగ్గరి పోలికలు ఉన్న హిబ్రూ మాటలివి...

| తెలుగు | హిబ్రూ |
| --- | --- |
| అబ్బ | అబ్బా (నాన్న) |
| అయ్య | అయ్యా (నాన్న) |
| అమ్మ | ఇమ్మ |
| అరుగు | అరుగు |
| ఏక | ఏకాద్ |
| హింస | హింస |
| థోరం | థోరా (గ్రంథం) |
| శయన | శయన (నిద్ర) |
| నారి | నారి |
| తర్జుమా | తర్జుమా |
| తర్ఫీదు | తర్ఫీదు |
| కళ | కలోం |
| మృతి | మిత్తి |
| పొట్ట | పొట్ట |
| కొను | కొన |

**రక్షణ**

2004లో హైదరాబాద్‌లో కొందరు లష్కర్-ఏ-తోయిబా తీవ్రవాదులను పోలీసులు అరెస్టు చేశారు. అప్పట్లో వారిని విచారిస్తే.. గుంటూరు జిల్లాలోని యూదులను చంపడానికి రెక్కీ నిర్వహించినట్లు చెప్పారు. అప్పటి నుంచి ఇక్కడి యూదులకు పోలీసులు రక్షణ కల్పిస్తున్నారు.

**మాతృభూమికి వెళ్లాల్సిందే**

ఎప్పటికైనా ఇజ్రాయిల్‌కు తిరిగి వెళ్తామన్నది వీరి ఆశ. స్థానికంగా తమకు సౌర విద్యుత్ సౌకర్యం కల్పిస్తామని ఇజ్రాయిల్ ప్రభుత్వం హామీ ఇచ్చిందని అంటున్నారు. వీరితో పాటు మన రాష్ట్రంలో ఒంగోలులో పది, మచిలీపట్నంలో మూడు, హైదరాబాద్‌లో రెండు యూదు కుటుంబాలు నివసిస్తున్నాయి.



**పెనికలపాటి రమేష్,**
స్టాఫ్ రిపోర్టర్, ఈనాడు,
గుంటూరు. 80085 54784

# అమ్మ పలుకు చల్లన

భాష అక్షరంతో మొదలవుతుంది. అక్షరం అంటే నాశనం లేనిది అని అర్థం. ఒక శాశ్వతమైన వస్తువుతోటి భాషకు ఉపక్రమించటం రెండు మనస్సుల మధ్య వంతెన కట్టుకోవటానికి. ఇద్దరి మధ్య వారధి కట్టుకోవటానికి. భాషను ఎవరు మొదలుపెట్టారనే మీమాంశ ఇప్పుడు అవసరం లేదు. శాశ్వతమైన భాషను తల్లిగా తలచి సొంతం చేసుకున్నాం. తల్లికిస్తున్నంతటి గౌరవమర్యాదలు, మన్నన ప్రతిపత్తుల్ని భాషకు ఇవ్వాలి. చాలా భాషలకు ఆ గౌరవం దక్కుతోంది. వివిధ ప్రాంతాల వారు భాషకు పూజనీయ స్థానాన్ని కల్పించి అక్కున చేర్చుకున్నారు. భాష ఒడిలో పెరుగుతూ దేవతగా ఆరాధిస్తున్నారు. అర్చిస్తున్నారు. ప్రగతి పథంలోకి పయనిస్తున్నారు. నేను పలుభాషల్లో ముఖ్యంగా దక్షిణాది భాషల్లో పాటల్ని ఆలపించాను కాబట్టి నా మనస్సులోని బాధను చాలా సార్లు వ్యక్తీకరించాను. ఇతర భాషల వారికి తమ మాతృభాషపై ఉన్న గౌరవమర్యాదలతో పోలిస్తే మన తెలుగు భాషపై మన వారికి ఉన్న గౌరవం చాలా చాలా తక్కువ. అది దినదినం క్షీణించిపోతోంది. ఎవరిని ప్రశ్నించినా కూడా 'దీని కోసం తాపత్రయ పడాల్సిందేముంది? నేను చెప్పే మాట ఇతరులకు అర్థమవుతోంది. వారు చెప్పే మాట నాకు అర్థమవుతోంది కదా' అంటున్నారు. నిజమే.. ఉత్తరాలు రాయటం మానేశాం. ఎలక్ట్రానిక్ మాధ్యమాల ద్వారానే వెళ్లిపోతున్నాం. ఆఖరికి కలాన్ని చేబట్టటం కూడా చేతకాని పరిస్థితి దాపురిస్తుంది. పిల్లలకు ఓనమాలు నేర్పించటమూ ఎలక్ట్రానిక్ పలకల మీదే అయిపోతోంది. లేకపోతే ఐప్యాడ్ల మీద దిద్దిస్తున్నాం. పళ్లెంలో బియ్యాన్ని పోసి అక్షరాలు రాయించేవారు. బడి పంతుళ్లు గుంట ఓనమాల్ని దిద్దించేవారు. ఆ విధానాలకు కాలం చెల్లింది. సాంకేతిక విప్లవంతో చాలా సాధించామని గర్విస్తున్నాం. చిగుళ్లు తొడిగిన మొక్క వృక్షమవుతుంది. దాని కొమ్మల్ని పట్టుకుని ఆకాశానికి నిచ్చెనలు వేస్తూ పోతున్నామే తప్ప ఆ చెట్టు తల్లివేరు నీళ్లు లేక ఎండిపోతోంది. కొన్నాళ్లకు సమూలంగా కూలిపోతుందనే విచక్షణా జ్ఞానం లేని రీతిగా వ్యవహారం సాగిపోతోంది. ఒక విప్లవంతో మనమూ ప్రయాణం చేయటం ముఖ్యం. అయితే విప్లవ ఫలితాన్ని మోతాదు మించి స్వీకరిస్తే అది భస్మాసుర హస్తమవుతుంది. మనతనం లేనిది ఎంత గొప్పదైనా సరే అది పరాయిది అవుతుంది. దాని వల్ల ఏ విధమైన ఉపయోగమూ ఉండదు. ఓ ఐదు వందల ఏళ్ల తర్వాత పురావస్తు తవ్వకాల్లో గుడి గోడలపైన ఒక లిపి కనిపిస్తుంది. ఓహో తెలుగు అనే భాష ఉండేది.. దీని అక్షరాలు ఇలా ఉండేవని తెలుసుకోవల్సిన అగత్యం వస్తుందేమోననే బాధ కలుగుతోంది. అలాంటి పరిస్థితి మన దౌర్భాగ్యమే. ఇప్పటికీ మించిపోయింది ఏమీలేదు. మనతనాన్ని పెంచి పోషించుకుందాం. అమ్మ భాష అభ్యున్నతికి బద్ధ కంకణులమవుదాం. సంభాషణల్ని తెలుగులోనే సాగించేందుకు ప్రయత్నిద్దాం. మాండలికాలు, యాసల విబేధాలు కాదు ఇప్పుడు కావాల్సింది. ప్రతి మాండలికంలోనూ అందం ఉంది. తెలుగు భాష ఉన్నంత వరకూ మాండలికం ఉంటుంది. పర భాషల నుంచి పదాల్ని అరువు తీసుకోని ఏ భాషా సుసంపన్నం కాదు. ఆంగ్లం, స్పానిష్, గ్రీక్, లాటిన్, తమిళ, కన్నడ, మలయాళ ఇలా ఏదైనా సరే ఇచ్చి పుచ్చుకోక పోతే భాష పరిపుష్టం కాబోదు. అది సహజమైంది. అలా ఇచ్చి పుచ్చుకోవటం బాగానే ఉంటుంది. ఇద్దరు తెలుగు వాళ్లు కలిసినప్పుడు తెలుగులో మాట్లాడుకోవటం అనాగరికమని చుట్టుపక్కల వాళ్లు భావిస్తారేమోనని ఆంగ్లంలో మాట్లాడుకోవటమే అనాగరికం. అమ్మ భాషలో మాట్లాడుకోవటం అనాగరికం కానేకాదు. మన భాష పట్ల మనకు గర్వం ఉండాలి. ఒక అహంకారం కావాలి. అంటే ఇతర భాషల్ని కించపరచే అహంకారం కాదు నేననేది. మన భాష పట్ల మనకున్న గౌరవం మనకు అహంకారాన్ని తీసుకురావాలి. ఆ భాష పట్ల గౌరవాన్ని ఇనుమడింపజేయటం. పిల్లలకు ఏ మాధ్యమంలో విద్యా బోధన జరిగినప్పటికీ తెలుగును ఒక భాషగా బోధించటం చాలా ముఖ్యం. ప్రభుత్వం దీనికి దీక్ష పూనాలి. కొన్ని విషయాల్ని (సబ్జెక్ట్స్) ఉపాధ్యాయులు తెలుగులో బోధించటంలో తప్పు లేదు. తెలుగు మాధ్యమంలో చదువుకుని ఉన్నత శిఖరాల్ని అధిరోహించిన వారు ఉన్నారు కదా. వాళ్లు అప్పుడు ఇంగ్లీష్‌ను ఒక విషయంగా నేర్చుకున్నవారే. ఇప్పుడు ఆంగ్లం లేకపోతే ప్రపంచంలో బతకటం చాలా కష్టం. దాన్ని పరిపుష్టంగా నేర్చుకోవటంలో తప్పులేదు. అలాగని అమ్మభాషను తాత్సారం చేయటం తగదు. కన్నడ, తమిళ, మలయాళీలు ఆంగ్ల పదాల్ని తర్జుమా చేసి వాడుకలోకి తెచ్చేందుకు చాలా శ్రమిస్తారు. దాన్ని చూస్తే మనం నిజంగా సిగ్గు పడాలి. మనమూ తర్జుమా చేసి ప్రచారంలోకి తెస్తే మొదట అందరూ నవ్వుకుంటారు. నాకు అర్థం కాలేదు. ఇక ఇది ఎవ్వడికి అర్థమవుతుందంటారు. వాస్తవానికి తర్జుమా... అలా అన్నవారికి తప్ప ఇతరులకు చాలా బాగా అర్థమవుతుంది. అ అన్న అక్షరం పిల్లలకు వెంటనే అర్థమవుతుందా. కాదు.. దానిపై దిద్దించి అర్థమయ్యేట్లు చేస్తాం. ఇదే మాదిరి తర్జుమా పదాల్ని కూడా వాడుకలోకి తీసుకువచ్చేందుకు కృషి చేయటం అనివార్యం.



**- ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం**





# ప్రతిజ్ఞ అందించిన ప్రజ్ఞ

'భారతదేశము నా మాతృభూమి. భారతీయులందరూ నా సహోదరీ సహోదరులు. నేను నా దేశమును ప్రేమించుచున్నాను. సుసంపన్నమైన, బహువిధమైన నా దేశ వారసత్వ సంపద నాకు గర్వకారణము. నా తల్లిదండ్రులను, ఉపాధ్యాయులను పెద్దలందరినీ గౌరవింతును. ప్రతివారితోనూ మర్యాదగా నడుచుకొందును. నా దేశము పట్లను, ప్రజల పట్లను, సేవానిరతిని కలిగి యుందునని ప్రతిజ్ఞ చేయుచున్నాను. వారి శ్రేయోభివృద్ధిలే నా ఆనందమునకు మూలము. జైహింద్'

ఈ వాక్యాలు చిన్నప్పటి జ్ఞాపకాలను తట్టి లేపాయా? బడిలో చదువులమ్మ ఒడిలో వల్లె వేసిన 'ప్రతిజ్ఞ' గుర్తొచ్చిందా? అప్పుడు కాస్త అర్థమయ్యీ అర్థం కాకపోయినా, వాటి వెనుక ఉన్న స్ఫూర్తి ఇప్పటికీ వెంటాడుతోంది కదూ! మన మనసులపై అంతటి మహత్తర ముద్ర వేసిన ఈ ప్రతిజ్ఞ 1962లో పురుడు పోసుకుంది. అంటే ఈ ఏడాదితో యాభై ఏళ్లు పూర్తవుతున్నాయన్న మాట.

పాఠశాలల్లో ఏ విద్యార్థి నోట విన్నా.. ఒకటో తరగతి నుంచి పదో తరగతి వరకు ఏ పుస్తకం తొలి పుటల్లోనైనా కనిపించే ఈ 'భారత జాతీయ ప్రతిజ్ఞ' రూపకర్త పైడిమర్రి వెంకట సుబ్బారావు. దేశానికి జాతీయ పతాకాన్ని అందించినట్లే... జాతీయ ప్రతిజ్ఞను అందించిన ఘనతా తెలుగోడిదే! ప్రతి భారతీయుడి బాధ్యతను గుర్తుచేసేలా సాగిన ఈ రచన జాతీయ గీతం, జాతీయ గేయాల తర్వాత స్థానం సంపాదించుకుని తెలుగు 'వాడి'కి ప్రతీకగా నిలిచింది.

నల్లగొండ సమీపంలోని అన్నెపర్తి పైడిమర్రి వెంకట సుబ్బారావు స్వగ్రామం. ఆయన బహుభాషా కోవిదులు. తెలుగుతో పాటు సంస్కృతం, హిందీ, ఆంగ్లం, ఉర్దూ, అరబ్బీ భాషల్లో ఆయన దిట్ట. పేదలకు ఉచితంగా ప్రకృతి వైద్య సేవలు అందించేవారు. తరువాత హోమియో వైద్యంలో పట్టా పొందారు. న్యాయ విద్య అభ్యసించేందుకు లాహోర్ వెళ్లారు. కానీ తల్లి బెంగ పెట్టుకోవడంతో మధ్యలోనే వెనక్కివచ్చేశారు. ప్రవృత్తిగా వైద్య సేవలను కొనసాగిస్తూనే నిజాం ఏలుబడిలోని హైదరాబాద్ రాష్ట్ర ప్రభు

త్వంలో ఖజానా శాఖలో ఉద్యోగిగా చేరారు. ఆంధ్రప్రదేశ్ అవతరించిన తర్వాత పైడిమర్రి వెంకటసుబ్బారావు అదే శాఖలో కొనసాగారు. ఖమ్మం, నిజామాబాద్, నెల్లూరు, విశాఖపట్నం, నల్లగొండల్లో జిల్లా ఖజానాధికారిగా ఉద్యోగ బాధ్యతలు నిర్వర్తించారు.

### ప్రతిజ్ఞ పుట్టిందిలా...

స్వాతంత్ర్యం తొలినాళ్ల నుంచి భారత్‌కు చైనాతో సరిహద్దు వివాదాలు తలెత్తాయి. ఈ వివాదాలు, యుద్ధం 1959-62 కాలంలో మరింత తీవ్రమయ్యాయి. ఆ సమయంలో పైడిమర్రి వెంకటసుబ్బారావు విశాఖపట్నం జిల్లాలో పనిచేస్తున్నారు. విశాఖపట్నంలో నావికాదళ స్థావరం ఉండటంతో యుద్ధం గురించి స్థానికంగా చర్చ ఎక్కువగా సాగుతుండేది. పైడిమర్రి ఈ పరిణామాలను నిశితంగా గమనిస్తూండేవారు. ఓవైపు చైనా దుర్నీతి ఆగ్రహాన్ని కలుగజేసినా.. అక్కడి ప్రజల్లో దేశభక్తి, వారు ప్రభుత్వానికి నైతిక మద్దతు అందజేస్తున్న తీరు ఆయనను అబ్బుర పరిచింది. స్వాతంత్ర్యోద్యమ కాలంలో గాంధీజీ నేతృత్వంలో మనదేశంలోనూ వెల్లువెత్తిన దేశభక్తి, జాతీయాభిమానం ఆ తర్వాత సన్నగిల్లడం ఆయన్ను కల్లోలపరిచింది. మరోసారి జాతిలో చైతన్యం కలిగించాలని, చిన్నారుల్లో జాతీయ స్ఫూర్తిని రగిలించాలని తపించారు. చైనా ప్రజల స్ఫూర్తి రహస్యం ఏమిటా అని ఆరా తీశారు. యుద్ధం నేపథ్యంలో ప్రభుత్వానికి ప్రజా మద్దతు కూడగట్టేలా అక్కడి కవులు విస్తృతంగా రచనలు చేసి వాటిని ఊరూరా ప్రచారం చేస్తున్నారనే సమాచారం తెలిసింది. 'మంచి విషయమేదైనా శత్రువు నుంచీ నేర్చుకో' అనే ప్రాప్త కాలజ్ఞతతో పైడిమర్రి 'నేను సైతం...' అంటూ దేశభక్తి రచనకు పూనుకున్నారు. 1962లో సాగిన ఆ మేధోమథనం వల్లనే అమృత వర్షంలా ఈ 'ప్రతిజ్ఞ' కురిసింది.

అందరికీ అర్థమయ్యే రీతిలో.. భావం తెలిసేలా.. కఠిన పదాలు లేకుండా అలతి మాటలతో.. గద్య రూపంలో సాగించిన తన రచనను విశాఖలోని తన స్నేహితుడు, విశాఖ ఉక్కు ఉద్యమ నిర్మాత తెన్నేటి విశ్వనాథం దృష్టికి తీసుకువెళ్లారు. ఆయన ఆ రచనలో ఔచిత్యాన్ని, భావావేశాన్ని, దేశభక్తి ప్రపత్తిని గుర్తించారు. పాఠశాలల్లో పిల్లలతో ప్రతినిత్యం దానిని వల్లె వేయిస్తే బాగుంటుందని అభిప్రాయపడ్డారు. అనుకున్నదే తడవుగా పురపాలక సంఘం అధీనంలోని పాఠశాలల్లో ఆచరించేలా చర్యలూ తీసుకున్నారు. అంతటితో ఆగకుండా ప్రతిజ్ఞను అప్పటి రాష్ట్ర విద్యాశాఖ మంత్రి, విజయనగరం మహారాజు పి.వి.జి.రాజు దృష్టికీ తీసుకెళ్లారు. విశాఖలో అనుసరిస్తున్న విధానాన్నీ వివరించారు. దానికి ముచ్చటపడ్డ పి.వి.జి.రాజు రాష్ట్రమంతా పాఠశాలల్లో అమలు చేయాలని 1963లో ఉత్తర్వులు జారీ చేశారు. అప్పటికే పైడిమర్రికి విశాఖ నుంచీ బదిలీ కావడంతో తదనంతర పరిణామాలూ.. తన రచన రాష్ట్రవ్యాప్తంగా అమలవుతున్న విషయమూ తెలియవు.

### దేశవ్యాప్త ప్రాచుర్యం

ఆంధ్రప్రదేశ్ ప్రయోగం కేంద్ర విద్యా సలహా మండలి దృష్టికి వెళ్లింది. ఎం.సి. చాగ్లా నేతృత్వంలోని ఈ మండలి 31వ వార్షిక సమావేశం 1964 అక్టోబరు 10, 11 తేదీల్లో బెంగళూరులో నిర్వహించారు. ఈ సందర్భంగా తెలుగులో ప్రతిజ్ఞపై విస్తృతంగా చర్చించారు. దాని భావాన్ని సవివరంగా తెలుసుకున్న సభ్యులు దేశవ్యాప్తంగా పాఠశాలల్లో ప్రవేశపెట్టడంతో పాటు జాతీయ పర్వదినాల సందర్భంగానూ ఆలపించాలని ఏకాభిప్రాయం వ్యక్తం చేశారు. అనుకున్నదే తడవుగా హిందీ, ఆంగ్లంతో పాటు తమిళం, కన్నడం, గుజరాతీ తదితర ప్రాంతీయ భాషల్లోకి అనువదించాలని నిర్ణయించారు. 1965 జనవరి 26 గణతంత్ర దినోత్సవం నుంచి దేశవ్యాప్తంగా అన్ని పాఠశాల్లో 'ప్రతిజ్ఞ' ఆలాపన తప్పనిసరి చేస్తూ ఉత్తర్వులు జారీ అయ్యాయి. ఆగస్టు 15, జనవరి 26తో పాటు అన్ని జాతీయ పండగల సమావేశాలూ, సదస్సులూ, విద్యా కార్యక్రమాల్లో విధిగా ప్రతిజ్ఞ చేయాలని సూచించారు. తెలుగు భాషలోని లాలిత్యం.. పద గాంభీర్యం.. క్లుప్తతలోనే అపారమైన భావ ప్రసరణ ఈ ప్రతిజ్ఞను జాతీయ స్థాయిలో అన్ని పాఠశాలల్లోనూ అమలు చేయాలనే ఆలోచనకు పురిగొల్పింది.

### రచయితకు దక్కని ప్రాచుర్యం..

ప్రతి ఒక్కరూ ఎంతో గౌరవంగా ఆలపించే 'ప్రతిజ్ఞ'కు ఎనలేని గుర్తింపు వచ్చినా దాని రచయితగా పైడిమర్రి వెంకటసుబ్బారావుకు ఆ స్థాయిలో గుర్తింపు మాత్రం లభించలేదు. దేశవ్యాప్తంగా విద్యార్థుల గొంతుల్లో ప్రతిధ్వనిస్తున్నా.. పాఠ్య పుస్తకాల్లో ప్రచురితమవుతున్నా.. తానే రచయితనని ఆయనే చెప్పుకునే వరకు తెలియదు. అలాగే తన రచన దేశవ్యాప్తంగా ప్రతిధ్వనిస్తోందనే విషయమూ చాలా కాలం వరకు ఆయనకు తెలియకపోవడం మరో విచిత్రం. యాదృచ్ఛికంగా ఆయన తన రచన పుస్తకాల్లోనూ ప్రచురితమవుతున్న విషయాన్ని గుర్తించారు. ఓసారి ఇంటిలో తన మనవరాలు ఈ ప్రతిజ్ఞను చదువుతుండగా విన్నారు. ఇదేదో తాను రాసినట్లుగానే (మూలరూపానికి కొద్ది మార్పులు చేశారు) ఉందని అనుకుంటూ పరిశీలించారు. తాను రాసిన ప్రతిజ్ఞే అది... కనుక్కుంటే అన్ని సంగతులూ తెలిశాయి. తర్వాత ఈ వివరాలన్నీ పేర్కొంటూ పైడిమర్రి కుటుంబ సభ్యులు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ఉత్తరాలు రాశారు. రచయితగా ఆయనకు గుర్తింపునివ్వాలని ఎన్నో అభ్యర్థనలను చేశారు. కానీ లాభం లేకుండా పోయింది. కేంద్ర మానవ వనరుల శాఖ దస్త్రాల్లో ప్రతిజ్ఞ రచయితగా పైడిమర్రి వెంకటసుబ్బారావు పేరు అధికారికంగా నమోదై ఉంది. అయినా తగిన రీతిలో ఆయనకు గౌరవం కల్పించకపోవడం శోచనీయమే. దేశానికి అంత గొప్ప రచనను అందించిన తెలుగు వాడికి గుర్తింపు లభించేలా మన రాష్ట్ర ప్రభుత్వాలూ కృషి చేయకపోవడం దారుణమే. ఈ స్వర్ణోత్సవ వేళనైనా పాఠ్య పుస్తకాల్లో రచయితగా ఆయన పేరును ప్రచురించడంతో పాటు పైడిమర్రి జీవిత విశేషాలను పాఠ్యాంశంగా చిన్నారులకు బోధిస్తే ప్రతిజ్ఞకు సార్థకత చేకూరుతుంది.

### బహుభాషల్లో దిట్ట.. రచనలూ ఎన్నో

పైడిమర్రి తెలుగులో ఎన్నో రచనలు చేశారు. 'కాల భైరవుడు' అనే నవల ఆయన కలం నుంచి జాలువారిందే! ప్రకృతి వైద్య విధానాలపై 'నౌలి-ధౌతి' పేరిట పుస్తకం రాశారు. ఆయన రచనలెన్నో 'ప్రకృతి' అనే వైద్య సంబంధ పత్రికలో ప్రచురితమయ్యాయి. సింగపురీ నృకేసరి శతకం, బాల రామాయణం, శ్రీ వేంకటేశ్వర స్తుతి, తారావళి, కాలభైరవుడు (నవల), మీమాంసాత్రయం, గీతా మీమాంస, దైవభక్తి ఆయన ఇతర రచనలు. 1945లోనే 'ఉషస్సు' పేరిట కథల సంపుటిని ప్రచురించారు. అరబ్బీ రచనను తెలుగులోకి 'జీవిత మహాపథం' పేరిట అనువదించారు. ఆయన వద్ద ఎన్నో విలువైన పుస్తకాలతో విస్తృతమైన గ్రంథాలయం ఉండేది. వాటిని ఆయన తదనంతరం కుటుంబ సభ్యులు నల్లగొండలోని గ్రంథాలయానికి విరాళంగా అందజేశారు. 1971లో నల్గొండ జిల్లా ఖజానాధికారిగా ఉద్యోగ విరమణ చేసిన పైడిమర్రి జీవితాంతం ప్రజలకు ఉచితంగా హోమియో, ప్రకృతి వైద్యసేవలు అందించారు. 1988లో దివంగతులయ్యారు. ఆయన స్ఫూర్తిని ఇప్పటికీ కుటుంబ సభ్యులూ కొనసాగిస్తున్నారు.





**పుల్లి వేణుప్రసాద్**
చీఫ్ సబ్ ఎడిటర్
ఈనాడు, విశాఖపట్నం.
91772 72768.

# పద్యం వారి నైవేద్యం

ఈ దంపతులు మధ్యతరగతి వ్యవసాయ కుటుంబం నుంచి వచ్చినవారు. ఇద్దరూ మంచి చదువులు చదువుకున్నారు. నలభ య్యేళ్ల పాటు ఉద్యోగ, వ్యాపార జీవితాల్ని సమర్థంగా నిర్వహించారు. ఇద్దరు కుమార్తెల్ని మంచి చదువులు చదివించి జీవితంలో స్థిరప డేలా చేశారు. అంతటితో అయిపోయిందనుకో కుండా, స్వగ్రామంలో మరెందరో పిల్లలకు రెక్కలబలం అందించేందుకు ప్రయత్నిస్తు న్నారు. పద్యపఠనం ద్వారా పిల్లలు అన్ని కోణా ల్లోనూ వికసిస్తారన్న సూత్రాన్ని నమ్మి ఆచరి స్తున్నారు. తమ ఇంటికి నిత్యం చదువుకోవడా నికి వచ్చే గ్రామీణ బాలల చేత వందల పద్యాలు వల్లె వేయిస్తున్నారు. వారి భవితకు దిశానిర్దేశం చేస్తున్నారు. వారే కృష్ణాజిల్లా తెన్నేరుకు చెందిన దేవినేని మధుసూదనరావు, జయశ్రీ దంపతులు.

వీరు తెలుగులో ఆణిముత్యాలనదగ్గ కొన్ని పద్యాలను, గేయాలను సేకరించి పుస్తకాలు అచ్చువేశారు. 'బాలల గేయాలు', 'పద్యపారిజా తాలు' అనే ఈ రెండు అందమైన చిరుపొత్తా లను పాఠశాలల్లో ఉచితంగా పంచిపెడుతు న్నారు. నిస్వార్థమైన ఉద్దేశానికి గట్టి సంకల్పం తోడయితే ఎలాంటి మంచి ఫలితాలు సాధించ వచ్చో నిరూపిస్తున్న దేవినేని మధుసూదనరా వుతో 'తెలుగు వెలుగు' ముఖాముఖీ ఇది...

**పిల్లలకు పద్యాలు బోధించాలనే ఆలోచన ఎలా వచ్చింది?**

నాకు, నా భార్య జయశ్రీకి గ్రామీణ పిల్లలను చదివించాలనే కోరిక ఎప్పట్నించో ఉంది. నగ రంలో వ్యాపారాలు చాలించి స్వగ్రామం చేరాక చుట్టుపక్కల పిల్లలు కొందర్ని పిలిచి వారి చదువుసంధ్యల గురించి తెలుసుకున్నాం. చాలామంది పిల్లలకు తెలుగు, ఇంగ్లిషు చద వటం సరిగా రాదు. పాఠ్యపుస్తకాలలో చక్కటి పద్యాలు ఉన్నా నేర్చుకోవడం లేదు.

ఆ పిల్లల్లో చాలామంది మాకు అలవాట య్యారు. ఇక్కడ చదువుకునేందుకు తగిన వాతావరణం ఉండటంతో వాళ్లంతటవాళ్లే వచ్చే వారు. నెమ్మదిగా తోటి వాళ్ల ద్వారా ఈ సంగతి తెలుసుకున్న మిగతా పిల్లలు కూడా రావడం మొదలుపెట్టారు. మేం పాఠాలేమీ చెప్పలేదు గానీ, ఏ పాఠం చదివితే మంచి మార్కులు తెచ్చుకోవచ్చో సలహాలిచ్చేవాళ్లం. ఇలా పోగైన వారంతా ఇక్కడి ప్రభుత్వ పాఠ శాలలో చదువుకునే పేద కుటుంబాల పిల్లలే. బడి అవగానే ఇంటికి వచ్చేసేవారు. కొందరైతే ఇక్కడే నిద్రపోయేవారు. ఇలా 10 నుంచి 15 మంది పిల్లల్ని కూడగట్టి వారిపై అన్ని రకా లుగా శ్రద్ధ తీసుకున్నాం. కానీ కేవలం పాఠ్య ప్రణాళిక మీదే దృష్టి పెడితే చాలదనిపించేది. పాఠాలు చదివితే మంచి మార్కులు వస్తాయి. కానీ విద్యార్థి వ్యక్తిత్వంలో సర్వతోముఖాభివృద్ధి సాధ్యం కాదు. దానికి ఇంకా ఏదో చేయాలని పించేది.

అదే సమయంలో 2007లో మా స్నేహి తులు, ఎ.పి.ఎస్.సి ఉన్నత విద్యాశాఖ మాజీ అధ్యక్షులైన ప్రొ॥ సి.సుబ్బారావు ఒక పుస్తకాన్ని పంపించారు. కోట పురుషోత్తం రచించిన ఆ పుస్తకం పేరు 'తెలుగు పద్యమూ, మా నాన్నా!'. పద్యం ఎందుకు నేర్చుకోవాలో అందులో రాశారు. కొన్ని మంచి పద్యాలను కూడా పొందుపరిచారు. ఆ పద్యాలకన్నా ముఖ్యంగా, అసలు పద్యాలను ఎందుకు నేర్చు కోవాలన్న దానిపై ఆయన తండ్రి చెప్పిన మాటలు చాలా నచ్చాయి.

ఇది చదివాక పురుషోత్తంని తిరుపతి నుంచి మా ఊరికి ఆహ్వానించాం. గుడివాడ ఎ.ఎన్.ఆర్ కళాశాలకు తీసుకువెళ్లాం. అక్కడ ఆయన బియ్యీడీ విద్యార్థులకు పద్యాలు ఎందుకు నేర్చుకోవాలో చెప్పటమే గాక, చక్కగా పాడి వినిపించారు. ఈ అనుభవం మాకు మరింత స్ఫూర్తినిచ్చింది.

అప్పటినుంచి (2007) మా ఇంటికి వచ్చే పిల్లలకు పద్యాలు కూడా నేర్పటం మొదలు పెట్టాం. నా సతీమణి జయశ్రీ వారి చేత

పద్యాలు పాడిస్తుంది. పాఠ్యపుస్తకాలలోని పద్యాలనూ కంఠస్థం చేయిస్తున్నాం. దీని వల్ల విద్యార్థుల్లో ఉత్సాహం, జ్ఞాపకశక్తి పెరగడం, చదువులో, వ్యక్తిత్వంలో చక్కటి మార్పు రావటం గమనించాం. 35 మార్కులు వచ్చే విద్యార్థులు కూడా 90 మార్కుల స్థాయికి చేరుకున్నారు. చక్కగా మాట్లాడటం నేర్చుకున్నారు. మా దగ్గరి పిల్లలు 50 నుంచి 100 పద్యాల వరకూ నేర్చుకున్నారు.

**పద్యాలు నేర్చుకోవడం వ్యక్తిత్వం మీద ప్రభావం చూపిందన్నారు. ఉదాహరణలేమైనా చెబుతారా?**

చిన్నపుడు పాఠశాలల్లో వక్తృత్వ పోటీలు, నాటకాలు వేయడం లాంటివి ఉండేవి. ఇప్పుడు అటువంటివి అరుదైపోయాయి. దీని వల్ల పిల్లల్లో వ్యక్తిత్వం రూపుదిద్దుకోవడం లేదు. వ్యక్తిత్వ నిర్మాణానికి చాలా మార్గాలున్నాయి. మేం ఎన్నుకున్న పద్ధతి ఇది. పిల్లల మనస్సు మీద భారం పడకుండా తేలికగా పద్యాల ద్వారా వారు అభివృద్ధి చెందటానికి ఆస్కారం ఉందని గ్రహించాం. ఈ ప్రయోగం ఉపాధ్యాయుల మీద భారం మోపదు. పిల్లలు తమంతట తాము నేర్చుకునే ప్రక్రియ ఇది.

ఈ కాలంలో కళాశాల చదువులైన తరువాత పిల్లలు ఉద్యోగాల్లో నెగ్గుకురావాలంటే చాలా శ్రమ పడవలసి వస్తోంది. ఉద్యోగాలలో 70 శాతం మందిలో అభివ్యక్తి నైపుణ్యం కొరవడింది. సంస్థలే చాలా శ్రమ పడి వారికి అవన్నీ నేర్పించవలసి వస్తోంది. మా అనుభవంలో పద్యాలు నేర్చుకుని అందరిముందూ పాడటం వల్ల పిల్లలు బిడియం పోగొట్టుకుని

> “ పద్యం పిల్లల్లో ఉత్సాహాన్ని పెంచుతుంది. స్వరస్థాయి, ఉచ్చారణలను మెరుగుపరుస్తుంది. అన్నింటినీ మించి వ్యక్తిత్వ వికాసం జరుగుతుంది. కేవలం నాలుగు పంక్తుల పద్యంలో జీవితానికి అక్కరకు వచ్చే ఎన్నో విషయాలు దాగి ఉంటాయి. అంతటి పద్య సంపద ఉన్న మన సంస్కృతిని మనం పరిరక్షించుకుని సద్వినియోగపరుచుకుంటే, మన పిల్లలు ఉన్నత వ్యక్తులవుతారు తప్పకుండా!
>
> **దేవినేని మధుసూదనరావు, జయశ్రీ.** ”

చక్కగా మాట్లాడటం నేర్చుకుంటున్నారు. వారి జ్ఞాపకశక్తి, ప్రవర్తన మెరుగుపడుతున్నాయి.

2011వ సం॥లో మా ఇంటి దగ్గర చదువుకున్న మిక్కిలినేని హరీష్ 10వ తరగతిలో 571/600 మార్కులతో జిల్లా స్థాయిలో ద్వితీయ స్థానంలో నిలిచాడు. తను మొదట్లో చాలా సిగ్గరి. పద్యపఠనం అతనికి తన శక్తియుక్తుల మీద నమ్మకాన్ని కలిగించింది. ఇపుడు నూజివీడు ట్రిపుల్ఐటీలో చేరాడు. అక్కడ మొదటి ఏడాది 180 పద్యాలు నేర్చుకోవాలని చెప్పారట. వాటిలో 100కు పైగా తనకు వచ్చని చెప్పాడు. అక్కడి తెలుగు అధ్యాపకులు కూడా అతని పద్య పటిమను చూసి ఆశ్చర్యపోతున్నారు. ఈ సంఘటన కూడా మా పట్టుదలను పెంచింది. పద్యపఠనం ప్రయోజనమేమిటో అర్థమైంది.

**పిల్లల కోసం ఈ పద్యసంకలనాలు ('బాలల గేయాలు', 'పద్యపారిజాతాలు') తయారు చేయాలన్న ఆలోచన ఎలా వచ్చింది?**

కొన్నాళ్ల కిత్రం పునాదిపాడు ఉన్నతపాఠశాలలో 'పద్యాలు ఎలా నేర్చుకోవాలి' అనే అంశంపై ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయురాలు విజయలక్ష్మి ఒక సమావేశాన్ని ఏర్పాటు చేశారు. అందులో నేను, నా సతీమణి జయశ్రీ, శాంతాబయోటెక్ ఛైర్మన్ డా॥ కె.ఐ. వరప్రసాద్‌రెడ్డి, తిరుపతిలో ఉండే తెలుగు అధ్యాపకులు సాకం నాగరాజ మాట్లాడాం. కోట పురుషోత్తం పిల్లలను ఉత్సాహపరిచేలా చాలా పద్యాలను పాడారు. ఆ తరువాత రెండు మూడు వారాల్లోనే 35 మంది వరకూ పిల్లలు 50 పద్యాల దాకా నేర్చుకున్నారు. లావణ్య అనే 9వ తరగతి









పిల్లలు నేర్చుకోవటానికి వీలుగా ఉంటాయా లేదా అన్నవి చెబుతుంది. ఎందుకంటే పిల్లలకు పద్యాలు నేర్పించేది, వారితో పాడించేది ఆవిడే.

**పుస్తకాల పంపిణీ ఎలా చేశారు?**

అక్కడే ఉంది అసలు కష్టమంతా. నేను, పునాదిపాడు ప్రధానోపాధ్యాయురాలు విజయలక్ష్మితో కలిసి మా మండలంలోని ప్రతీ ఉన్నత పాఠశాలకూ వెళ్లాం. అక్కడి ఉపాధ్యాయులతో మాట్లాడి మా ప్రయోగ ఉద్దేశాలను తెలియజేశాం. అందరూ ఇది మంచి ప్రయత్నమన్నారు. తప్పకుండా ప్రతి విద్యార్థికీ ఈ పుస్తకాలు అందజేస్తామని, పద్యాలను రాగయుక్తంగా ఎలా పాడాలో వారికి నేర్పిస్తామని అన్నారు. నేను ప్రయాణంలో ఉండటం వల్ల,

## చక్కదిద్దుకున్నాను!



మా నాన్న రైతు. స్నేహితుల ద్వారా మధుసూదన్ సార్ గురించి తెలిసి ఇక్కడికి వచ్చాను. అపుడు (2008లో) ఎనిమిదో తరగతి చదివేవాణ్ణి. నాతోపాటు చాలామంది వచ్చేవారు. ఇక్కడ చదువుకునేవాళ్లం. ఇక్కడే పడుకునేవాళ్లం. సారు మా చేత పద్యాలు కంఠస్థం చేయించేవారు. అలా నీతి శతకాలెన్నో నేర్చుకున్నాను. తన దగ్గర ఉన్న పుస్తకాలు ఇచ్చి చదివించేవారు. మల్లెమాల 'నిత్యసత్యాలు' లాంటి పద్య పుస్తకాలు ఎంతో పనికివచ్చాయి. పద్యాల వల్ల నా గురించి నాకు తెలిసింది. నాలో ఉన్న తప్పులు చక్కదిద్దుకున్నాను. ఎపుడు ఎలా ఉండాలో తెలుసుకున్నాను. పద్యాల్ని అన్ని సందర్భాలకీ చక్కగా అన్వయించుకోవచ్చు. మనుషులతో ఎలా మాట్లాడాలి, ఏ మనిషికి తగ్గట్టు ఎలా మెలగాలో తెలుస్తాయి. అంతేకాదు, పద్యాల వల్ల ఏకాగ్రత పెరుగుతుంది. మిగతా పాఠాలు కూడా బాగా చదవగలిగాను. పదోతరగతి జిల్లాలో రెండో స్థానం తెచ్చుకున్నాను. పద్యాల గురించి చెప్పే ఈ పద్యమంటే నాకు ఇష్టం:

పద్యమన్నది వెయ్యేళ్ల పసిడిపంట
పద్యమన్నది తెలుగింట పాడిపంట
తెలుగు పద్యము పాడుము తెలుగుబాల
తెలుగుతేజంబు వెలయంగ దిశలు మ్రోవ

– మిక్కిలినేని హరీష్ (ప్రస్తుతం నూజివీడు ఐఐఐటీ కళాశాల విద్యార్థి)

## భాష వస్తుంది



మా నాన్నది వ్యవసాయం. నేను ప్రభుత్వ పాఠశాలలో చదివాను. మొదట పాసు మార్కులే వచ్చేవి. ఇపుడు క్లాసులో ఫస్టు నాదే. పద్యపఠనం వల్ల మిగతా పాఠాలు కూడా బాగా చదవగలం. పద్యాల్లో పెద్ద పెద్ద పదాలు అలవాటయితే, తెలుగు సగం సులువైపోతుంది. మంచి భాష వస్తుంది. గొంతులో స్పష్టత వస్తుంది. నాకు ఎనభై పద్యాల దాకా కంఠతా వచ్చు. పదో తరగతి ఎ2 (9.5) శ్రేణిలో పాసయ్యాను.

– కందుల లీలాకృష్ణ (ఎస్.ఆర్.ఆర్, సి.వి.ఆర్ ప్రభుత్వ కళాశాల విజయవాడ)

అమ్మాయి 125 పద్యాలు నేర్చుకుంది. దీంతో పిల్లలకే పద్య పుస్తకాలను ఇచ్చి ఉత్సాహపరిస్తే ఈ ప్రయోగం మరింత విజయవంతం అవుతుందనిపించింది. అప్పుడే ఈ పుస్తకాలను ముద్రించి ఇవ్వాలని అనుకున్నాం.

దీని కోసం 'తెలుగు పద్యమూ, మా నాన్నా!' నుంచి, మరి రెండు పద్య సంకలనాల్లోంచి పద్యాలు ఎంపిక చేశాం. మిగతా పద్యాలను సుమతీ, వేమన శతకాల నుంచి సేకరించాం. ఈ రెండు పుస్తకాల్లో 'బాలల గేయాలు' 1 నుంచి 5వ తరగతి లోపు పిల్లల కోసం, 'పద్యపారిజాతాలు' 6 నుంచి 10వతరగతి లోపు ఉన్నత పాఠశాల పిల్లల కోసం ఉద్దేశించాం. అన్ని మతాల వారూ పాడుకోగలిగే పద్యాలనే ఎంపిక చేశాం.

**పద్యాల సేకరణ, ప్రచురణ పనుల్ని మీ దంపతులిద్దరూ ఎలా పంచుకుంటారు?**

ఎక్కువగా నేనే చేస్తాను. నా భార్య జయశ్రీ అన్నీ చదివి, మేం అనుకున్నట్లుగా ఉన్నాయా,

విజయలక్ష్మి తమ పాఠశాల ఉపాధ్యాయుల సాయంతో కంకిపాడు మండలంలోని అన్ని పాఠశాలలకు వెళ్లి పుస్తకాలను స్వయంగా అందజేశారు.

ఈ పుస్తకాల విలువేంటో ముందు వీటిని పిల్లలకు నేర్పించే ఉపాధ్యాయులకు తెలియాలి. అందుకోసం మా కంకిపాడు మండల విద్యాధికారిని కలిసి ఓ సమావేశం ఏర్పాటు చేయవలసిందిగా కోరాం. ఆయన కొంతమంది ప్రధా

నోపాధ్యాయులతో సమావేశం ఏర్పాటు చేశారు. మిత్రులు పురుషోత్తం తిరుపతి నుంచి ప్రత్యేకంగా వచ్చి ఈ పద్యాలను ఎందుకు నేర్చుకోవాలో పద్యరూపంలో తెలియజేశారు. వచ్చిన ఉపాధ్యాయులంతా పద్యం విలువను ప్రయోజనాన్నీ తెలుసుకోగలిగామని ప్రశంసించారు.

**పిల్లల్లో తెలుగు పట్ల అభిమానం పెంచటానికి ఏం చేస్తే బాగుంటుంది?**

పిల్లలు చక్కటి కథలను ఇష్టపడతారు. అటువంటి పుస్తకాలు రావటం లేదు. పైగా చాలా మంది పిల్లలకు తెలుగు చదవటం, రాయటం రావడం లేదు. పాఠశాలల్లో ఐదవ తరగతి వరకు తెలుగులోనే చదువు కొనసాగాలి. తెలుగులో బాలల రామాయణం, బాలల భారతం, పంచతంత్రం, పేదరాశి పెద్దమ్మ, కాశీ మజిలీ కథలు, మహనీయుల ఆత్మకథలు... ఇలా పిల్లల కోసం మంచి పుస్తకాలెన్నో ఉన్నాయి. అలాంటివన్నీ అందుబాటులోకి తేవాలి.

**పిల్లల చేత పద్యాలను కంఠస్థం చేయించే సంప్రదాయం మరుగున పడుతోంది, ఎందుకు?**

ప్రభుత్వ పాఠశాలల్లో చదివే పిల్లల తల్లిదండ్రులు దీని ప్రయోజనం తెలియక శ్రద్ధ చూపించడం లేదు. మరోపక్క పాఠ్యపుస్తకాలలో పద్యాలు గ్రామీణ పిల్లలు నేర్చుకోగలిగే స్థాయికి మించి ఉంటున్నాయి. ఒకటవ తరగతి నుంచి వారికి పద్యాలను నేర్పిస్తే ఇది కష్టమేమీ కాదు. కానీ ఆ పరిస్థితి లేదు. చిన్న తరగతుల్లో శ్రద్ధ లేకపోవడం వల్ల పై తరగతులకు వచ్చేసరికి నేర్చుకోగల పద్యాలు కూడా వారికి కష్టంగా అనిపిస్తున్నాయి.

విద్యార్థులు సినిమా పాటలు పాడుతున్నారు. టీవీ, రేడియోల ద్వారా వాటిని నేర్చుకుంటున్నారు. మరి పద్యాలెందుకు నేర్చుకోలేరు? కొద్దిగా ప్రోత్సహిస్తే వాళ్లకది కష్టం కానే కాదు. మాకు పేపర్ వేసే అబ్బాయి చేత నా సతీమణి జయశ్రీ రోజుకొక పద్యం చెప్పిస్తుంది. లేదా ఏదైనా సామెత నేర్పిస్తుంది. మరుసటి రోజు వచ్చి అప్పజెపుతాడు. ఇటువంటి సంఘటనలు మాకెంతో ఉత్తేజాన్నిచ్చాయి.

'బాలల గేయాల'ను అంగన్‌వాడి కేంద్రాలలో నేర్పించగలిగితే బాగుంటుంది. పిల్లలు పద్యాలు పాడటానికి చాలా ఉత్సాహపడతారు. చిన్నతనంలో రెండుమూడుసార్లు వల్లెవేయడంతోనే పద్యాన్ని నేర్చుకుంటారు. పెద్దయిన తరువాత అంత తొందరగా బుర్రకు ఎక్కవు. కనుక చిన్నతనంలోనే పునాది పడాలి.

## జీవనపథం



నేను బి.కాం., సి.ఎ చేశాను. పదేళ్లు సి.ఎ. ప్రాక్టీసు అయింతర్వాత ఇరవయ్యేళ్లు ముద్రణా వ్యాపారం చేశాను. భార్య జయశ్రీ బి.కాం చదివి ఉద్యోగం చేసేది. తరువాత నా వ్యాపారంలో తనూ పాలుపంచుకుంది. ఈ రంగంలో చాలా కొత్త మార్పులు తీసుకువచ్చాం. నకిలీ విద్యాధృవీకరణ పత్రాల్ని అరికట్టేందుకు వాటికి కొన్ని భద్రతాంశాల్ని జోడించడం, ప్రీపెయిడ్ రీచార్జింగ్‌కు స్క్రాచ్ కార్డులు ముద్రించడం... మొదలైనవి ఎన్నో దేశంలో మేమే మొదటిసారి చేశాం. మా ఇద్దరు అమ్మాయిలు అమెరికాలో మంచి ఉద్యోగాల్లో స్థిరపడ్డారు. మేమిద్దరం సుమారు 40 సం॥లు హైదరాబాదులోనే ఉన్నాం. 2003లో ఇక వ్యాపారాలు చాలించి గ్రామీణ వాతావరణంలో శేష జీవితం గడపాలనిపించింది. నా స్వగ్రామమైన కృష్ణాజిల్లా, కంకిపాడు మండలం, తెన్నేరుకు వచ్చి స్థిరపడ్డాం. నా అవసరం హైదరాబాదుకు లేనప్పుడు నేను నగరం మీద ఎందుకు ఒత్తిడి కలిగించాలి. అవసరం ఉన్న కుర్రవాళ్లకు ఆ నగరంలో ఉండే అవకాశం ఇవ్వాలని నా అభిప్రాయం. ఇపుడు కొత్త వ్యాపకాలతో ఇక్కడ సంతృప్తిగా గడుపుతున్నాం.

**దేవినేని సీతారావమ్మ ఫౌండేషన్ స్థాపన ఉద్దేశం ఏంటి? ఏ కార్యక్రమాలు చేపడుతున్నారు?**

మా వ్యాపారాన్ని అమ్మివేశాక, పెద్ద మొత్తాన్ని కేటాయించి మా అమ్మ పేర ఫౌండేషన్ స్థాపించాలనుకున్నా. దాని మీద వచ్చే ఆదాయంతో విద్య, సేంద్రియ వ్యవసాయం, గ్రామీణాభివృద్ధి పనులను చేపట్టాలనుకున్నాం. కొన్ని కారణాల వల్ల ఆ పనులన్నీ అనుకున్నట్టుగా చేయలేకపోయాం. ప్రస్తుతానికి చిన్న చిన్న పనులు చేస్తున్నాం. 2000 సంవత్సరం నుంచి కొన్ని పుస్తకాలను ప్రచురించి చాలామందికి ఉచితంగా ఇస్తున్నాం. వాటిలో కొన్ని: ద్వారక 'పల్లె పిలిచింది', నామిని 'పిల్లల భాషలో ఆల్జీబ్రా', ఉషశ్రీ 'రామాయణంలో హనుమంతుడు', సుధామూర్తి 'అమ్మమ్మ చదువు' (అలకనంద వారితో కలిసి), శ్రీరమణ 'మిథునం' (ఒక స్నేహితుని షష్టిపూర్తి సందర్భంగా), నగ్నముని 'ఆకాశదేవర'... మొదలైనవి. ఇవి అమ్మకానికి కాదు. స్నేహితులకు, పిల్లలకు, ఉపాధ్యాయులకు పంచటానికి మాత్రమే.

ఇందులో భాగంగానే ప్రస్తుతం ఈ రెండు పిల్లల పద్య, గేయాల పుస్తకాలు ప్రచురించాం. ఆర్థికంగా వీలయితే వీటిని కొంతమంది మిత్రుల సాయంతో కృష్ణాజిల్లాలో ఉన్న 5 - 6 లక్షల మంది విద్యార్థులకు అందజేయాలనుకుంటున్నాం. అది మా ఆశయం.

**– తెలుగు వెలుగు బృందం**
**సహకారం: జి. వెంకటేశ్వరరావు, కంకిపాడు**



## ఆదరణా... చేయూత



మా నాన్న కూలి పనులకు వెళ్తారు. నేను ఇక్కడి ప్రభుత్వ పాఠశాల్లో చదివేవాణ్ణి. 2005లో పదవతరగతి చదువుతూ ఇక్కడకు వచ్చాను. నాతోపాటు పదిమంది ఉండేవారు. ఇక్కడ చదువుకోవటానికి అనువైన వాతావరణం ఉంటుంది. ఆసక్తి ఉన్నవాళ్లు తమంతట తామే వస్తారు. ఇక్కడ మాకు నోటుపుస్తకాలు, పెన్నులు ఇస్తారు. ఫీజులు కూడా కడతారు. నాకు ఇప్పటిదాకా ఫీజులన్నీ మధుసూదనరావు గారే కట్టారు. ఈ మధ్యనే ఉపకారవేతనం సంపాదించాను.

**– కిశోర్** (చెన్నైలో ఐఐటిలో ఎమ్.టెక్ చేస్తున్నారు.)

# సాహితీవనంలో
# బాలముత్యాలు





**భాషాభివృద్ధికి మేముసైతం అంటూ ఉడతాభక్తిగా ముత్యాల పంటను పండిస్తున్నారు ఈ చిన్నారులు. గురువుగారి ప్రోద్బలంతో గురజాడ ముత్యాల సరాల్ని స్ఫూర్తిగా తీసుకుని పద్యాలు రాశారు. బాలల మనసుల్లో ఒక మంచి ఆలోచన నాటితే ఎంత అందంగా పండుతుందన్న దానికి ఉదాహరణగా నిలుస్తున్నాయీ పద్యాలు.**

వేల వేల భాషలున్నవి
భాషలన్ని నీవు నేర్చిన
తెలుగు మాత్రం మరువబోకుము
తెలుగు వరమేరా!

తెలుగు ప్రజల గుండెల్ని జాగృతపరిచే భావం స్ఫురిస్తుంది. ఇది రాసిన వారు ఉద్దండ పండితులు కాదు. సాహితీవేత్తలు అంతకంటే కాదు. వారంతా చిన్నారి కవులే. 'సమాజాన్ని సంస్కారవంతంగా నడిపించేది సాహిత్యం' అన్న గురజాడ మాటల్ని స్ఫూర్తిగా తీసుకున్నారు. వారి చుట్టూ ఉన్న సమాజాన్ని పరిశీలించారు. తమ కలాలకు పదును పెడుతూ గురజాడ అడుగు జాడల్లో పయనిస్తున్నారు.

వెలుగు నీటను గ్రుంకె చుక్కలు
చెదల చీకటి కదల బారెను
యెక్కడనొ ఒక చెట్టు మాటున
నొక్క కోకిల పలుక సాగెను
-గురజాడ

చుక్కలు కుంగే చీకటిలో ఎక్కడో చెట్టు కొమ్మల మూలన కోకిల తన మధురస్వరాన్ని వినిపించి ఉషోదయానికి స్వాగతం పలుకుతుంది. ఆ కోకిల స్వరాలే... ఈ చిన్నారులు. గురజాడ అప్పారావు మాత్రా ఛందస్సులో ఆధునిక యుగానికి అందించిన నూతన ప్రక్రియే 'ముత్యాల సరాలు'. అదే ఒరవడిలో గురజాడ భావాలకనుగుణంగా పద్యాలు కాదు, వచన కవితలు కాదు, అచ్చమైన ముత్యాల సరాలే రాస్తూ సాహిత్య లోకానికి స్ఫూర్తినిస్తున్నారు ఈ బాల మేధావులు. కవి కావాలంటే సామాజిక పరిశీలన, పెద్దల మార్గదర్శకం, ఆసక్తి, భాష, సృజన ఉండాలి. ఈ చిన్నారులు తమ కవితా హృదయాలతో భాషాభివృద్ధికి పట్టం కట్టి సాహిత్య వనంలో 'బాల ముత్యాలు' వెదజల్లుతున్నారు. ఆ ముత్యాల సారం తెలుసుకోవాలంటే శ్రీకాకుళం జిల్లా పాతపట్నం ప్రభుత్వ ఉన్నత పాఠశాల విద్యార్థులు రాసిన 'మూడు యాభైల బాలముత్యాలు' చదవాల్సిందే.

నవయుగ వైతాళికుడు గురజాడ అప్పారావు 150వ జయంతిని పురస్కరించుకుని ఆ పాఠశాల తెలుగు ఉపాధ్యాయుడు మహేంద్రాడ సింహాచలాచార్య చేపట్టిన బృహత్కార్యమిది. ఆయన టెక్కలి పాఠశాలలో చేరినప్పటినుంచి చేయాలనుకుంటున్న ఈ సాహితీ క్రతువు పాతపట్నంలో ఆయన శిష్యులు పూర్తి చేశారు. పాఠాలు బోధిస్తున్న సమయంలోనే పిల్లల సృజనాత్మక శక్తి పసిగట్టి మాత్రా ఛందస్సు పదిహేను రోజుల్లో నేర్పించారు. తరువాత 'ముత్యాల సరాలు' శైలిలో గేయాలు రాసేలా చేశారు. పదోతరగతి లోపు ఇరవై మంది విద్యార్థుల బృందంగా ఏర్పాటు



చేశారు. వారందరికీ ప్రోత్సాహమిచ్చి గేయ ప్రక్రియకు శ్రీకారం చుట్టారు. వందగేయాలే రాయించాలనుకున్నా.. పిల్లల ప్రతిభ పరుగులు తీసి వాటి సంఖ్యను పెంచాయి. వీటిలో 150 గేయాలను ఎంపిక చేసి 'బాలముత్యాలు' పుస్తకాన్ని అచ్చువేశారు. దీన్ని మూడు యాభైల గురజాడ జయంతికి అంకితమిచ్చారు.

**ఆలోచన భావాలే.. బాలముత్యాలు**

నౌపడ (టెక్కలి)లో ఉపాధ్యాయ వృత్తి చేస్తున్నపుడు మహేంద్రాడ తన ఆలోచనలను స్నేహితులకు చెప్పారు. వారిలో పి.ఎస్.నాగరాజు, ఎల్.ఎన్.కొల్లి, పాతపట్నం ప్రభుత్వ ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులు రెడ్డి సత్యనారాయణ, సాహితీమిత్రులు తదితరులు ప్రోత్సాహమిచ్చారు. పిల్లల్లో సృజనశక్తి మేల్కొలిపి ఏదో ఒకటి చేయాలన్న తపనే ఆయన్ని ముందుకు సాగించింది. ప్రజాస్వామ్య విలువలకు కవితాత్మక కార్యాచరణ ప్రణాళికైన గురజాడ 'దేశభక్తి' ఒకటి చాలు. మానవీయ విలువలు సాధించాలంటే "మంద గించక ముందుకడుగేయి వెనుకపడితే వెనుకె నోయీ" అంటూ ముందుకు నడిపించే శక్తి గురజాడ. ఆయన రచించిన 'ముత్యాల సరాలు' స్ఫూర్తే ఈ పాఠశాల్లో 'బాల ముత్యాలకు' ప్రేరణ. తొలుత పిల్లలకు గురజాడ రచనలు పరిచయం చేశారు. మాత్రా ఛందస్సులో గేయం రాసే విధానం నేర్పించారు. అనంతరం వారి ఆలోచన భావాలను పలుకరించారు. పిల్లలకి ప్రత్యేక తరగతి నిర్వహించి, కొందరు సాహితీవేత్తల ఆలోచనలతో చిన్నచిన్న అంశాలిచ్చి కవితలు రాయమన్నారు. రెండు నిమిషాల్లో రాసి వారి ప్రతిభ కనబరచడంతో ఆశ్చర్యం కలిగింది. వారి ఆలోచనల నుంచి వచ్చిన భావాల సారమే 'బాల ముత్యాలు'.

**చక్కని అవకాశం**



తెలుగు భాషాభివృద్ధికి మాలో ప్రేరణ కలిగించింది. తెలుగు రచనల్లో మాధుర్యాన్ని అందించడానికి ఇది చక్కని అవకాశం. అందరికీ తెలుగు భాష ప్రాధాన్యతను చాటి చెబుతాం. ఇప్పటి వరకూ ముప్పై గేయాలు రాశాను. అందులో నాకు గుర్తింపు తీసుకొచ్చిన గేయం.

**" తెలుగు భాషే తేటగీతోయ్**
**తెలుగు వెలుగే మంచి బాటోయ్**
**తెలుగు మాటే గొప్ప పాటోయ్**
**తెలుగు మరవకురా! "**

**– తాడేల రాంబాబు, పదో తరగతి**

**తెలుగంటే ఇష్టం**



తెలుగు పద్యాలంటే భయంగా ఉండేది. మా ఉపాధ్యాయుడు (మహేంద్రాడ) చెప్పిన సులభపద్ధతే గేయాలు రాసేలా చేసింది. బాలముత్యాలు అచ్చయిన తరువాత మా రచనలు చూస్తూ చాలా సంతోషించాం. యాభైకి పైగా గేయాలు రాశాను. నేను రాసిన బాలముత్యాల్లో ఒకటి.

**"భాష లేనిది మనిషి లేడోయ్**
**భాష మనకు తోడు నీడోయ్**
**భాష ఉంటే బతుకు రాజోయ్**
**భాష విడువకురా!"**

**– బి.కావ్య, తొమ్మిదో తరగతి**

శతక సాహిత్యానికి చిరు ప్రయత్నం గ్రంథాలయాల అట్టడుగు అరల్లో మగ్గిపోతున్న శతకాలెన్నో వెలికితీసి నేటి తరానికి అందిస్తున్నారు. ఈ 'శతకాల సేకరణ'లో 17 మంది విద్యార్థులు పాల్గొన్నారు. ఇప్పటికి 150 శతకాలు పూర్తిచేశారు. ఈ విధంగా తెలుగు సాహితీ సంపదను దశదిశలా అందించడానికి చేస్తోన్న చిరుప్రయత్నం వారిది.

**ఇంకెన్నో కార్యక్రమాలు**

పిల్లలు రాసిన కథలు, కవితలు, పాటలు క్రోడీకరించి అనంతపురం నుంచి వచ్చే 'కొత్త పల్లి' పుస్తకంలో అచ్చు వేసేందుకు పంపించారు. రచయితలు, వారి ప్రాశస్త్యాలు సేకరించి పాఠశాలలకందించి మాతృభాషకు సేవ చేయాలనుకున్నారు. ఆచరిస్తున్నారు. పాఠశాల ప్రార్థనలో 'మన తెలుగు పద్యం' పిల్లలతో రాగయుక్తంగా పాడించి, భావం చెబుతారు.

**పిట్ట కొంచెం.. రాత ఘనం**

ఈ విద్యార్థులంతా వారి చుట్టూ ఉన్న సమాజాన్ని చదివారు. గ్రహించిన సామాజిక పరిస్థితులే వారి కలం నుంచి జాలువారిన బాలముత్యాలు. 'అల్పాక్షరాల్లో అనల్పార్థం' అన్నట్లు పాఠకుల హృదయాల్ని హత్తుకునేలా అందించారు. నేటి సమాజంలో జరుగుతున్న అవినీతి, అంతరిస్తున్న మాతృభాష, విద్య ఆవశ్యకత, గురువు విశిష్టత వంటి అంశాలను స్పృశించి ప్రతిఒక్కరూ ఇరవైకి పైగా గేయాలు రాశారు.

**- తెలుగు వెలుగు బృందం**

**సృజనకు ప్రతిబింబాలు**



ప్రజాస్వామ్య విలువలకు కవితాత్మక కార్యచరణ ప్రణాళికైనా గురజాడ దేశభక్తి ఒకటి చాలు. మానవీయ విలువలు సాధించడానికి ఆయన అడుగుజాడలో మనం పయనించాలి. నేను టెక్కలిలో పనిచేసినప్పుడు వచ్చిన ఆలోచనలకు పాతపట్నంలో మా విద్యార్థులు సఫలీకృతం చేశారు. వారిలో సృజనను మేల్కొల్పేందుకు బాలముత్యాలు అద్దంపడతాయి.

**– మహేంద్రాడ సింహాచలాచార్య, సహాయోపాధ్యాయుడు, తెలుగు.**

**ఇది మా పాఠశాల సంపద**



భాష నేర్చుకోవడంలో అంతిమ లక్ష్యం సృజన అయితే మా విద్యార్థులు ఆ స్థాయిని అందుకున్నారు. భావోద్వేగాల్ని భాషలోకి మలచి పెట్టడం చిన్న విషయం కాదు. పిల్లలు కవిత్వం రాస్తున్నారంటే ఆశ్చర్య పోయాను. మహేంద్రాడ మా పాఠశాలకు వచ్చిన తర్వాత సాహితీవనంగా మారింది. ఈ బాల ముత్యాలు మా పాఠశాల సంపదగా గర్వపడుతున్నాను.

**– రెడ్డి సత్యంనాయుడు, ప్రధానోపాధ్యాయులు, పాతపట్నం.**



# దేవుని బిడ్డలు



మీరు దీన్ని నిజమన్నా అనుకొండి. అబద్ధమన్నా అనుకొండి. అది మీ ఇష్టం.

నేను పెద్ద బుక్కులు సదవలేదు. నోరు తిరగని పరాయి మాట్లు నేర్సలేదు. అన్నీ సదివి గడ్డాలు మీసాలు నెర్సినోళ్లు ఏమి రాతలు రాసిండారో, ఏమి కూతలు కూసిండారో, నాకు అసలుకే తెలీదు.

ఈ జనాన్నంతా సూస్తా ఉంటే- ఇంతకు ముందు జరిగిన సంగతంతా ఒగసారి మీకు సెప్పుదాము అనిపిస్తా ఉంది.

యనకటికి దేవునికి- ఆయప్ప లోకంలోని దేవానుదేవతలనంతా సూసి, వాళ్ల యవ్వారాలు ఇని శానా బేజారయి పాయనంట. 'తూత్.. ఏమిరా ఈళ్ల పాడు బుద్ధులు, గలీజుపన్లు, అంతా సెడి సెన్నూరు తిప్పలు పట్టిండారు. ఈళ్లని సక్కజేసేకంటా నాశాతగాదు. ఇంగొగ కొత్తలోకమన్నా ఏర్పాటు సేస్తే బాగుంటాది' అని మనసులోనె అనుకొన్నంట.

అనుకోనుండే తడువు, సంగటి ముద్ద మాదిరి ఒక గోళాన్ని తయారుజేసి, పైన్నుంచి ఆకాశంలోకి పారేశనంట. అది గిరర్‌న బంగరం మాదిరి తిరగబట్నంట. అట్ల తిరుక్కొంట యా తావకీ పోలేదంట. 'తోకెనక నారాయణా' అని దేవుని సుట్టూనే తిరగబట్నంట.

అపుడు కొన్ని బొమ్మలు తయారు సేసి రూపాలు ఇంగడిచ్చి, దోసిట్లోకి తీసుకోని, వాటి నోట్లోకి సుక్కుడు, సుక్కుడు ప్రాణం పోసినంట. అపుడు ఆ బొమ్మలు గుడ్డుల్లో నుంచి బయటికొచ్చిన కోడి పిల్లల మాదిరి దేవుని సేతుల్లో బిలబిల తిరగపట్నంట. దేవుడు రవ్వంత సేపు ఆ జీవున్ని అట్లే సూసి మాటలు నేర్పిచ్చి 'మనుషులు' అని పేరు బెట్నంట.

"ఈ దినం నుంచి మీరు బొమ్మలు కాదు, జంతువులూ కాదు. బంగారట్లా ఆలోశన సేసే మనసున్న మనుషులు. మీరంతా ఆ గోళం మీదికి దుమికి హాయిగా బతుక్కోపోండి" అని సెప్పెనంట.

ఏడిదీ ఆధారం లేకుండ గిరర్‌న యంత్రం మాదిరి తిరుగుతా ఉండే దాన్ని జూసి వాళ్లు భయం పడిపాయరంట. ఏమి సేయల్లో తెలీక, నిలువు గుడ్లేసుకోని, బిర్రున బిగుసుకోని నిలబడిపాయిరంట.

దేవుడు వాళ్లకి శానా సెప్పి జూసెనంట. "ఒరే అది భూమిలోకం. మీ కోసరం కన్నగసాట్లు పడి తయారు సేసిండాను. ఆ తావకి పొయ్యి మానాలుండే మానవ లోకం తయారు సేయండి" అని గడ్డాలు పట్టుకోని అడుక్కొని, సిలక్కు సెప్పినట్లు సెప్పినంట.

అయినా వాళ్లెవురూ మాట ఇనలేదంట.

అపుడు దేవునికి కోపము నసాళానికి ఎక్కినంట.

"ఇదిగో నేను కండ్లు మూసుకోని, మూడంకెలు లెక్కబెట్టే లోపల, ఈట్నుంచి ఎల్లిపోవల్ల. లేకుంటె మిమ్మల్నేమి సేస్తానో నాకే తెలీదు" అని కండ్లకొద్దీ కోపం సేసుకోని, కండ్లు మూసుకొన్నంట.

'ఆత్రగాడికి బుద్ధిమట్టు' అనట్లు యనకా ముందూ సూడకుండ ఒగడు బిరీన భూమి లోకం మీదికి దుమికి పారేశనంట, వాడు ఎర్రోని మాదిరి భూమ్మీదికి 'ధడుమ్'న పడింది సూసి, మిగిలినోళ్లు ఎర్సుకోని, గడగడ్న అదురుకోని - దేవుని నోట్లోకి, ముక్కులోకి, సెవుల్లోకి... ఇట్ల యాడ సందుంటే ఆడ దూరి దాపెట్టుకొన్రంట.

మూడంకెలు లెక్కబెట్టేది అయినంక, దేవుడు కండ్లు తెరిస్తే దోసిట్లో ఎవరూ లేరంట. భూమ్మీదికి తొంగి సూసినంట. ఒకడు మాత్రం సీమిడిలో తగుల్కొన్న ఈగ మాదిరి భూమ్మీద పడి తనుకులాడ్తా ఉండాడంట.

మిగిల్న జనాలు ఏమైపాయరప్పా? అని దేవుడు భూమండలం అంతా అంజనం ఏసినట్ల ఎదికినంట. యాడా కనిపిచ్చలేదంట. 'నేను పుట్టిచ్చిన జనాలు నాకే తెలీకుండ టోపీ ఏసి, నా కండ్లకే కనిపిచ్చకుండ యాటికి మాయమైపాయరప్పా?' అని సందేహం పడినంట. ఇంగొగ సారి దుర్భిణీ ఏసినట్ల భూమండలం ఒగ పక్క నుంచి అంగుళమంగుళమూ గాలిచ్చినంట. అయినా కనిపిచ్చలేదంట.

సివరాకరికి- 'ఈళ్లు కంటి పాపలకి తెలీకుండ, కన్ను రెప్పల్ని కత్తిరించే రకం మాదిరి ఉండారు' అని అనుకోని, బయటి సూపులు సాల్జేసి, ఆయప్ప అంతరంగంలోనికి ఆయప్పే సూసుకొన్నంట.

యపుడయితే దేవుని సూపులు, దేవుని లోపలికి ఎలుగులు మాదిరి జొరబడ్నో- అపుడు వాళ్లకి భయమై పాయనంట. కన్నాళ్లో దూరుకోనుండే యలకలకి, పేడ పిడకల్లో ఊదరబెడ్తే యట్ల అవి బయటికి ఉరికెత్తుకొస్తావో అట్ల భగవంతుని శరీరంలోని సందుల్లో నుంచి సర్‌్న బయటికొచ్చిరంట!

అపుడు దేవుడు వాళ్లని సేతుల్లోకి తీసుకోని "ఒరే తప్పుడు నా కొడుకుల్లారా! నేను మీకు సెప్పిందేమి? మీరు సేస్తావుండేదేమి?" అని నోటికొచ్చినట్ల తిట్టి పారేశనంట.

దానికి వాళ్లు "స్వామీ మాన్నబావా! మమ్మల్ని ఈడ పుట్టిచ్చి ఆడపారేస్తే యట్ల బతకల్ల? బతికేతత్వం తెలిసే ఒరుకూ నీ అంగాల్లో సేరుకోనుండి, పరాన్న జీవుల మాదిరి బతుకుతాము" అని మొర పెట్టుకొన్రంట.

అపుడు దేవుడు తలతలే కొట్టుకోని "ఈ దేవలోకం సూస్తే అంతా మోసగాళ్లు, జనాలందరిలోనా లేనిపోని భయాలు పుట్టిచ్చి యాగాలు, నోములు, పూజలు, శాంతులు, వాస్తులు, దానాలు... ఇట్లా అర్థం పర్థం లేని పనులన్నీ సేపిచ్చి కూకోని తినేది రుసి మరిగిండారు. బతుకనేది మరిసిపొయ్యి నాటకాలే జీవితమన్నట్లు తయారయ్యిండారు. యన్ని ఉపదేశాలు సేసినా ఈ సెవిలో ఇని ఆ సెవిలో ఇడిసి పెడ్తావుండారు -

"దాని కోసరమే- దేవలోకమోళ్లు సూసి సిగ్గుపడే రకంగా భూలోకం తయారుసేయల్ల అని అనుకొంటి. మీరుజూస్తే ముంతడు నీళ్లకే ముక్కు మూసుకొనే ముదనష్టం నాయాళ్ల మాదిరి ఉండారు" అని మనసులోని బాధనంతా యల్లగక్కినంట. భూమిలోకంలోకి వాళ్లనట్ల తొంగి జూడమన్నంట.

* * *

యాడ జూసినా పచ్చపచ్చగా ఉండే అడువులు. తళతళా మెరిసే కొండలు, గుట్టలు, గలగలా పార్తాఉండే ఏర్లు. వంకల్లో పిళపిళా ఈదులాడ్తా ఉండే సేపలు, బక్కల్లో బెకబెకా అరుస్తావుండే కప్పలు, సెట్లమీద కిలకిలా అరుస్తావుండే గువ్వలు. కసువు మేసుకొంట బుడుగుబడుగున ఎగుర్తావుండే జింకపిల్లలు. పటపట్న రెక్కలు గొట్టుకోని ఎగుర్తావుండే పక్షులు. సర్‌్న జారిపోతావుండే పాములు. కొమ్మల మింద ఎగిరెగిరి దుముకుతా వుండే కోతులు. కండ్లకి ఆనందం తినిపిచ్చి శబ్దమే లేకుండ గాల్లో తేలిపోతావుండే ముత్యాలమ్మ పులుగులు (సీతాకోక చిలుకలు)... ఇట్ల ఒగటిగాదు రెండుగాదు, భూమండలమంతా అందాలు ఒలకబోసి అలికి ఇంపుగా ముగ్గులు పెట్టినట్లుంది. దాన్నిజూసి వాళ్లు శానా ఆనందం పడిపాయిరి.

అపుడు దేవుని దిక్కుతిరిగి "స్వామీ ఘడియ ముందు సూసినపుడు భూమండలం ఎండుకుపోయిన సంగటిముద్దమాదిరి, తిరుమల పూజార్లకి సిక్కిన భక్తాదుల తలకాయ మాదిరి నున్నగా ఉండిందిగదా?! ఇంత బిరీన మా కండ్లు పట్టనంత అందం యాట్నుంచి వాచ్చె?" అని అడిగిరంట.

అపుడు స్వామి "దేవలోకంలో ఒగ నిముషమైతే ఆడ భూలోకంలో ఒక యుగము. ఈడ కత్తిరించుకునే గిలీటుగాళ్లు, ఆడ కష్టం సేసి బతికే కల్మషం లేని జీవులు" అన్నెంట.

"అంటే వాళ్లెవురు స్వామీ"అని అడిగిరంట.

అపుడు స్వామి 'ఈళ్లు నాన్న సేతికి నామాలు పెట్టి నాన్నా నాగుబాబు అనే రకం నాయాళ్ల మాదిరి వుండారు' అని మనుసులోనే అనుకొని "కండ్లు ఇగ్గబీకి సరిగ్గా భూమండల



కథ

మంతా సూడండ్రా" అన్నంట.

అపుడు జూస్తే తలకాయకి బట్ట సుట్టుకోని, నడుముకానా పంచెగ్గట్టుకోని ఆడమగ పిల్లాపాపా ముసలిముతక అనకుండ ఎద్దుల్తోను, ఎనుముల్తోను, ఆవుల్తోను భూమిని దున్నుతావుండారంట. యండ వాన పగలు రాతిరి అనేదే మరిసి పంటలు సాగుజేసి అందరి బతుకులకీ అన్నం పండి పెడ్తావుండారంట.

వాళ్లకి భూమే ఒగ యగ్నగుండమంట. పంటలు పండిచ్చేదే ఒక యాగమంట. మనిషంటే పనంట. పనంటే మనిషంట. కాయకష్టం సేయకుండ బతికే బదులు సచ్చేది మేలు అనుకొనే రకమంట.

అట్లా జనాన్ని సూసిన దేవునిబిడ్లు, దేవుని గ్గూడ సెప్పకుండ భూమ్మీదికి సేర్రంట.

ఈళ్లు, రైతులూ కల్సిన భూమిలోకం శానా బాగుంటుందని మీరు అనుకోవచ్చు. అట్లను కొంటే మీరు- సదువునేర్సి సెడినోళ్లకిందే లెక్క!

యాలంటే -

ఒరే మేము దేవునిబిడ్లు. "నేను దేవుని నోట్లో నుంచి ఒచ్చిండాను, నాకాకలయినపుడు నోటికి అన్నం అందించే పని నీది"- అని ఒగడు. "నేను సెవుల్లో నుంచి ఒచ్చిండాను నేను సెప్పినట్లింటే నీకు పుణ్యమొస్తుంది" అని ఒగడు. "నేను కాళ్లలోనుంచి పుట్టిండాను, నా కాళ్లకి మొక్కి పూజలు సేస్తే నీకు స్వర్గలోకం అందుతుంది" అని ఒగడు. "నేను దేవుని కండ్లలో నుంచి ఒచ్చిండాను నేను సెప్పిన టయానికి ఇల్లుగట్టి, పెండ్లి సేసుకో, నువ్వు నూరేండ్లు బతుకుతావు" అని ఒగడు.. ఇట్ల కష్టజీవుల మింద దాదాగిరీ సేసుకోని- కండ్లకి గంతలు కట్టిచ్చుకొని గానుగను తిప్పే ఎద్దుల మాదిరి సేసి, కాడిచ్చుకోని తింటావుండారు.

ఇంతకు ముందయితే దేవుడు భూలోకానికి అపుడపుడు వొచ్చి సూసిపోతావుండె.

దేవలోకం మాదిరి భూలోకం గూడా యపుడు సెడిపాయనో అపుడు ఒచ్చేదే ఇడిసిపెట్టిండాడు. అందుకే ఇపుడు ఈ లోకంలో దేవునిబిడ్లు ఆడింది ఆట పాడింది పాటయి జరుగుతావుంది.





సడ్లపల్లె చిదంబరరెడ్డి
హిందూపురం.
94400 73636

# మనకు వరం సుస్వరం

బోధనలో మాతృభాష కీలకమని మనం గుర్తించటంలేదు. కనీసం ప్రాథమిక పాఠశాల స్థాయి వరకూ అన్ని పాఠ్యాంశాలనూ పిల్లల తల్లి భాషలోనే బోధించాలని శాస్త్రజ్ఞులు మొత్తుకుంటున్నారు. పిల్లవాడి వికాసం - అవగాహన, ఆలోచన, అభివ్యక్తి అన్న మూడు దశలతో ముడిపడి ఉంది. ముందు అతనికి విషయం తేటగా అర్థం కావాలి, ఆపైన అది ఆలోచనల్ని రేపాలి, చివరగా అతను సరళంగా, సూటిగా విషయాన్ని వివరించగలగాలి, అడిగితే చెప్పగలగాలి. దీనికి తల్లి భాషలో బోధన తప్పించి మరో మార్గమే లేదు. ఆంగ్లాన్ని పిల్లలకు ఒంట బట్టించాలన్నా, ముందు వాళ్లకు మాతృభాషంటే ప్రీతి కలిగించాలి. అప్పుడు ఆంగ్ల అభ్యాసం రెట్టింపు సులభం. అంటే, ఇంగ్లిషుకు కూడా తెలుగే రాచబాట.



కారు చీకట్లలో ఆ మధ్య ఒక కాంతిరేఖ మెరిసింది! కేంద్ర మానవ వనరుల అభివృద్ధి శాఖ రాష్ట్ర ప్రభుత్వాలకు కొన్ని సూచనలు చేస్తూ ఒక లేఖ పంపింది. తరగతుల స్థాయిని బట్టి, పాఠ్య పుస్తకాల భాష సరళంగా, సుబోధకంగా ఉండాలి. స్థానిక అంశాల్ని, ప్రముఖుల జీవితాల్ని పాఠాల్లో చేర్చాలి. అట్లా చదువును పిల్లలకు ఆసక్తికరంగా చెయ్యాలి. ఈ పనులు విద్యార్థి మాతృభాషలో చెయ్యటం సులభం కనుక కనీసం ప్రాథమికవిద్య అంటే 5వ తరగతివరకు మాతృభాషలో బోధించాలి. ఇట్లా ఉన్నాయి కేంద్ర ప్రభుత్వం సూచనలు. మంచిదే. ఈ బుద్ధి 'విద్యా హక్కు చట్టం 2010' తెచ్చేటప్పుడు ఎందుకు కలగలేదు? ప్రాథమిక విద్య వరకు అన్ని రకాల బడులలోను మాతృభాషే మాధ్యమంగా ఉండాలని ఒక నిబంధన ఎందుకు చేర్చలేదు? సూచన ప్రాయంగా ఈ సంగతులు ఇప్పుడు ప్రభుత్వాల చెవిని వేస్తే, ఎవరు, ఎందుకు పాటిస్తారు? ఈ ప్రశ్నలకు సమాధానాలు దొరకవు.

సరే, మన రాష్ట్రంలోనే కాదు, దేశంలోనే పాఠశాల విద్యార్థుల అభ్యసన ప్రమాణాలు ఎంత దిగజారుడుగా ఉన్నవో, 'ప్రథమ్' అన్న ముంబయి సంస్థ పుష్కరకాలంగా వార్షిక సర్వేలు నిర్వహించి నివేదికలు బయట పెడుతోంది. భాష, గణితాలలో 5వ తరగతి వారు 2వ తరగతి పుస్తకమే సరిగా చదవ లేకపోవటం, సాధారణ భాగహారాలే చేతకాక పోవటం చాలాసార్లు విన్నాం. అక్కడి దాకా ఎందుకు, మన రాష్ట్ర రాజీవ్ విద్యామిషను వారే ఏటేటా సర్వేలు చేసి నివేదికలు వెల్లడిస్తున్నారు గదా. వాటిదీ ఇదే ఘోష, కంఠ శోష!

ఆ మధ్య 73 ప్రపంచ దేశాల్లో 5 లక్షల విద్యార్థుల స్థాయిని 'పిసా' (ప్రోగ్రాం ఫర్ ఇంటర్నేషనల్ స్టూడెంట్సు అస్సెస్‌మెంటు) పేరున ఒక అమెరికా సంస్థ సర్వే చేసింది. మన దేశం వరకు మంచి పేరున్న తమిళనాడు, హిమాచలప్రదేశ్‌లలో పిల్లలను ఎంచుకొంది. ఫలితాలు కళ్ల నీళ్ళు తెప్పిస్తున్నాయి. గణితం, ఆంగ్లంలో మన కుర్రాళ్లు వస్తాదులను కుంటున్నాం. కానీ వారు చైనా కంటే బాగా వెనకబడి ఉండటమే కాదు, 73 దేశాలలో కింద నుంచి 2, 3 స్థానాలలో ఉన్నారు! ఒక్క కజకిస్థాన్ కంటే మాత్రమే మనం పైన ఉన్నాం.

సరే, మన పిల్లలు తెలుగుపై మక్కువ చూపాలంటే ఏం చేయచ్చో చూద్దాం. ఈ ప్రయత్నంలో, వినోదం, విజ్ఞానం, సమాచారం, నీతివర్తన అన్న అంశాలు సమపాళ్ళలో ఉండాలి.

**చిట్టి పొట్టి మాటలు**

తెలుగులో ఈ విశేష లక్షణాలు కొన్ని ఉన్నాయి. తమ అనుదిన జీవనంలో ఒక భాషావ్యవహర్తకు మౌలికంగా సుమారు రెండు వేల మాటలు అవసరం అవుతాయని శాస్త్రజ్ఞుల అంచనా. మన వాడుకలో చిట్టి పొట్టి రెండు మూడు అక్షరాల మాటలు అధిక సంఖ్యలో ఉంటాయి. కుటుంబపు చుట్టరికాలు, గ్రామ జీవనం, పరిసరాలు, పశు పక్ష్యాదులు, వృత్తుల సంబంధాలు - ఏవైనా చూడండి, ఈ చిట్టి మాటలు తారసపడతాయి.

- అమ్మ, నాన్న, అక్క, తమ్ముడు, చెల్లి, మామ, అత్త, తాత - ఇట్లా.
- ఆవు, ఎద్దు, బర్రె, మేక, గొర్రె, కోడి, కొంగ, పిట్ట, పిచ్చుక
- వేప, చింత, తుమ్మ, మామిడి, తాడి, ఈత, కొబ్బరి, బాదం, మునగ

మళ్ళీ ఈ చిట్టి మాటల్లో పరిశీలనగా చూస్తే, అదే ఒత్తున్న మాటలు కూడా బహళం అని తెలుతుంది.

ఉదా: అమ్మ, నాన్న, అత్త, చెల్లి, పిన్ని, ఇల్లు, దొడ్డి, పల్లె, నిప్పు, ఉప్పు, ఎద్దు, గొర్రె, పిట్ట, తుమ్మ, కొబ్బరి వగైరా. వీటినే ద్విరుక్తాలు అంటారు పండితులు. ఇక విశేషమేమంటే, ఇట్లా అదే ఒత్తున్న మాటలు శుద్ధంగా తెలుగు మాటలే, సంస్కృతం నుంచో, మరెక్కడి నుంచో వచ్చినవి కావు అని నిర్ధరించుకోవచ్చు. మన భాషలోని ఈ విశేషాల నుంచే పిల్లలకు అమితమైన వినోదం పంచవచ్చు. దీనిని పద కూర్పు అందాం. రెండు, మూడు అక్షరాలే ఉన్న

తెలిసిన మాటలన్నిటిని రాయమని, ఏ పదిహేను నిమిషాలు సమయపరిమితో పెట్టవచ్చు. అట్లాగే, రెండు హల్లులు ఇచ్చి వాటితో వచ్చే మాటలన్నిటినీ రాయమనవచ్చు.

మన అక్షర మాలలో ప్రతి హల్లుకు ఒక డజను గుణింతాలు ఉన్నాయి గనుక ఈ అభ్యాసంలో ఎన్నెన్నో పదాల్ని వెతికి పట్టుకో గలుగుతారు. క, త అన్న రెండు అక్షరాలతోనే డజన్ల కొద్దీ మాటలు దొరుకుతాయి. ఒక్క 'క' అక్షరంతోనే కాకి, కేక, కోక, కైక, కౌకు, కుక్క, కోకోలు ఉన్నప్పుడు, ఇక క, త లతో కోత, కంత, కుతి, కోతి, తోక, తిక్క, తుక్కు, తొక్క, తొక్కు, కత్తి, కత్తు వంటి ఎన్ని మాటలైనా దొరుకుతాయి గదా. ఇక మూడక్షరాల మాటలంటే, ఆకాశమేహద్దు!

### తెలుగు 'అజంత' భాష

నిజానికి తెలుగు భాష విలక్షణతగా మొదట చెప్పుకోవలసింది - అది 'అజంత' భాష అని. అంటే, ప్రతి మాటలోని చివరి అక్షరం ఏదో ఒక అచ్చుతో ముగుస్తుంది. తెలుగు, భాష అన్న రెండు మాటల్లో చివరి అక్షరాలైన 'గు', 'ష' లు ఉ, అ అనే అచ్చులతో అంతమవుతున్నాయి. దీనివల్ల సుస్వరంగా ఉండి, వినసొంపు అవుతుంది. తెలుగ్, భాష్ అంటే ఆ శ్రావ్యత రానేరాదు. యూరపులో ఇటాలియను భాషకు ఈ సుస్వరం ఉండడం వల్ల, మన తెలుగును దానితో పోల్చి పర భాషీయులు కూడ దీన్ని మెచ్చుకున్నారు. త్యాగరాజు తమిళదేశంలో పుట్టినా, అసంఖ్యాకమైన తన కృతుల్ని తెలుగులోనే రచించింది ఈ స్వర మాధుర్యానికి దాసుడు కావటం వల్లే.

కృష్ణశాస్త్రి గారి ఈ పాట చూడండి: ఆకులో ఆకునై, పూవులో పూవునై, కొమ్మలో కొమ్మనై, నునులేత రెమ్మనై, ఈ అడవి దాగిపోనా? ఎటులైన ఇచటనే ఆగిపోనా?

అట్లాగే -

కొమ్మల గువ్వలు గుసగుసమనినా
రెమ్మల గాలులు ఉసురుసురనినా
అలలు కొలనులో గలగలమనినా
దవ్వుల వేణువు సవ్వడి వినినా
నీవు వచ్చేవని, నీపిలుపే విని
కన్నుల నీరిడి కలయజూచితి...

ఈ పాటల్లో చిట్టి పొట్టి మాటలే ఉండటం, అవీ సుకుమారంగా ఉండటం, భాష అజంతం కావటంవల్ల మనోజ్ఞమైన సంగీతం వింటున్న అనుభూతి కలుగుతుంది. గమనిస్తే ఎడనెడా పాయసంలో జీడి పప్పుల్లాగ ద్విరుక్తాలు కూడ ఉన్నయి. ఇవన్నీ తెలుగు భాషాయోష సొంత సొమ్ములు!

### సామెతలు, జాతీయాలు /నుడికారాలు

ప్రతి భాషలోనూ ఇవి ఉంటాయి. సామెతల్లో హాస్యపూరితమైనవీ, నీతిదాయకమైనవి, జంతు పరమైనవీ, విరివిగా వాచకాల్లో చేరిస్తే పిల్లలు వాటినిక వదలరు.

**ఉదా:** - అనుమానం పెనుభూతం!
- తాతకు దగ్గులు నేర్పుతావా?
- పిల్లికి చెలగాటం, ఎలుకకు ప్రాణసంకటం!
- కాకి పిల్ల కాకికి ముద్దు

మన జాతి అదృష్టమేమంటే - వేమన మనవాడు, వేమన పద్యాలు మన సొంతం. ఆయన పద్యాల్లోని ఒక్కొక్క చరణమే ఒక్కో సామెతగా మెరుస్తుంది. వేమన, సుమతీ శతకాలు, చాటు పద్యాలు తేలికైన ఇతర పద్యాలు పాఠ్య పుస్తకాల్లో ఎక్కువ మోతాదులోనే ఉండాలి. ఒక్కో సామెతకి గంట కొద్దీ వ్యాఖ్యానం చెప్పినట్టు జాతీయాలకి చెప్పలేం. అవి ఎట్లా ఎక్కడ పుడతాయో తెలియదు గాని, జనం నోళ్ళలో నానటం విషయంలో సామెతలకి తీసిపోవు.

కాకి గోల, ఆరు నూరైనా, తాతలు దిగి వచ్చినా, కొంగజపం, కప్పల తక్కెడ, గుడ్డిలో మెల్ల, ములగచెట్టు ఎక్కించటం వగైరాల్ని సొంత వాక్యాల్లో వాడి చూపించమన్న అభ్యాసాలు పిల్లలకు కితకితలు పెడతాయి.

### 'ఇంచు' ప్రత్యయం

చెప్పుకోవలసిన మరొక భాషా చమత్కారం - 'ఇంచు' ప్రత్యయం. ప్రత్యయం అంటే క్రియ చివరన వచ్చేది, అర్థం మార్చేది. చదువు - చదివించు, ఆడు - ఆడించు, కొట్టు - కొట్టించు, పాడు - పాడించు, పొగడు - పొగిడించు మొదలయినవి. ఇట్లా బహుశా వందల కొద్దీ క్రియలకు ఈ సౌలభ్యం ఉన్నది. ఇంత సులువైన ఏర్పాటు ఇంగ్లిషుకి లేదు. 'బీటప్'కి 'టు హేవ్ బీటెనప్' అనాల్సిందే. పిల్లలకి అభ్యాసాల్లో ఇది కూడా ఉత్సుకత కలిగించేదే. మాటకు ముందు చేరే దాన్ని ఉపసర్గ అంటారు. నీలం - వినీలం, ఆయాసం - సునాయాసం, వాసన - సువాసన, జయం - విజయం, పక్షం - విపక్షం, వీటిల్లో వి, సు లు ఉపసర్గలు.

### ఛందస్సు, వ్యాకరణాలు వద్దు

పిల్లలు తెలుగులో ఇబ్బంది పడేది ఛందస్సు, వ్యాకరణాల వల్లే, నిజానికి తెలుగు మీద ప్రీతి కలిగించటంలో వీటి వాటా పూజ్యం. ఏ భాషీయుడూ తన మాతృభాషలో వ్యాకరణ విరుద్ధంగా మాట్లాడనే మాట్లాడడు.

కాకపోతే, రాయటానికొచ్చే సరికి పిల్లలు తప్పక తడబడతారు. మాటల 'స్పెల్లింగు' విషయంలో పండితులు పోటీపడి పిల్లల్ని హింసిస్తారు. ఇప్పుడు వ్యావహారిక భాష ఆమోదం కావటంతో, జవాబుపత్రాల్లో ఈ దోషాలను అట్టే పట్టించుకోకపోవటం మంచి పరిణామమే.

భాషా సంస్థలు, పద్య పఠనంలోనే కాక, ఎన్నో రకాలైన పోటీలు విద్యార్థులకు పెట్టవచ్చు. అసలు సంగతేమంటే - పాఠ్య ప్రణాళికను, పాఠ్యాంశాలను నిర్ణయించే మన రాష్ట్ర విద్యా పరిశోధన మండలి కేంద్రం సూచనలను ఆదేశాలుగా తలదాల్చి కొత్త పాఠ్యపుస్తకాల తయారీకి నడుం బిగించాలి. ఈలోగా 'విద్యా హక్కు చట్టం 2010'లో ఒక సవరణ తెచ్చి మాతృ భాషల్ని అన్ని రకాల బడులలోను 5వ తరగతి వరకు మాధ్యమంగా చేస్తే మంచిది!



## కోడలు... గోడలు



మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి ఆఖరి రోజులలో మంచాన ఉన్నపుడు ఆయనలోని హాస్యప్రియత్వం చెక్కుచెదర లేదని చెప్పుకునే ఉదంతం ఇది. ఒకాయన ఆయనను చూడటానికి వచ్చి 'ఎలా ఉన్నారు? బావున్నారా?' అని ప్రశ్నించారు. నెమ్మదిగా తలతిప్పి ఆయనకేసి చూసి- "సపర్యలు చేస్తూ, ఆకలేసినప్పుడు అన్నం తినిపిస్తూ కోడలు... లేవాలనుకుంటే పట్టుకుని నిలబడటానికి ఆసరాగా గోడలు..." అన్నారు. జీవనసంధ్యా సమయంలో తాత్విక సందేశాన్ని కళ్లు చెమ్మగిల్లేలా తనదైన హాస్యప్రీతిని మేళవించి చెప్పగలగడం ఆయనకే చెల్లింది.




**సి.ధర్మారావు**
ఆంధ్రప్రదేశ్ తెలుగు భాషోద్యమ సమాఖ్య తొలి అధ్యక్షుడు,
హైదరాబాద్. 040 24041999

# నీ యెంకమ్మా...

# ఇదేం భాష!

భాష అంటే అక్షరాల సముదాయం కాదు. చక్కని పదాల పోహళింపు మాత్రమేకాదు. వ్యాకరణ దోషం లేకుండా, నిర్దుష్టంగా మాట్లాడడమే కాదు. అందమైన వాక్యాల సందడే కాదు. అన్య భాషా పదాలను ఉపయోగించకపోవడమే కాదు. వీటన్నిటీనీ మించి మనం వాడే భాష మన సంస్కారానికి, వ్యక్తిత్వానికీ సంకేతం వంటిది. మన మనసులో ఎటువంటి భావాలుంటాయో, మన పెదవుల మీద అవే పలుకుతాయి. అందుకే మనం వాడే భాషను బట్టి మన సంస్కారం తెలియడమే కాదు మనపట్ల ఇతరుల ప్రవర్తన కూడ రూపు దిద్దుకుంటుంది.

నిత్య జీవితంలో భాషను వాడే తీరు వల్ల వచ్చే ఇబ్బందుల్ని మనం చూస్తూనే ఉంటాం. 'నోరు మంచిదైతే ఊరు మంచిదవుతుంది' అనడంలోని ఆంతర్యం ఇదేనని కూడా అర్థం చేసుకుంటాం. ఒకప్పుడు నిత్యజీవితంలోనూ, సాహిత్యం లోనూ కూడ భాష పట్ల శ్రద్ధ ఉండేది. ఒకరినొకరు ఎంత విమర్శించుకున్నా భాషలో ఎక్కడా సంస్కారం తగ్గేది కాదు. విమర్శ అంటే తిట్టు అనీ, మనకు వ్యక్తిగతంగా ఇష్టం లేని వాళ్లపై పగ తీర్చుకోవడానికి పనికి వచ్చే ఒక సాహితీ సాధనమనీ విపరీతార్థాలు లేని రోజుల్లో విమర్శ ఎంత ఘాటుగా ఉన్నా, సంస్కార పరిమళం అందులో కనిపించేది. ఉదాహరణకు కట్టమంచి రామలింగారెడ్డిని ఎంతగానో గౌరవించి, అభిమానించిన రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, రంగనాథరామాయణం విషయంలో ఆయనతో విభేదం వచ్చినపుడు, ఆ అసహనాన్ని, ఆయన అభిప్రాయం పట్ల తన విముఖతనూ ఎంత సంస్కారవంతంగా చెప్పారో చూడండి.

'వారి శక్తియుక్తులను గౌరవించినంత హార్దముగా వారి అభిప్రాయములను అంగీకరించుట నావంటి వారికి పలుమారు కల్గు భాగ్యము కాదు' అన్నారు. ఆయనే పానుగంటి వారి సాక్షి వ్యాసాల గురించి రాస్తూ 'జంఘాల శాస్త్రికి నోరు తప్ప మరే అవయవమూ లేదని పాఠకులు అనుమానించినా తప్పులేదు' అని చమత్కరించారు. ఇవి విమర్శలే. కానీ ఎంత సంస్కారవంతంగా రాశారో గమనించాలి.

ఈ ధోరణి ఇటీవలి సాహిత్య విమర్శలో కనిపించదు. చాలా పరుషమైన పదజాలంతో వ్యక్తిగత విమర్శ చేయడం ఇప్పటి ధోరణి. విషయాన్ని బట్టికాక, వ్యక్తులను బట్టి విమర్శించడం ఏనాడైతే ప్రారంభమైందో అప్పుడే విమర్శలో సంస్కారహీనమైన భాష కూడా మొదలైంది. ఇంతకూ, భాషలో సంస్కారం అంటే ఏమిటి? సభ్యత, ఔచిత్యం, అపార్థాలకు తావివ్వకపోవడం, ఎవరినీ కించపరచకపోవడం. మనకు ఎన్ని పర్యాయపదాలు వచ్చు, ఎన్ని నానార్థాలు తెలుసు, ఎన్ని పలుకుబళ్లు ఎరుగుదుం అన్నది మాత్రమే భాషపై మనకు గల గౌరవాన్ని, అధికారాన్ని తెలపవు. వీటన్నిటితో పాటు వాడే పదాల్లో సంస్కారం ఉన్నపుడే భాషను మనం సరిగ్గా వాడుకున్నట్టు, భాషను గౌరవించినట్టు. భాషలో సంస్కారహీనత కొన్ని రకాలుగా ఉంటుంది. ఉదాహరణకు:



## పదాల్లో అసభ్యత

ఏం పీకుతున్నావు, నీ యెంకమ్మ వంటి పదజాలం సినిమాల నుంచి, టీవీల వరకు, నిత్యవ్యవహారంలోకి వచ్చి చేరాయి. ఈ రకం పదాలు సినిమాకొకటి చొప్పున కనిపెట్టి, ప్రజల మీదికి విసిరేసే ఉద్దండులైన సినిమా రచయితలకు మనకేమీ లోటు లేదు. ఇలాంటి పదాలు కొన్ని సినిమాల్లో హాస్యం పేరిట మనకు అలవాటు చేస్తున్న పదాలు. 'నీకు అంత సీన్ లేదు'. వంటివి చికాకు కలిగించినా అసభ్యంగా ఉండవు కనక, ఫరవాలేదు. పైన చెప్పిన పదాలతో పాటు, పెద్దవారిని ఏకవచనంతో ప్రస్తావించడం కూడ కనిపిస్తుంది. ముఖ్యంగా టీవీ వార్తల్లో 'షిండే వచ్చాడు, చిదంబరం అన్నాడు' అన్న ప్రయోగాలు కటువుగా వినిపిస్తాయి. ఇక్కడ వ్యక్తులు, వారి మీద మన అభిప్రాయాలు కాదు ముఖ్యం. క్రియాపదం వాడుతున్నప్పుడు వారి వయసు, వారి హోదా వంటివి కూడ పరిగణనలోకి తీసుకోవాలి.

**అ.** ఇక పత్రికల్లో, టీవీలలో సినిమా వార్తల్లో వాడే భాష మరీ సంస్కారహీనం. నాయికను వర్ణించేటప్పుడు 'అందాలు ఆరబోసిన' 'ఫలానా నటి అందాల ఆరబోత' - ఇలాంటి జుగుప్సాకరమైన పదాలు వాడడం తరచుగా కనిపించే విషయం. ఇవి వింటే తెలుగు భాష సంస్కారవంతమైన భాషేనా అన్న అనుమానం కలుగుతుంది.

**ఆ.** వివిధ పార్టీల రాజకీయనాయకులు ఒకరిపై ఒకరు దూషణలు గుప్పిస్తున్నపుడు ఎలాంటి భాషను వాడుతున్నారన్నది మనకు తెలిసినదే. అదంతా తెలుగే. కానీ ఎటువంటి తెలుగు? మనుషుల్ని గౌరవించే భాష మాట్లాడుతూ, బూతులు, అసభ్య పదజాలం వాడటం మన భాషను అవమానించడమే. బ్రోకర్లు, జోకర్లు, బఫూన్లు ఇత్యాది పదాలు అన్యభాషా పదాలయినందుకు పెద్ద బాధలేదు కానీ వాటి అర్థం పట్ల బాధ కలుగుతుంది.

**ఇ.** ఇష్టం లేని వ్యక్తులను, రాజకీయ ప్రత్యర్థులను 'పీక తెగకోస్తా' 'నాలిక చీరేస్తా' అన్నప్పుడు భాషలో ఏ లోపమూ లేదు. చక్కని తెలుగే. కానీ బాధ్యతాయుతమైన పదవుల్లో, సామాజిక స్థాయిలో ఉంటూ, పదే పదే తమకు నచ్చని వారి విషయంలో ఇలాంటివి ప్రయోగించడం భాషాసంస్కారానికి సంబంధించింది.




## సందర్భశుద్ధిలేని పదప్రయోగం

ఇవి టీవీ ఛానెళ్లలో తరచూ కనిపిస్తాయి. తమకు ఒక పదం లేదా వాక్యం తెలుసు కదా అని అత్యుత్సాహంతో అన్ని సందర్భాల్లోనూ వాటిని వాడేసే అలవాటు టీవీ రచయితలకు ఉంటుంది. ఉదాహరణకు ఒక టీవీ ఛానెల్లో 'అందాల తార తమన్నా నగల షాపులో హల్‌చల్' (అసలు ఈ వాక్యం కూడా క్రియ లేకుండా సమగ్రమైన అర్థం ఇవ్వదు.) అదే ఛానల్లో మరుసటి రోజు 'ఢిల్లీలో గవర్నర్ నరసింహన్ హల్‌చల్'.

ఇక్కడ యువ సినిమాతారకు వాడిన పదానికీ, రాష్ట్రంలోనే ప్రథమ పౌరుడైన పెద్దవయస్సు వ్యక్తికి వాడిన పదానికి తేడా లేదు. అసలు హల్‌చల్ అంటే అర్థమేంటి? దాన్ని ఎటువంటి సందర్భాల్లో వాడాలి? అది అన్యభాషాపదం కావడం వేరే విషయం. దానికంటే సందర్భశుద్ధిలేకపోవడం, ఔచిత్యం తెలీకపోవడం ఇంకా ముఖ్యం. ఇది తెలిసివుండడమే భాషా సంస్కారమంటే.

## అతిశయోక్తులతో ఔచిత్యం విస్మరించడం

'అతను బంతితో రెచ్చిపోయాడు. ప్రత్యర్థిని మట్టి కరిపించాడు' ఇంతా చేసి బాడ్మింటన్‌లో రెండో రౌండ్‌లో మూడు సెట్లలో రెండు సెట్లలో గెలిచినందుకు. 'రెచ్చిపోయి నటించాడు' 'రెచ్చిపోయి పాడాడు' 'రెచ్చిపోయి స్టెప్పువేసాడు'. అసలు ఈ రెచ్చిపోవడానికి ఒక అంతూ లేదు, అదుపూలేదు. భాషలో ప్రతి పదానికీ ఒక పరిమితి ఉంటుంది. ఒక స్వభావం ఉంటుంది. ఒక సందర్భం ఉంటుంది. అన్నిటికీ అన్నీ వాడేయడం మన టీవీల ప్రత్యేకత. టీవీ వ్యాఖ్యాతలు, విలేఖరులను చూసి రాజకీయనాయకులు, సినిమా తారలు కూడ ఇలాంటి భాష మాట్లాడేసి మురిసిపోవడం, వాటిని విని, సామాన్యులు కూడ అదో గొప్ప భాష అనుకుని వాళ్ల నిత్య వ్యవహారంలో చేర్చుకోవడం మరో రకంగా భాషను అవమానించడమే.

ఇంతకూ భాషలో సంస్కారం తగ్గడానికి కారణమేమిటి? అంటే మనుషుల్లో సంస్కారం తగ్గడమే అని చెప్పుకోవాలి. భాష గొప్పదనం దాని వ్యవహర్త మీద ఆధారపడి ఉంటుంది. భాష అంటే వ్యాకరణం, పర్యాయపదాలు, దీర్ఘాలు, వత్తులు, నానార్థాలు, అలంకారాలు, భిన్నమైన యాసలు, మాండలికాలు - అన్నిటినీ మించి అన్యభాషా పదాలను పూర్తిగా పరిహరించే స్వచ్ఛత - అని మాత్రమే అనుకోవడం మనకు అలవాటు. కానీ వీటన్నిటితో పాటు మనం వాడే భాష మన హృదయసంస్కారానికి ప్రతీక అన్న విషయం గుర్తించాలి. మనం ఎలాంటి పదాలను ఎలాంటి సన్నివేశంలో వాడుతున్నాం, మనం వాడే భాష వల్ల తోటి మనిషిపట్ల ఎంత కుసంస్కారాన్ని ప్రదర్శిస్తున్నాం అన్నది కూడా గమనించుకోవాలి.

భాషా సంస్కారానికి సంబంధించి పైన చెప్పిన ఉదాహరణలు కేవలం సూచనప్రాయంగా చెప్పినవే. ఇలాంటివి ఎన్నో మన చుట్టూ పత్రికల్లో, టీవీల్లో, నిత్యజీవిత సంభాషణలల్లో మనకు ఎదురౌతుంటాయి. భాషాభిమానులు వీటిని ఖండించడానికి కూడా పూనుకోవాలి.




**డా॥ సి.మృణాళిని**
ఆచార్యులు, తెలుగు
విశ్వవిద్యాలయం.
హైదరాబాద్. 98490 65147

# తెలుగువనం...
# తెలంగాణం



వింధ్య పర్వతాలకు దక్షిణాన దక్కను పీఠభూమిలో నడిగడ్డ ప్రదేశంలో ఉన్న ప్రాంతం తెలంగాణ. అందుకే ఈ ప్రాంతాన్ని 'నడిగడ్డ తెలంగాణ' అంటారు. బౌద్ధుల కాలంనాటి అనేక ఆనవాళ్లతో ఈ ప్రాంతం అతి ప్రాచీనతను సంతరించుకుంది. నిజామాబాద్ జిల్లాలో ముప్పై భాషలు మాట్లాడేవారు ఉన్నారన్న విషయం ఇక్కడ అనేక సంస్కృతులు, భాషలు వర్ధిల్లాయని చెబుతోంది. వీరి మాండలికమే ఇక్కడి ప్రజల భాష అనడానికి అనేక సాక్ష్యాలున్నాయి. కరీంనగర్ కేంద్రంగా శాతవాహనుల పాలన, నల్గొండ కేంద్రంగా విష్ణుకుండినుల పాలన, వరంగల్ కేంద్రంగా కాకతీయుల పాలన, హైదరాబాద్ కేంద్రంగా నైజాం పాలన... ఇలా అనేకమంది రాజుల, సంస్థానాధీశుల పరిపాలనను చవిచూసిన నేల ఇది.

ఏ భాషాపాలకులు ఈ ప్రాంతాన్ని పాలించినా ప్రజలు మాత్రం తమ మాతృభాషయైన తెలుగును ఏ మాత్రం వదిలిపెట్టకుండా విలసిల్లిన ప్రాంతం. రాజభాషలుగా ఆయా రాజుల భాషలున్నా తెలుగు సజీవంగానే ఉంది. హిందూ రాజుల కాలంలో సంస్కృతం, ముస్లిం రాజుల కాలంలో ఉర్దూ, ఆంగ్లేయులున్న చోట ఇంగ్లిషు రాజభాషలుగా కొనసాగాయి. రాజభాష ఏదైనా తెలుగు మాత్రం అన్ని కాలాల్లోనూ తన ప్రాభవాన్ని నిలబెట్టుకుంది.

పురాణకాలం నుంచీ తెలంగాణ ప్రాంతంలో భాషా సాహిత్యాలు రెండు పాయలుగా విస్తరించుకు పోయాయి. పండితులు తమ భాషగా సంస్కృతాన్ని, గ్రాంథికాన్ని ఎంచుకుంటే, నిరక్షరాస్యులు సామాన్యమైన తెలుగును ఎన్నుకున్నారు. మొదటితరగతికి చెందిన అల్పసంఖ్యాకులైన వారు సంస్కృతంలో, గ్రాంథికంలో సాహిత్యం సృష్టించుకుంటే, సామాన్య ప్రజలు వాటికి దీటుగా ప్రజల భాషలో సాహిత్యాన్ని సృష్టించుకున్నారు. అదే జానపదుల భాష. రాచరికం అమల్లో ఉన్న కాలం నుంచి ప్రజాస్వామిక కాలం వరకూ రెండు భాషలు, రెండు సాహిత్య సంస్కృతులు తెలంగాణలో విలసిల్లుతూనే ఉన్నాయి. ప్రజల భాష అని చెప్పే ఈ పాలితుల భాషే తెలుగు. ఇదే అసలు సిసలైన తెలుగు. సంస్కృత లాక్షణికులు గ్రంథాల్లో 'దేశ్య పదాలు', 'గ్రామ్య పదాలు' అని పేర్కొన్నదే ఈ తెలుగు.

పౌరాణిక, చారిత్రక కాలంలో పండితులకు దీటుగా ప్రజలు సులభమైన భాషలో రామాయణ, మహాభారత కథలనూ జానపద కథలుగా మలచుకున్నారు. చిరుతల రామాయణాలు, వీధి భాగోతాలు, యక్షగానాలు ఇలాంటివే. ఇవన్నీ మౌఖికంగానే జీవించాయి. వీరి మౌఖిక సాహిత్య సంపదను పరిశీలిస్తే ఎంతో భాషా సంపద, తెలుగు నుడికారం సొగసులు అందులో కనిపిస్తాయి. పండితుల లేదా గ్రాంథిక భాష నిలువ నీరు లాంటిదయితే ప్రజల భాష గలగలపారే సెలయేరులాంటిది. ఈ జానపదుల భాష ప్రవాహవేగంలో అనేక భాషా పదాలను తనలో కలుపుకొంది.

తెలంగాణ పల్లెల్లో సీతమ్మ బట్టలు ఆరవేయని స్థలం లేదు, రాముడు అడుగు పెట్టని చోటూ లేదు. రామాయణ, మహాభారత సంబంధమైన ఊళ్ల పేర్లూ, మనుషుల పేర్లూ ప్రతి గ్రామంలో కనిపిస్తాయి. తెలంగాణ పల్లీయులు ఇలా రామాయణ, మహాభారతాలను సొంతం చేసుకున్నారు. ఉత్తర హిందూస్థానంలో పుట్టిన ఈ మహా కావ్యాలు తెలుగు వాళ్లవే అన్నట్టుగా మలుచుకున్నారు. రామయ్యలు, లక్ష్మయ్యలు, భీముళ్ళు, ధర్మరాజులు, సీతమ్మలు, కృష్ణయ్యలు లేని ఊరు మనకు కనబడదు. పోతన భాగవతంలోని భాషా మాధుర్యాన్ని చవిచూస్తే తెలంగాణ ప్రజల భాషా మాధుర్యం అర్థమవుతుంది. నిరక్షరాస్యులై ఉండి కూడా పోతన భాగవతంలోని పద్యాలను కంఠతా పట్టిన వాళ్ళున్నారు. చదువు రాకున్నా భజనమండళ్లలో పోతన పద్యాలను, వేమన పద్యాలను చదువుతుంటారు. భజన గీతాల్లోని భాషను గమనిస్తుంటే ప్రజల భాషలో ఉన్న మార్దవం అర్థమవుతుంది. ఇలా పురాణకాలం నుంచే తెలంగాణ పల్లెల్లో ప్రజలభాష అద్భుతంగా వికాసం చెందుతోంది.

ఆయా రాజుల పాలనలో రాజభాషగా ఉన్న భాషల పదాలు తెలుగులో సంలీనమయ్యాయి. ఆ పదాలన్నిటినీ ఏ సంకోచమూ లేకుండా తమలో కలిపేసుకున్నారు. ఇలా సంస్కృత, ఆంగ్ల, ఉర్దూ, పార్శీ పదాలు వాళ్ల జీవితాల్లో మమేకమయ్యాయి.

అలాగే సరిహద్దు జిల్లాల ప్రజలు తమ వాడుకభాషలో ఆయా భాషాపదాలను ఇముడ్చుకొన్నారు. ఆదిలాబాద్, నిజామాబాద్ జిల్లాల ప్రజల భాషలో మరాఠీ పదాలు; రంగారెడ్డి, హైదరాబాద్ జిల్లా ప్రజల భాషలో ఉర్దూ పదాలు; మహబూబ్‌నగర్, మెదక్ జిల్లాల ప్రజల భాషలో కన్నడ పదాలు; నల్గొండ, ఖమ్మం జిల్లాల ప్రజల భాషలో కోస్తాంధ్ర వాడుక పదాలు కలిసిపోయాయి. కోస్తాలోని చాలా పదాలు తెలంగాణ పల్లె ప్రజల వరకు విస్తరించుకుపోయాయి. ఈ రోజు సొరకాయ, సాంబారు, గోంగూరలాంటి పదాలు కోస్తా ప్రాంతానికే పరిమితం కాదు. వాటిని తెలంగాణ ప్రజలూ స్వీకరించారు.







మొట్టమొదటి తెలుగు రాజులైన ఆంధ్ర శాతవాహనులు తెలంగాణ ప్రాంతంలోని కోటిలింగాల, కొండాపురం రాజధానులుగా రాజ్యం ఏలారనడానికి చారిత్రకాధారాలున్నాయి. అంటే తెలుగు పుట్టింది తెలంగాణ పల్లెల్లోనే అన్న విషయం అర్థమవుతుంది. శాతవాహన రాజుల్లో ప్రముఖుడయిన హాలుడి ఆస్థానంలో గుణాఢ్యుడు ఆస్థాన కవిగా ఉండేవాడు. గుణాఢ్యుడు రాసిన బృహత్కథ ప్రపంచ ప్రఖ్యాతిగాంచింది. ఇది గుణాఢ్యుడి తల్లివైపు వారి పైశాచీ భాషలో లిఖితమైంది. ఈ పైశాచీ భాష నేటి మాండలికం వంటిది. ఈ భాష రాజాదరణకు నోచుకోకపోవడం వల్ల చాలా భాగం కథలను అగ్నికి ఆహుతి చేశాడు గుణాఢ్యుడు. కాల్చివేయగా

మిగిలినవే బృహత్కథగా ప్రసిద్ధి చెందాయి. దీనిని సోమదేవుడు కథా సరిత్సాగరంగా అనువదించాడు. బృహత్కథలోని కథలు ప్రపంచ భాషలన్నిటిలోకి అనువాదమయ్యాయి. ఇలా ప్రపంచ కథా సాహిత్యానికే ఆద్యమనదగిన బృహత్కథ తెలంగాణలో పుట్టింది, తెలుగులో వెలువడింది.

అలాగే కందం రాసినవాడే కవి అని పండితుల అభిప్రాయం. తెలుగులో మొట్టమొదటి కంద పద్యం తెలంగాణ నుంచే వచ్చింది. తరువోజ అర్ధంకిలో పుడితే కందం కరీంనగర్‌లో పుట్టింది. కరీంనగర్‌కు పది కిలో మీటర్ల దూరంలో ఉన్న కురిక్యాలలో ఉన్న జానవల్లభ శాసనం కంద పద్యాల్లో ఉంది. ఇలా మొదటి కథకు, మొదటి కంద పద్యానికి తెలంగాణే పుట్టినిల్లయింది. అలాంటి తెలంగాణలో తెలుగు పవనాలు మొదట్నుంచీ బలంగానే వీస్తున్నాయి.

బౌద్ధమత వ్యాప్తికి తెలంగాణ ప్రాంతం ఎంతో తోడ్పడిందని ధూళికట్ట, కొండాపూర్, నాగార్జునసాగర్ లాంటి ప్రదేశాలను గమనిస్తే అర్థమవుతుంది. ఆ ప్రాంతాల్లో చేసిన తవ్వకాల్లో బౌద్ధమతానికి సంబంధించిన అనేక చిహ్నాలున్నాయి. తెలంగాణ ప్రజల భాష జన వ్యవహారంలో ఉన్న మాండలికం. ఆ భాషనే ఇప్పటికీ ఆదరిస్తున్నారు.

సురవరం ప్రతాపరెడ్డి కథల్లోని భాష ఉర్దూ తెలుగు సమ్మేళనమే. నిజాం పాలనా కాలంలో తెలుగు చదివే అవకాశాలు లేకున్నా తెలుగు బతికే ఉంది. ఆ పరిస్థితుల్లోంచి కూడా ఓ పి.వి. నరసింహారావు, ఓ కాళోజీ, ఓ దాశరథి, ఓ సినారె లాంటి వాళ్ళు రావటం చెప్పుకోదగ్గ విషయం. వాళ్లంతా జానపదుల భాషల్లోంచి నుడికారాన్ని స్వీకరించినవారే. మాతృవ్యవస్థ నుంచి వచ్చిన తల్లి భాషా సంప్రదాయం ఎందరికో మార్గదర్శకమైంది. నా తల్లి నుంచే నేను పాటను, భాషను నేర్చుకున్నానంటారు జ్ఞానపీఠ పురస్కార గ్రహీత సి.నారాయణరెడ్డి. దాశరథి నిజాం పాలనను 'తరతరాల బూజు నిజాం రాజు' అని ఎగతాళి చేసినా వాళ్ల భాషలో కవిత్వం రాయగలిగాడు. పల్లీయుల భాషలోని సౌందర్యాన్ని సుద్దాల హనుమంతు స్వీకరించాడు. మరెందరో రచయితలకు పల్లీయుల భాషే రచనాయుధం.

ఆంగ్ల ప్రాభవం ఉన్నా సామాన్య ప్రజలు మాత్రం తెలుగునే అధికార భాషగా కోరుకుంటున్నారు. తమ భాషా సంస్కృతులనూ తద్వారా తెలుగు జాతినీ రక్షించుకునేది ఈ పల్లీయులే.





**కాలువ మల్లయ్య**
సాహిత్య పరిశోధకులు,
అధికారభాషా సంఘం
మాజీ సభ్యులు,
హైదరాబాద్, 98493 77579

## జీవన సత్యం



అర్ధరాత్రి
దీపం వెలుగులో
కవిత రాస్తూ - నేను
కాగితం కొరుకుతూ - ఎలుక

* * *



రెండు చేతుల్తో - సంపాదించాలంటాడు
నేలపైన వాడు... దగా చేసి దర్జాగా బతుకుతాడు
పాపం - మన్ను పైన పడుతుందని
తెలుసుకోలేని - వెర్రిబాగులవాడు

* * *



నీళ్లలోన చేప
నింగి కెగిరితే ముప్పు
పక్కవాడిదంతా
కావాలంటే తప్పు

– సి.ఎస్.కుమార్, గుంటూరు
97032 78225

# పద్యం పాతబడునా



రాజరాజనరేంద్ర రాజుమెచ్చిన ఆంధ్ర
భారతపద్య సంపద ఘనమ్ము
మందార మకరంద మాధుర్యమున్ జూపె
బమ్మెర పోతన్న పద్యమధువు
దేశభాషల లెస్స తెలుగంచు 'రాయలు'
పల్లకీమోసిన పద్యగరిమ
రంగస్థలము మీద రాగరంజితముగా
ప్రతిభగాంచిన తెన్గుపద్య యశము

దినదినమ్మును భావసందీప్తిమెరయ
తెలుగుభాషకు సౌందర్యమెలమి పెరుగ
ధరణి వర్ధిల్లునాచంద్రతారకముగ
పద్యమును పాతదనుటంత భావ్యమగునె?

బొట్టెగాండ్రకు నీతిబోధగావించిన
బద్దెనార్యుని 'కందపద్య'పటిమ
మూఢవిశ్వాసముల్ మొదలంట నుగ్గాడ
మేటియౌ వేమన్న 'ఆటవెలది'
అంటరానితనమ్ము నంటు జాడ్యమటంచు
ఖండించు జాషువా 'గబ్బిలమ్ము'
మూర్తమౌ హృదయాల 'పుష్పవిలాపమై'
అనుకంపపెంచె జంధ్యాల విరులు

తెలుగుభాషకు నగిషీలు దిద్దినట్టి
తెలుగునాల్కల నడయాడు పలుకుబడుల
నవ్యకాంతుల భాసిల్లు కావ్యమణులు
తెలుగు వాణి కిరీటమున్ తేజరిల్లె॥

పద్యమ్ము చేతనే పరవశించిరి బుధుల్
శ్రీనాథు వర్ణించు జిహ్వారుచుల
పద్యమ్ము వల్లనే స్వాంతముల్ హర్షించె
శీతశైలము సౌరు కౌతుకమున
పద్యవైభవముచే పలుకుతేనె తెలుంగు
అభిభాషణలయందు యశమునందె
పద్యమ్ముకతమునన్ ప్రాచీన సాహితీ
తరువు సజీవమై ధరణి నిలిచె

బలముగా నాటుకొన్నది ప్రజల యెదల
నేలపాతిన పద్యమ్ము నింగినంటు
పటిమవర్ధిల్లి, వృక్షమై ఫలములీను
నెనరుతో నారగింపుడు, నిందలేల?

ఛందము చందమున్ తెలియజాలనివారలె 'పాతచింతకా
యందురు పద్యమున్, విదితమౌనాకొ? తెడ్డుకు కూరలో రుచుల్
'అందని ద్రాక్షపుల్లన'యటంచు వచించుటదెట్టి తెల్వియౌ?
సుందరమైన తెన్గున యశోమకుటమ్ముగ పద్యమొప్పెడిన్॥

పద్యము పల్కురీతి, పరిభాషణమొప్పుగ చెప్పు భాతి, సం
వేద్యముగాగ పాఠకులు వేడుకనందెడు నీతి చెప్పుచో
పద్యము హృద్యమై చెలగు; భావసమన్వయ లోపమౌనెడన్
పద్యమెకాదు, ఏ ఇతర ప్రక్రియనైనను పాతుటొప్పగున్॥

ప్రాసన్‌కట్టి, యతిన్ బిగించి, గణముల్ బంధించి, శయ్యాస్థితిన్
వాసింగూర్చిన పద్యమన్న ముదమౌ, భావాన్వయస్ఫూర్తి, వి
శ్వాసం బెంచి రచించు చో తొడవగున్ బ్రాహ్మీశిరోరత్నమై
భాసిల్లున్ భువి, పద్యమెన్నడు సజీవంబౌను ముమ్మాటికిన్॥

వచనకవియొకండు, పద్యకవియొకండు
కథకుడొకడు, గేయకవియొకండు
ఎవడు గొప్ప? అల్పుడెవడంచు ప్రశ్నింప
హెచ్చులొచ్చులేల? ఈర్ష్యలేల?

తీయని తెన్గు పద్యముల త్రేన్చుగ డెందము హర్షపూర్ణమౌ
వ్రాయగలట్టి యాశుకవివర్యులు కొల్లలు ఆంధ్రదేశమున్
పాయనికీర్తి తమ్ముల ప్రవాదములాడక, పద్యకావ్యముల్
వ్రాయగనిచ్చలేనియెడ వ్రాయుట మానుడు ప్రాజ్ఞులొప్పెడున్॥



**ద్విభాష్యం కామరాజు**
విశ్రాంత తెలుగు పండితులు, రాజమండ్రి.
95506 07675

# అక్షరాలూ

# అక్షర శ్రేణి... లే!

తెలుగు లిపిలోని ఒక్కో అక్షరం ఒక్కో ప్రబంధ నాయిక అంటే అతిశయోక్తి కాదు. మంచి ముత్యాల్ని వరుసలలో చక్కగా ఏర్చి, కూర్చి, పేర్చినట్లుగా నయనానందంగా, ఆహ్లాదకరంగా ఉండే మన అక్షరాల్ని చూసి గర్వించండి!... అయినా ఆధునిక అవసరాలకు తగ్గట్టుగా నిలవాలంటే లిపిలోనూ మార్పులు చేర్పులు అవసరం అంటున్నారు ఈ వ్యాస రచయిత... ఆ కోణంలో ఏమి అవసరమో ఏమి అనవసరమో విశ్లేషిస్తున్నారు.

అచ్చు అక్షరాలు ఆంగ్లంలో అయిదు, హిందీలో పదకొండు ఉంటే తెలుగు లిపిలో పద్నాలుగు. మన హల్లుల్లోని వర్గీకరణ నిజంగా అద్భుతమైన అమరిక. అక్షరాల్ని ఉచ్చరించే విధానాన్ని బట్టి వర్గీకరణ. దంతాలతో పలికే అక్షరాలు, పెదాలతో పలికే అక్షరాలు, ముక్కుతో పలికే అనునాసికలు. నాలికతో పలికే అక్షరాలు, కంఠంలో నుంచి వచ్చేవి. అలాగే రెండు రకాలుగా పలికే అక్షరాలు అదనపు ఆకర్షణ. ఉదాహరణకి 'మ' నే తీసుకుందాం. పెదాలతో పలికే అనునాసిక 'ప' వర్గంలో చివర అమర్చటం- ఎంత అద్భుతం! మనకెలాంటి లోటూ లేకుండా లిపిలో అక్షరాలు పొందుపరిచారు పెద్దలు.

### వివాదాలెన్నో

గత 30 సంవత్సరాలలో తెలుగు లిపిలో వచ్చిన మార్పులు, చేర్పులు బహుశా మరే ఇతర భాషలోనూ వచ్చి ఉండకపోవచ్చు. దీని వల్ల తెలుగు లిపికి జరగాల్సిన నష్టం చాలానే జరిగింది. తెలుగు లిపిలో అక్షరాలెన్ని అని అడిగితే సమాధానాలు రకరకాలుగా వస్తున్నాయి. తెలుగు లిపిలో అక్షరాలు ముప్ఫయి ఆరే. ఖ, ఘ లాంటి అక్షరాలు సంస్కృత అక్షరాలు. తెలుగు అక్షరాలు కావంటున్నారు. సరే ఏయే అక్షరాల్ని తొలగించారో వాటి గురించి ముచ్చటించుకుందాం.

### ౠ ౡ.

### ఋ ౠ

కొందరు పెద్దలు ౠ అక్షరాన్ని తొలగించమంటే మరికొందరు 'ఋ, ౠ' రెండూ అవసరం లేదంటున్నారు. ఋషి, ఋక్కులు, ఋజువర్తనం, ఋణానుబంధం లాంటి పదాలు 'ఋ'తో ప్రారంభించాల్సి ఉండగా 'రు' ప్రయోగం అధికమైంది. లోపం భాషది కాదు. ఋ, ౠ అక్షరాలు ప్రత్యక్షంగా మనం వాడకపోయినా పరోక్షంగా గుణింతంలో ర్యావడి/వట్రసుడి, వాటి దీర్ఘ రూపాలూ ఎన్నో పదాలలో ప్రయోగంలో ఉన్నాయి. ర్యావడి కేవలం 16 హల్లుల పక్కనే వస్తుంది. దీర్ఘం ఒక్క 'త' అక్షరం పక్కనే వస్తుంది. పితృ+ఋణం = పితౄణం (సవర్ణదీర్ఘ సంధి). నిజానికి క అక్షరం పక్కన కౄర అనే పదంలో 'కౄ' కూడా రావాలని నా అభిప్రాయం.

క్రూర అనే పదం సంస్కృతం నుంచి వచ్చిందనీ అలా వచ్చిన పదాల్ని మూల భాషల ఒరవడిలో రాయటం సంప్రదాయమనీ కొందరు పెద్దలు వివరణ ఇచ్చారు. కానీ ఇది సరికాదు. సంస్కృతంలో ౠ లేదు. హిందీలో లేదు కనుక అలా భావించాల్సి వస్తోంది. కానీ తెలుగులో ఉంది. ఒక పిల్లవాడిని దత్తత తీసుకుంటే ఇంటి పేరు మార్చటం మాత్రమే కాదు ఆచార వ్యవహారాలు, కట్టుబాట్లు అన్నీ దత్తత తీసుకున్న వారికనుగుణంగానే ఉంటాయి. పుట్టింటి వారి వాసనలుండవు. అలాగే క్రూర పదాన్ని కౄర అని రాయటం భాషని సరళీకృతం చేసే దిశలో సబబుగానే ఉంటుంది. అంటే సంయుక్తాక్షరం స్థానంలో గుణింతపు అక్షరం వాడకం సులువు కదా?! ఎలా రాసినా ఒప్పుకోవటం ఉత్తమం. కానీ ఋ, ౠ అక్షరాల్ని పూర్తిగా తొలగించటం దారుణాతి దారుణం.

ప్రస్తుతం కంప్యూటర్‌లలో ఈ అక్షరాలు లేవు. కాని వీటిని గురించి వివరించేందుకు ముద్రించటం తప్పనిసరి. ఈ సమస్యకూ మా సంస్థ తరపున సులభ పరిష్కారం కనుగొన్నాం. అచ్చుల్లోని ఒ అక్షరాన్ని తలకిందులుగా చేసి, రెండు అక్షరాలు చేసి, రెండో అక్షరానికి దీర్ఘం కలిపాం. తేలిగ్గా సమస్య పరిష్కారమైంది. భాషకు లిపి ఏర్పడిన కొత్తలో తెలుగు భాషలో ర, ల అక్షరాల ప్రయోగం అధికంగా ఉండటం చేత వివిధ రూపాలలో అచ్చుల్లో, హల్లుల్లోనూ స్థానం కల్పించారు పూర్వీకులు. తప్పులు చేయటం మానవ సహజం. మన పూర్వీకులూ మానవమాత్రులే కనుక వారు చేసిన ఒకే ఒక్క తప్పిదం ఈ అక్షరాలు. గుణింతం వచ్చేటప్పటికి ఈ అక్షరాలతో కొంత సమస్య ఎదురైంది. ఈ అక్షరాలు అచ్చుల్లో లేకపోయినా నష్టం లేదని ఆలస్యంగానైనా గుర్తించి తొలగించారు. అచ్చుల్లోనే కాదు ఈ అక్షరాల అవసరం ఎంత మాత్రం లేదని గుర్తించండి. ౢ అక్షరం కింది సగభాగాన్ని తొలగించండి. ల వత్తు వస్తుంది! 50 సంవత్సరాల క్రితం వరకు కౢప్తం అనే పదంలో అక్షరాన్ని ఒత్తుగా రాయకపోతే శిక్షించేవారు నాటి తెలుగు ఉపాధ్యాయులు. గుణింతం ద్వారా గానీ, ఒత్తుల ద్వారాగానీ వచ్చే అన్ని మార్పులు కేవలం హల్లులకు మాత్రమే వస్తాయి. తెలుగు భాషలో పదానికి ప్రథమ స్థానంలో తప్ప ఇతర స్థానాల్లో ఎంత మాత్రమూ రాని, ఎలాంటి మార్పులకు లోనుగాని ఒక అచ్చు అక్షరం మరో అక్షరానికి ఒత్తుగా ఎలా వస్తుందనేది నా ప్రశ్న. 50 సంవత్సరాల క్రితం వరకూ జరిగిన ఘోర తప్పిదమిది.

## ఉభయాక్షరాలు

ఁ ః ఇవి ఉభయాక్షరాలు. అం, అఃలు అచ్చులు కావు. కానీ ఎన్నో వాచక పుస్తకాలలో అచ్చులలో భాగంగా పరిగణిస్తూనే ఉన్నారు. ం (సున్న, పూర్ణానుస్వారము) అచ్చుల పక్కన, హల్లుల పక్కన, ద్విత్వాక్షరాల పక్కన, సంయుక్తాక్షరాల పక్కన, సంశ్లేషాక్షరాల పక్కన ఇందు గలడందు లేడని వందల, వేల పదాలలో ప్రయోగంలో ఉంది. అరసున్న అవసరం లేదంటున్నారు కొందరు. ఆఁ అని గద్దించినా, ఆఁహాఁ అని వెక్కిరించినా, ఊఁ కొట్టినా, ఊహూఁ అని గునిసినా, ఊఁ అని అంగీకారాన్ని తెలిపినా, ఊఁహూఁ అని అనంగీకారాన్ని తెలిపినా 'ఁ' ప్రయోగిస్తామే! పద్యాలలో, పౌరాణిక గ్రంథాల్లో 'ఁ' ప్రయోగిస్తామే; శ్రీరాముఁడు, శ్రీకృష్ణుఁడు, యముఁడు లాంటి పేర్లలో వాడతామే... మరి తొలగించటం ఎందుకు? ఆలోచించండి! విసర్గ అంతఃపురం, అంతఃకలహం, అంతఃకరణం, మనఃఫలకం, పునఃప్రసారం, మనఃపూర్వకం, దుఃఖము, అధఃపాతాళం- లాంటి తెలుగు పదాలలో, సంస్కృత పదాల్ని తెలుగులో రాయాల్సి వచ్చినప్పుడూ (నమః లాంటివి) తప్పకుండా వాడతాం. ఉభయాక్షరాలలో ఏ ఒక్క అక్షరాన్నీ తొలగించ వీలు లేనిది అని గుర్తించాలి. సున్న కొన్నిచోట్ల 'న' తో కొన్నిచోట్ల 'మ' తో పలుకుతాం. కాని ఎక్కడెక్కడ ఎలా పలకాలని అడిగితే చెప్పలేం.

## ఙ, ఞ

లేని అక్షరాల సృష్టి ఇక్కడ జరిగింది. ఇవి హల్లులే కావు. వీటికి స్వయం ప్రతిపత్తి లేదు. గుణింతాలు రావు. (అయినా గుణింతపు పట్టీల్లో గుణింతాలు చూపుతూనే ఉన్నాయి కొన్ని వాచక పుస్తకాలు.) ఒత్తులు అసలే లేవు. ఙ తో తెలుగు భాషలో అత్యధికంగా వాడుకలో ఉన్న పదం వాఙ్మయం. నిజానికి ఈ అక్షరాలతో మొదలయ్యే పదాలు ఏవీ నిఘంటువుల్లో లేవు. కానీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురించిన నిఘంటువులో 'ఙ' విభాగంలో డజను పదాలున్నాయి. అవి ఉన్నాయనే విషయం తెలుగువారిలో చాలా మందికి తెలియదు. ఎవరు, ఎప్పుడు, ఎక్కడ ఉపయోగించారో, ప్రయోగించారో తెలియదు. ఞ అక్షరం జ గుణింతానికి ఒత్తుగా మాత్రమే వస్తుంది. ప్రజ్ఞ, జ్ఞాని, జిజ్ఞాస, రాజ్ఞి వగైరా!



ఈ అక్షరాల్ని తెలుగు భాషాభిమాని సర్ ఛార్లెస్ బ్రౌన్ ప్రవేశపెట్టినట్లు తెలుస్తోంది. హల్లుల్లోని అక్షరాలు 'అ'తో పలుకుతుంటే (క, గ, ప, బ, మ, త, ద, న, ట, డ ణ...) చ జ అనే అక్షరాలు 'య' మిళితమైనట్లు పలుకుతున్నాయి. వాటిని కూడా 'అ'తో పలికించాలనే ఉద్దేశంతో

**ౘ ౙ**

వీటిని ప్రవేశపెట్టి ఉండవచ్చు. అక్షరాల పైన గుర్తులుంచటం ఐరోపా భాషల సంప్రదాయం. తెలుగులో కూడా ఒక అక్షరాన్ని రెండు రకాలుగా పలకటం ఉందనే విషయం ఈ అక్షరాల్ని ప్రవేశపెట్టిన వారికి తెలియకపోవటం ఒక కారణం కావచ్చు. పెటాకులు, తాటాకులు పదాల్లో 'టా' అలా రెండు రకాలుగా పలికేదే. ఎక్కు, త్రాగు, మాట్లాడు, ఉతుకు, కడుగు లాంటి వందలాది క్రియలు భూతకాలంలో రాసేటప్పుడు దీర్ఘంతో రాసినా పలికేటప్పుడు య మిళితం అయినట్లు పలుకుతాం. అందుకే ఈ అక్షరాల అవసరం లేదు. ఫ అక్షరం ఉంది గానీ ఆంగ్లంలోలా ఫుడ్, ఫుట్, ఫ్రాన్స్, ఫుట్‌బాల్‌లలో (యఫ్) అనే అక్షరం లేదు. ఆంగ్ల భాషలో 'క్ష' అక్షరం లేదు. కానీ వాళ్ళు కొత్త అక్షరాల్ని సృష్టించలేదు. ప్రతి సంవత్సరం కొత్త పదాల్ని చేర్చుకోవటం ఒక నిరంతర ప్రక్రియగా కొనసాగుతోంది. మనకెందుకీ భావ దారిద్ర్యం?

**క్ష**

క్ష అనేది ఒక అక్షరం. ఒక హల్లు. కానీ 30, 40 సంవత్సరాల నుంచి ఒక కొత్త వాదం తెరపైకి వచ్చి తీరని నష్టం కలిగిస్తోంది. క ష అక్షరాలు కలిస్తే వచ్చిన సంయుక్తాక్షరంగా చెబుతున్నారు. మనం క్ష అని ఉచ్చరించినప్పుడు క పలకటం లేదు. క్షణ క్షణం పలికి చూడండి. కొన్ని వందల పదాలలో క్ష ప్రయోగం ఉంది. తెలుగులో నిశ్శబ్దాక్షరాలు లేవు. ప్రతి అక్షరమూ పలుకుతుంది. క పలకటం లేదెందుకు? ష ఒత్తుకు అక్షరానికి ఒక రకంగాను ఇతర అక్షరాలకు మరోరకంగా వస్తుందా? ఏ ఒత్తూ రెండు రకాలుగా ఉండదు కదా?! క్ష సంయుక్తాక్షరమైతే ఈ ఒక్క సంయుక్తాక్షరమే హల్లుల పట్టికలో స్థానం ఎలా పొందింది? ఈ ప్రశ్నలకు సమాధానాలు ఎవరైనా సవివరంగా తెలియజేయండి.

**ఱ**

ఈ అక్షరాన్ని తొలగించటం సమంజసమని భావిస్తున్నాను. కారణం 99 శాతం ప్రజలు వాడటం లేదు. అక్షరానికి ప్రత్యామ్నాయం ఉంది. తొలగించటం వల్ల భాషా ప్రయోజనాలకు భంగమూ వాటిల్లడంలేదు. అంతేకాక ఈ అక్షరంతో కొన్ని ఇబ్బందులున్నాయి. చెఱువు, చెఱకు, మఱ్ఱిచెట్టు, బఱ్ఱె తదితర పదాలలో ఱ వస్తే ఎరువు, ఎరుపు, కర్ర లాంటి పదాలలో ర ప్రయోగం ఉంది. ఎక్కడ ఏ అక్షరం రాయాలి? ఎందుకొచ్చిన గొడవ, తీసేస్తే పోలా?

భాషలో కాలానుగుణంగా మార్పులు సహజం. జాతి ఆమోదం, సరైన కారణాలు లేకుండా భాషలో మార్పులు చేయటం అనవసర సమస్యల్ని సృష్టించటమే.



**షేక్ బడే సాహెబ్**
విశ్రాంత తపాలా ఉద్యోగి,
హైదరాబాద్. 98499 21322

## అవతార 'దశ'



మాతృమూర్తి గర్భంలో ఈదుతూ
ఎదిగే మత్స్యం
నీటి నుంచి నేల మీదకు ప్రాకే
బాల్యం ఒక కూర్మం
వయసులోని జంతు ప్రవర్తన ఒక
వరాహం
మృగం నుంచి మనిషిగా మారే దశ
నరసింహం.
మనిషిగా మారినా ఎదగాలని ఎరిగితే
నాడు వామనుడు
ఎదిగినా క్రోధం తగదని తెలిస్తే
వాడు పరశురాముడు
సత్య, ధర్మ, శాంతి ప్రేమలతో తానే
ఒక శ్రీరాముడు
విశ్వమంతా తానే అని విశ్వసిస్తే
నాడు శ్రీకృష్ణుడు
ధ్యానియై, జ్ఞానియై, జన్మ
కారణమెరిగినవాడు ఒక బుద్ధుడు
కర్తవ్య మొనరించి జన్మ
సార్థకతతో కాగలడు కల్కి
భగవానుడు
తెలుసుకుంటే కర్మ యొక్క ప్రతి
దశలోని అంతరం.
మలుచుకుంటే జన్మ ఒక్కటిలోనే మనిషి
దశావతారం.

– వుగ్గిన తారకేశ్వరరావు, సింగపూర్,
+65 90171914

# ప్రాచీన స్మృతుల్లోంచి



బహుశ
నా ప్రాచీన స్మృతుల్లోంచి నన్ను వెన్నంటి వచ్చినట్టుంది
అమ్మకడుపులో ఉండగానే
సుప్తచైతన్యంలోకి జొరబడినట్టుంది
పురిటింటి కేరింతల్లో
బయటపడటానికి ప్రయత్నించి విఫలమైనట్టుంది
చిన్నప్పటి అకారణ అర్థరాత్రి దుఃఖాల్లో అంతర్లీనమైనట్టుంది
నా కురిసిన వానల్లో నా వీచిన గాలుల్లో
నన్ను ముసురుకున్నట్టుంది
నా నడచిన దారుల్లో నా తిరిగిన మలుపుల్లో
నన్ను ఒడిసి పట్టుకున్నట్టుంది
పాట మనిషిని శుద్ధి చేస్తుందన్న కవి సాక్షిగా
అప్పటినుంచీ ఇప్పటిదాకా
నన్ను స్వచ్ఛపరుస్తూనే ఉంది స్వస్థపరుస్తూనే ఉంది
ఎప్పటికప్పుడు బతుకు బాధలకు నేపథ్యసంగీతమవుతూనే ఉంది
లోపలి లోకాల వెలుపలి ప్రపంచాల నడుమ నిలబెట్టి
ఆకాశయానాలు నేర్పుతూనే ఉంది
నాకు తారసపడిన ప్రతీసారి నా వెంట పరుగెత్తుకొచ్చి
నన్ను తన వెంట పరుగులు పెట్టించుకుంటూనే ఉంది
ఎప్పుడొచ్చినా నిలిచిపోయిన ప్రకృతి మధ్య పరవళ్లు తొక్కే
ఏకాంతఝరిలా ప్రవేశిస్తుంది
ఎత్తుల కెగరేయడం
లోతుల్లో పడవేయడం దాని నైజం కాబట్టి
ఆకుపచ్చని అడవి సముద్రంలో
పడిలేచి స్తంభించిన మహా కెరటాల్లాంటి
లోయల్లోకి శిఖరాల మీదకు విసిరేస్తుంది
ముట్టడించినపుడల్లా
నన్నొక చిన్నగదిలోకి నెట్టి గోడలకేసి విసిరిసిరి కొడుతుంది
తుపానులా జొరబడి సుడిగుళ్లు తిప్పి
ఉప్పెన అలలా పైకి లేపి
అమాంతం జలపాతంగా విరిగిపడి
లోపలి నేలల్ని చిత్తడి చేస్తుంది
కాల్లో దిగిన తుమ్మముల్లు బయటికి రాకుండా సెలవేసినట్టుగా
లోలోపలే ఉండిపోయి నిరంతర సలపరంగా మారింది
కరెంటు వైరులో దాగి సాగిన రాగిలా
తీగలుతీగలుగా సాగి నన్నొక విద్యుత్‌వాహకంగా మార్చింది
నిజానికది నా ఉదయాస్తమయాలను
రసమయమూ రాగరంజితమూ చేసింది
నా చీకటి వేళల చితులు పేర్చి చింతన నేర్పింది
నా పగళ్లని ధగద్ధగాయమూ దందహ్యమానమూ చేసింది
ఉపశమనంలోని హాయిని అనుభవించడం కోసం
నేనే సృష్టించుకున్న బాధ అది
మళ్లీ మళ్లీ గుర్తుచేసుకుని
మళ్లీ మళ్లీ విలుచుకున్నపుడల్లా
నా నొప్పి అదే నా నివారణ అదే
పెళ్లలు పెళ్లలుగా కరడుగట్టిన క్లేశాన్ని
మంచులా కరిగించి
దుఃఖరసాన్ని వొళ్లంతా ప్రవహింపచేసినప్పుడు
నా వేదన అదే నా సాంత్వన అదే
పెను విషాదాల వినోదాల ఎగుడుదిగుడుల్ని
రాగమయమూ
ద్వేషమయమూ చేసినప్పుడు
నా ఆరోహణ అదే నా అవరోహణ అదే
ముగిసిన ప్రతీసారి
ఆనంద శిఖరం మీద ఉదయించిన
ధవళకాంతుల తారళ్యం
లోపలంతా పరుచుకున్నప్పుడు
అదే నా మృత్యువు అదే నా జననం

(నేను చిన్నప్పట్నుంచి ఇప్పటిదాకా ఇష్టపడి పాడుకుంటున్న పాటలన్నీ శివరంజని రాగంలో ఉన్నాయని తెలుసుకుని)




**కొప్పర్తి** వెంకటరమణమూర్తి.
ప్రధానాచార్యులు, ప్రభుత్వ డిగ్రీ కళాశాల,
ఏలూరు, పశ్చిమగోదావరి. 98495 25765



# తెలుగుకు వెలుగు తెచ్చిన ఆంగ్లేయుడు

ఉద్యోగరీత్యా భారతదేశానికి వచ్చిన ఆంగ్లేయులలో కొందరు తమ అధికార బాధ్యతలను సమర్థవంతంగా నిర్వహించేందుకు స్థానిక భారతీయ భాషలను నేర్చుకున్నారు. అలా నేర్చుకుని దక్షిణాదిన భాషాభివృద్ధికి దోహదం చేసినవారిలో అగ్రగణ్యుడు చార్లెస్ ఫిలిప్‌బ్రౌన్. ఆయన తెలుగుభాషను మేటిగా ఎంచుకున్నాడు. ఈస్టిండియా కంపెనీ భారతదేశంలో పనిచేసే ఉద్యోగులకు భారతీయ భాషలను పరిచయం చేసేందుకు ఇంగ్లండ్‌లో హెయిల్‌బరీ కళాశాల ప్రారంభించింది. అక్కడ రెండేళ్లు శిక్షణ పొందిన బ్రౌన్ కంపెనీలో అతి చిన్న ఉద్యోగిగా మద్రాసు రాష్ట్రానికి వచ్చాడు. దక్షిణాది భాషలు ఆంగ్లేయ అధికారులకు బోధించేందుకు ఫోర్ట్‌సెయింట్ జార్జ్ కళాశాల మద్రాసులో ఏర్పాటయింది. బ్రౌన్ అక్కడ తెలుగు నేర్చుకున్నాడు. భాష మీద మమకారం పెంచుకున్నాడు. పద్యంగానీ, గద్యంగానీ అందులోని భావానికి సమ్మోహితుడయ్యాడు.

తాను తెలుగు నేర్చుకోవటంలో పడిన ఇబ్బందుల దృష్ట్యా అందరికీ అందుబాటులో ఉండేట్టు ఛందస్సు, వ్యాకరణ పుస్తకాలతోపాటు అనేక నిఘంటువులు రూపొందించాడు. ఇవి కొత్తగా భాష నేర్చుకునేవారి కోసం, కళాశాలలోని విదేశీ విద్యార్థుల ఉపయోగం కోసం ఉద్దేశించాడు. ఎన్నో విలువైన గ్రంథాలు ముద్రింపజేశాడు. తన దగ్గర పనిచేస్తున్న పండితులను గౌరవపూర్వకంగా ఆదరించి వారి సహాయంతో తెలుగు గ్రంథ వికాసానికి తోడ్పడ్డాడు. పుస్తక ముద్రణ ప్రచారంలోలేని కాలంలో విలువైన అముద్రిత గ్రంథాలెన్నింటికో శుద్ధ ప్రతులను సిద్ధం చేయించి ముద్రింపించాడు. పుస్తకాల పనిని తాను స్వయంగా పర్యవేక్షించాడు. పుస్తకాలు అయిష్టంగా ఇచ్చేవారి వద్ద కొన్ని రాతప్రతులను, అయిష్టంగానయినా అమ్మేవారి వద్ద కొన్ని పుస్తకాలు కొని సంపాదించాడు. తన సంపాదనలో కొంత భాగాన్ని పుస్తకాల కొనుగోలుకు వినియోగించాడు.

శుద్ధప్రతిని తయారు చేయించేందుకు ఒక పద్ధతిని అవలంబించేవాడు. దొరికిన అయిదారు ప్రతులు ముందుంచుకుని పండితులు కూర్చునేవారు. ప్రతి ఒక్కరు తమ ఎదుటగల ప్రతిలోని ఒక పద్యపాదాన్ని చదవగా మిగిలినవారు తమ ఎదుటగల ప్రతిలోని తేడాను వివరించేవారు. అందరూ అంగీకరించిన పదాన్నో, పాదాన్నో సవరించిన రూపంలో రాయసాగారు. ఈ శుద్ధప్రతిని బ్రౌన్ సరిచూసిన తర్వాత అచ్చుకు పంపేవారు. ఈ విధంగా వేమన శతకమేగాక సుమతీ శతకము కూడా అచ్చయ్యాయి. 1829లో వేమన పద్యాలు బ్రౌన్ రాసిన ఆంగ్ల అనువాదంతో అచ్చయ్యాయి. వేమన భావాలు కొన్ని బ్రాహ్మణులకు సమ్మతి కానందున వాటిని తొలగించి 1839లో రెండోసారి వేమన పద్యాలు అచ్చయ్యాయి. మొదట్లో 693 పద్యాలుంటే ఆ తర్వాత ఎందరో ఎన్నో పద్యాలను చేర్చారు.

తన వద్ద పని చేసినవారు, పనిమీద తన వద్దకు వచ్చినవారు ఇలా పండిత పామరులందరూ ఆయనకు తెలుగు నేర్పిన గురువులే. అవసరమైనంత మేరకు పర్షియన్, అరబ్బీ భాషలు నేర్చుకున్నా, తెలుగు భాష మీద అభిలాష పెరిగింది. వాడుక భాషలలో 'తెలుగు లెస్స' అని విశ్వసించాడాయన. అదివరకున్న ఉన్నతాధికారులు తెలుగులో వ్యవహారాలు నడపగలగటం కూడా బ్రౌన్‌ను ప్రోత్సహించింది. అప్పటి రాష్ట్ర గవర్నరు సర్ థామస్ మన్రో స్థానికంగా వాడుకలో ఉన్న భాషను నేర్చుకోవలసిందిగా ఉద్యోగులను ఉద్బోధించాడు. మత గురువయిన 'దుబె' తన పరిశీలన ఫలితంగా హిందువుల అలవాట్లు సంప్రదాయాల గురించి రాసిన పుస్తకం బ్రౌన్ దృష్టిని ఆకర్షించింది. తెలుగు నేర్వడమేగాక భాషా సంపదను అందరికీ పంచాలనే అభిలాష బలపడింది.

బ్రౌన్‌ను మొదట వేమన పద్యాలు ఆకర్షించాయి. అందులోని భాష సరళం. చదువురాని అతిసామాన్యులకు కూడా అందులోని భావాలు సులభగ్రాహ్యం. అచ్చు పుస్తకాలు అరుదయిన కాలంలో సాధారణ పాఠశాలల్లో వేమన పద్యాల రాతప్రతులను వాడేవారు. ఆ ప్రతులలో కొన్ని పదాలు, పాదాలు తేడాగా ఉండేవి. అందువలన పుస్తకానికి శుద్ధప్రతిని తయారు చేయించాడు.

వేమన పద్యాలలాగానే మరెన్నో ప్రముఖ గ్రంథాలకు కూడా శుద్ధప్రతులు తయారు



బ్రౌన్ దృష్టిని తప్పించుకోలేదు. వాటి మొదటి కాగితం మీద ఆ గ్రంథాన్ని గురించి, దాని భాషా విలువను గురించి ఒక పదమో, వాక్యమో రాసి, బ్రౌన్ సంతకం చేసి ఉన్నాడు. దానిని బ్రౌన్ సేకరణ అంటున్నారు. కొన్ని కైఫీయత్తులు కాలిన్ మెకంజీ సేకరించినందున మెకంజీ సేకరణగా కూడా దానిని గుర్తిస్తున్నారు.

బ్రౌన్ కూర్చిన వాటిలో ఆయన నిఘంటువులు చాలా ప్రాచుర్యం పొందాయి. తెలుగు-ఇంగ్లిషు, ఇంగ్లిషు-తెలుగు నిఘంటువులలో ఆ పదం ఎలా వాడబడిందో చూపే ఉదాహరణ వాక్యాలను ఇతర గ్రంథాల నుంచి ఉటంకించారు. తెలుగు నుంచి కాక ఇతర భాషల నుంచి గ్రహించిన పదజాలంతో మిశ్ర భాషా నిఘంటువును, రెవెన్యూ పదజాల నిఘంటువును కూడా రూపొందించారు. తెలుగు వాక్యావళి, సామెతలు సంకలనం చేసి పాఠ్యపుస్తకాలుగా సమకూర్చారు.

బ్రౌన్ సాహిత్య సేవ ధనాపేక్షతో చేయలేదు. స్వంతంగా కావ్యరచనకు పూనుకోలేదు. గురించి పట్టించుకునేవారు అనేకులున్నారన్న స్పృహతో తెలుగు భాషను మాతృభాష కన్న ఎక్కువ ఆదరించి దాని సుందర సాహిత్యాన్ని ఆంగ్లేయులకు పరిచయం చేయటమే గాక, తెలుగు భాషను, అమూల్య గ్రంథాలను భావి తరాలకందించేందుకు అవిరళ కృషిని అవిశ్రాంతంగా జరిపాడు. పదవీ విరమణ తర్వాత ఇంగ్లండ్‌కు వెళ్లినా అక్కడి తెలుగు పుస్తకాల కేటలాగు తయారు చేయడంలో నిమగ్నుడయ్యాడు. స్వదేశం నుంచి వెంట తెచ్చుకున్న గ్రంథాలను ఇండియాలో ఏ గ్రంథాలయానికో దానం చేసి వెళ్లిన అధికారులెందరో ఉన్నారు. అయితే తాను ఉద్యోగ రీత్యా వచ్చిన దేశంలో సేకరించిన పుస్తకాలతో స్వంత గ్రంథాలయాన్ని ఏర్పాటు చేసుకుని, వాటిని భద్రపరిచేందుకు తాను నివసించిన బంగళానే అర్పించిన బ్రౌన్ చిరస్మరణీయుడు. ఆయన స్మారక భవనం ఇప్పటికీ గ్రంథాలయంగానే ఉన్నది కడపలో.

బ్రౌన్ అధికారులతోగాక, ఇతరులతో, అతిసామాన్యులతో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలు పద

కాలమేఘాళి క్రమ్ము సంఘటన కతన
తెలుగు సాహిత్య సంపద వెలుగు లేక
జీర్ణ దుస్థితి మ్రగ్గి సంపూర్ణముగ న
దృశ్యమగు భయమొకటి నర్తించువేళ
ఆంధ్రసాహిత్యమమృతమే ఆయెననగ -
ఒక్కడే యాతడొక్కడే ఒక్క బ్రౌనె
ఒక సవాలక్ష మందిగ నుద్ధరించె

- బ్రౌను ఉదాహరణ కావ్యం నుంచి...



చేయించి, వాటన్నిటినీ అచ్చు వేయించి తెలుగు వాఙ్మయాన్ని కాపాడాడు. మనుచరిత్ర, వసుచరిత్ర, పోతన భాగవతం, నల చరిత్ర, హరిశ్చంద్రోపాఖ్యానము, ఆముక్తమాల్యద, సారంగధర చరిత్రము, దశావతార చరిత్ర అటువంటివే. గ్రంథాల్లో కొన్నిటిని ఆంగ్లంలోకి అనువదించి ఇతర ఆంగ్లేయులకు తెలుగు రచనలలోని భావ ఔన్నత్యాన్ని పరిచయం చేశాడు.

తాళపత్ర గ్రంథాల రాతప్రతులు, రాతప్రతుల నుంచి ముద్రిత ప్రతులు తయారు చేయించడం ఆయన సంకల్పం. అచ్చు వేసే గ్రంథం వివిధ ప్రతులను వివిధ ప్రాంతాల నుంచి రాబట్టడం ఆయన లక్ష్యం. ప్రామాణికతకై పండిత బృందం సలహాలు తీసుకోవడం ఆయన నైజం.

మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో తెలుగు సంపుటాలు కొన్ని భాగాలున్నాయి (వాల్యూములు). అందులోని గ్రంథాలు ఉపయుక్తమయిన రీడర్లు, ఛందస్సు, వ్యాకరణం, నిఘంటువులు రూపొందించేవరకు స్వంత రచనలు పరిమితమయ్యాయి. తెలుగు మీద అభిమానంతో స్వార్జనను, విరామసమయాన్ని వినియోగించాడేగానీ, ఉద్యోగ రీత్యా పనికి ఏ మాత్రం భంగం కలుగనీయలేదు. ఆనాటి కథలు, పురాణాలే గాక, ఇతరులు తనకు రాసిన జాబులు కూడా బ్రౌన్‌కు విలువయినవే. ఉబుసుపోక, తాతాచార్యులు చెప్పిన కథలలోని చారిత్రకాంశాల పట్ల ఆకర్షితులై వాటిని సేకరించాడు. ఇతరులు రాసిన జాబులను అలక్ష్యం చేయకుండా వాటిని ఎత్తి మరో గ్రంథంలాగ నమోదు చేయించాడు. వాటిని కార్యాలయ కాగితాలుగా పరిగణిస్తూ ఫైల్స్‌లో ఉంచలేదు. వాటిని వ్యక్తిగతపత్రాలు గానే పరిగణించి విలువనిచ్చాడు. మున్ముందు అవి చరిత్రలో భాగమవుతాయని కూడా ఊహించి ఉండకపోవచ్చు. మాతృభాష అయిన ఆంగ్లం కొండు సంపుటాలున్నాయి. ఆ ఉత్తరాలను బట్టి ఆనాటి ప్రజల జీవన విధానం, ఆచార వ్యవహారాలు, ఎంత స్వేచ్ఛతో ప్రజలు తమ ఇబ్బందులను అధికారులకు విన్నవించుకునేవారో తేటతెల్లమవుతుంది. భాషా పరిశోధకులు ఎన్నో విషయాలను వెలుగులోకి తెచ్చేందుకు కేవలం అచ్చు పుస్తకాల మీద ఆధారపడకుండా ఉండాలంటే కావలసినంత ముడిసరుకు దేశంలోనే ఢిల్లీలోని ఆర్కైవ్స్‌లో, మద్రాసు, కలకత్తా, పాండిచ్చేరిలలో లభ్యమవుతుందంటే ఆశ్చర్యపడనవసరం లేదు.





**జోలెపాళ్యెం మంగమ్మ**
ఆకాశవాణి విశ్రాంత ప్రయోక్త, పరిశోధకురాలు, చిత్తూరు

# టీపాయికి పువ్వందం
# పాపాయికి నవ్వందం



తేట తెలుగు మాటలతో తేనెల ఊటలందించిన సహజకవి 'కరుణశ్రీ'. తెనుగుదనము వంటి తియ్యందనము లేదు, తెనుగు కవుల వంటి ఘనులు లేరని చాటిన జన హృదయాస్థాన కవిశ్రీ ఆయన. ఖండ కావ్యాలు, వచనకృతులతో పాటు పద్యాలు, పాటలు, గేయాలు, కవితలు, రూపకాలు, నాటికలు, నాటకాలు, నవలికలు, సమీక్షలు, వ్యాసాలు, వ్యాఖ్యానాలు, వాచకాలు, ఉప వాచకాలు.. ఎన్నెన్నో రచనలు. వాటన్నిటినీ మించి ఆ రోజుల్లోనే లక్షా పాతిక వేల ప్రతుల ముద్రణ పొందిన 'తెలుగు బాల' శతకంతో చిరయశస్వి అయ్యారు. 'బాల బాలికలం వసివాడని పూల మాలికలం ప్రగతి పథంలో పురోగమించే భారత భూమికి ఏలికలం' అంటూ పసిమనసుల్ని ఆవిష్కరించిన ఆ సారస్వత తపస్వి శతజయంతి వసంతం ఇది. పిల్లలకు యాభై పుస్తకాలు సహా డెబ్భయ్ ఐదు పైగా భాషా సాహిత్య గ్రంథాలూ, శతాధిక లలిత మధుర ప్రసంగ ధారలతో ప్రత్యేక ముద్ర వేశారు. జంధ్యాల పాపయ్యశాస్త్రి . ఆయనో భావలోక విహారి, ఆయనదో భవ్య కవితా స్వర ఝురి.

బాలల మనోభావం జాతికి జయ జయారావం, వారి దరహాసం సరస్వతీసముల్లాసం. ఆ ఊహలే విశ్వ కల్యాణానికి పందిళ్లు కప్పుతాయనీ జాతీయ వికాసానికి పూల దోసిళ్లు ఎత్తుతాయనీ కరుణశ్రీ విశ్వాసం. పదహారేళ్ల వయసులో తొలి కవిత, పద్దెనిమిదో ఏట తొలిశతకం రాసిన ఆ కవి కావ్యాలన్నీ 'కలువలు పూచినట్లు చిరుగాలులు చల్లగ వీచినట్లు పసిపాపలు చేతులు సాచినట్లు' ప్రసన్న రమణీయాలుగా సాగాయి. మళ్లీ మళ్లీ స్మరణీయాలుగా మారాయి. పలు పురాణాలు, ఉపనిషత్తులు, నీతి చరిత్రల నేపథ్యంతో వెలువడిన 'కథా గాయత్రి' పన్నెండు సంపుటాల పేర్ల చివర 'భారతి' ఉండటం భారతీయతకు సూచిక. అవి వీర, విశ్వ, భవ్య, ఆర్ష, ఆదర్శ, ప్రతిభా, వినోద, దళిత, చమత్కా, ఉపదేశ, పురాణ, కల్యాణ, భారతులు ('కల్యాణభారతి' గుంటూరులోని ఆయన నివాస గృహం పేరు కూడా). 'కల్యాణ దంపతుల'తో పాటే 'మందార' అందాలు 'ఇంద్ర ధనుస్సు' చందాలు, 'బాల భారతి' సొగసులు, 'పూజా పుష్పాలు', 'గురు దక్షిణ'లు, 'మహతి' నాదాలు.. మరెన్నో పుస్తక పరంపరలు వీటిల్లోనే 'చందమామలో కుందేలు'ంది, 'సింహం మెచ్చిన చిట్టెలుక' ఉంది, 'బంగారు ముంగిస' సైతం ఉంది. 'ఆదికవి వాల్మీకి', 'త్యాగమూర్తి', 'శైలజ'లే కాక 'నలుగురు మిత్రులు'న్నారు. 'మత్స్యయంత్ర'మూ ఉంది అందులో.

**కమనీయ గుబాళింపు రమణీయ పొహళింపు**

మధుర మంజుల మోహన ముగ్ధ శైలికి పేరొందిన 'పోతన' గురించిన ఆయన కథాకథనం తీరే వేరు. ఎత్తుగడ నుంచే సహజ సిద్ధత, అక్షర రమ్యత, సంభాషణా చతురత పరమళిస్తుంటుంది.

ఓ ఉదాహరణ: "నాన్నా! నాన్నా! నాకు కవిత్వం రాయడం నేర్పవా నాన్నా? ఎప్పుడు అడిగినా ఇప్పుడు కాదంటావు. ఇక నేను ఊరుకోను. నీలాగా నేర్చుకొని గొప్ప కావ్యం రాయాలి నేను! ముట్టుకుంటే మాసిపోయే మాటలూ పట్టుకుంటే కందిపోయే భావాలూ ఇందులో

కన్పించడం లేదూ? ఎంతో లాలిత్యం, శైలీ విన్యాసం, శిల్ప నైపుణ్యం, వస్తు వైవిధ్యం ఉన్నాయి బాల సాహిత్య రచనల్లో. దమయంతి, వసంతసేన, ప్రేమమూర్తి, మహావీరుడు, భగీరథుడు.. జీవిత చరిత్రలైతే; 'ఉదయ భారతి' 'శ్రీనివాస'లు వాచకాలు. బడిపిల్లల కోసం రూపొందించిన వాచక రచనలూ అనేకం.

నాటికలూ నాటకాల్లో విశేషంగా చెప్పుకోవాల్సినవి కరుణామయి, శకుంతల, బంగారు పద్మం. ఇతర వచన కృతుల్లో భారత ప్రతిభ, తెలుగు సీమ ప్రశస్తాలు. నవలికల్లో అహింసా జ్యోతి, అదృష్టమిచ్చిన అద్భుత దీపం... గణనీయాలు. వెయ్యేండ్ల తెలుగు తోట శీర్షికన వెలువరించిన సాహిత్య వ్యాసమూ విలక్షణమే.

పెద్ద బాలశిక్షకు దీటుగానా అన్నట్లు బొమ్మలతో వచ్చింది 'ముద్దు బాలశిక్ష'. బాలల్ని వికాసవంతులుగా చేసే సూక్తులూ సుభాషితాలూ ఇందులో పుష్కలం.

పాపాయికి నవ్వందం టీపాయికి పువ్వందం
చెల్లాయికి అరవిచ్చిన మల్లెలన్న ఆనందం
సరోవరానికి విరిసే అరవిందం అందం
ధరాధరానికి కురిసే ధారాధరమందం
సేద్యానికి మడి అందం - పద్యానికి వడి అందం
బాలబాలికలకు ముద్దుబాలశిక్ష ఆనందం

పూలవానలు - తేనెసోనలు, ప్రసన్న కథా విపంచి వంటి వ్యాఖ్యానాలూ ఆయన కలం నుంచి వెలువడ్డాయి. తీయతీయని తెలుగు వాణి, ఒకే కంఠం, అరుణ కిరణాలు, అనురాగ లహరి.. ఇందులోనివే.

**లలిత సుగుణజాల తెలుగుబాల**

ఈ శతకంలోని శబ్దాల్లో కొన్ని కుసుమ సుకుమారాలు, ఇంకొన్ని వజ్ర కఠోరాలు. తరంగాల్లా పైకి లేచేవి కొన్నయితే, కురంగాల్లా ముందుకు దూకేవి మరిన్ని. కిలకిల నవ్వులూ తళతళ మెరుపులూ మిసమిసలూ గుసగుసలూ లెక్కలేనన్ని. గోరువెచ్చని పాల మీగడలా, అపుడేవిచ్చుకున్న గులాబీ మొగ్గలా ఇంకెన్నెన్నో పద ప్రయోగాలు.

కష్టపెట్టబోకు కన్నతల్లి మనస్సు
నష్టపెట్టబోకు నాన్న పనులు
తల్లిదండ్రులన్న దైవ సన్నిభులురా

అంటూ తెలుగుబాలలకు తాతయ్యలా సుద్దులు చెప్పారాయన.

జనని, జన్మభూమి, జనకుండు, జాతీయ
కేతనంబు, జాహ్నవీ తటంబు
పరమ పావనముల్ పంచ జకారముల్

అని చెబుతూ హితబోధకులూ అయ్యారు. తల్లి భాష గొప్పతనాన్ని చాటుతూ...

'అమ్మ' అనిన బూజు, 'మమ్మీ' యనుటె మోజు
'డాడీ' స్వీటు, 'నాన్న' తగని మోటు
తరిగె మానసమ్ము, పెరిగె మస్తిష్కము

అంటూనే చెణుకులూ చురకలూ అంటించారు. 'నీతి లేని చదువు జీతాల చేట'ంటూనే, మంకు బుద్ధి, విసుగు.. సహజ గుణములివ్వి చవట విద్యార్థికని మరింత చురుక్కుమనిపించారు.

'అయ్యవారన్న మాట వెయ్యారు వరాల మూట/ ఆచార్యుల సన్నిధి విద్యార్థుల కందరకు పెన్నిధ'ని వీనసొంపైన పదజాలంతో హితవు పలికారాయన.

**దివ్య దీపావళి నవ్య శోభావళి**

కరుణశ్రీ సాహిత్యం ఆత్మీయం, సంగీతం అంతరంగం. అందరూ మెచ్చేలా అందరికి వర్తించేలా అన్ని కాలాలకీ సరిపడేలా రాయడంతో మధురాతి మధుర ధ్వనులు వినిపిస్తాయి. రమ్యాతిరమ్య దృశ్యాలు కనిపిస్తాయి. ఆ మదిలోని మార్దవం, ఆ మాటల్లోని సున్నితత్వం రచనల్లోనూ ప్రతిఫలించింది. అదే ఆయన్ని పాత కొత్తలకవితా రీతులకు వారధిగా నిలిపింది. భావనల్ని వెల్లడించేవే భాష, సాహిత్యం. సఖ్యత, సభ్యత, సంస్కృతి, నాగరికత, విశిష్టత, ప్రత్యేకత.. అన్నీ ప్రతిబింబించేది వాటిల్లోనే కదా!

సత్యం నా సాహిత్యం
సౌభ్రాత్రం నా మిత్రం
సౌశీల్యం నా జీవం
స్వాతంత్ర్యం నా దైవం

అనడమే ఆ కవివర్యుని రచనా సౌరభం. భరత మాతను కల్యాణగీతగా విశ్వవిఖ్యాతగా కరుణా సమేతగా ధర్మసముపేతగా స్తుతించారు. సదా తెల్లని పంచె, లాల్చీ, భుజంమీద శాలువాతో రసరమ్య మూర్తిలా నిలిచిన ఆయనకు కవితా స్వారాట్టు నన్నయభట్టు, గుణసాంద్ర కవిచంద్ర శ్రీనాథుడు వంటి మాననీయులందరూ ఆరాధ్యులే.

వెలిగింపవె వెలిగింపవె వీరబాల దీపమాల... యుగయుగాల చైతన్యం జగజగాల వెలిగింపవె... అంటూ శుభగీతిక ఆలపించారు. 'మాతృదేశ సేవ మానవత్వపు త్రోవ' అని సందేశ లహరినీ అందించారు. 'విజయం నీదే విశ్వసింపర స్వజాతి ధర్మమును సంరక్షింపర/ అజేయమౌ మన భారతజాతీ ప్రజాస్వామ్యమున కాశాజ్యోతి' అనడమూ ఆయన అనురక్తికి ప్రతీక.

'సంక్షిప్తంగా మనోహరంగా చెప్పడం ఒక కళ అయితే తేటగా సూటిగా రాయడమన్నది ఒక శాస్త్రం' అన్నారు విద్వాన్ విశ్వం. ఆ రాత, ఆ మాట కరుణశ్రీలో ఒకటైనందునే ఆయన 'ఉదయశ్రీ' మొదటి భాగం యాభై ముద్రణలతో స్వర్ణోత్సవం చేసుకుంది. రెండో భాగంతో పాటు కరుణశ్రీ, విజయశ్రీలు చెరో పాతిక పైగా ప్రచురణలందుకుని రజతోత్సవాలు చేసుకున్నాయి. బాలల కోసం ఆయన రాసిన పుస్తకాలన్నీ వరస సంపుటాలుగా వెలువడటమంటే... తెలుగు అభ్యుదయ భారతికి పాఠకలోకమంతా అభినవ ఆరతి పట్టడమే..

**జోడు**



మధునాపంతుల వారి అబ్బాయి మధునామూర్తికి పెళ్లయిన తొలి రోజులవి. మధునామూర్తి సినిమాకు వెళ్లడానికి సిద్ధమయ్యారు జంటగా. కాలి జోడు కనిపించక అటూ ఇటూ చూస్తున్నారు. "ఏమిట్రా, దేనికోసం వెతుకుతున్నావ్?" అని శాస్త్రి గారు అడిగారు. "జోడు కోసం" అని సమాధానం చెప్పాడు కొడుకు. "అదేమిటీ, నీ పక్కనే జోడు ఉంది కదా." అని కొత్త పెళ్లికూతుర్ని చూపించారు మధునాపంతుల వారు!





**శరత్‌బాబు**
సీనియర్ ఉప సంపాదకులు, చతుర విపుల సాహితీ మాస పత్రికలు. 80081 23603

# కదిలే బొమ్మా కబుర్లు చెప్పమ్మా...!



ఓ పెద్ద... కొండ కదిలి మనతో కబుర్లు చెబుతూ ఉంటే, చెట్లు, పుట్టలు మనతో చెలిమి చేస్తామని చేయి చాస్తే, పక్షులు, చేపలు, మానవ భాషలో మనతో మాట్లాడేస్తుంటే... కలలోనో కథలోనో జరుగుతాయి అనుకుంటాం. కానీ కథలు, కలలు కదిలే బొమ్మలయి కళ్ళముందు కదలటమే యానిమేషన్. అయితే అవి మనదైన తెలుగులో మన టీవీల్లో, కంప్యూటర్లలో చేరిపోవటం మన పిల్లలకే కాక మనకూ ఆనందాన్నిచ్చే అంశమే. నిన్న మొన్నటి వరకూ ఆంగ్లభాష నుంచి అనువాదమై వచ్చి పిల్లల్ని అలరించేవి. కానీ ఆ కట్టూ, బొట్టులో ఇది మనది కాదన్న భావన మనకు కలిగేది. కాని ఇప్పుడు కట్టులోనూ, బొట్టులోనూ మనదేశీయ వాసనలతో మన ఇంటి కథలతో అందంగా ముస్తాబై ఆహ్లాదపరుస్తున్నాయి. వినోదాన్ని, విజ్ఞానాన్ని కాక తెలుగు భాషలోని కమ్మదనాన్ని రుచి చూపిస్తున్నాయి. పిల్లలకు ఆసక్తి కలిగిస్తూనే భాషని ఎంతో కొంత నేర్చుకునేలా చేస్తున్నాయి. తెలుగు కథలు, తెలుగుపాటలు, తెలుగులోగిళ్ళు, తెలుగు ముఖాలతో తెలుగులోని వెలుగును ప్రసరింపజేస్తున్నాయి.









మనం మరచిపోయిన మన సంస్కృతి, ఆటపాటల వంటివి సేకరించి మన పిల్లలకు ఈ యానిమేషన్ రూపంలో తేటతెలుగులో అందించటం అంటే నిన్నటి తరం బాల్యసౌందర్యాన్ని రేపటి తరం బాల్యానికి అందించటమే అవుతుంది. కదిలే బొమ్మల కబుర్లతో కమనీయమైన కథలతో పిల్లల ముందు ఓ పాత ప్రపంచాన్ని కొత్తగా ఆవిష్కరించినట్లు అవుతుంది. ఇదికేవలం పిల్లలకే కాక పెద్దవారిని సైతం కట్టిపడేస్తుంది.

చిన్ననాటి స్మృతుల్ని జ్ఞప్తికి తెచ్చేలా ఆపాత మధురమైన కథలని మరోసారి చూసి ఆనందించేలా ఉంటున్నాయి. నిజానికి కథను కథలా చెప్పటం ఒక కళ, అయితే దాన్ని బొమ్మల రూపంలో చూపించటం ఇంకా అద్భుతం. ఇప్పటికే పోగో, నిక్, డిస్నీవరల్డ్, కార్టూన్ నెట్‌వర్క్, జెటిక్స్ వంటి పిల్లల ఛానల్స్ అన్నీ అద్భుతాలు చూపించటంలో ముందున్నాయి. అయితే అవన్నీ మన వాతావరణానికి తగినట్లుగా లేకపోవటం ఒక్కటే మన పిల్లలకు లోపం. దాన్ని పూడుస్తూ తెలుగు యానిమేషన్ల పరంపర మొదలయ్యింది. డబ్బింగ్ గొంతులు, దూరరూపాలతో విసుగు పుట్టిన పిల్లకు మనవైన వేషభాషలతో తయారవుతున్న ఈ సీడీలు కొత్త ఉత్సాహాన్నిస్తున్నాయి. ఎప్పుడూ యానిమేషన్ పిల్లల్ని మాత్రమే దృష్టిలో పెట్టుకొని తయారు చేస్తున్నా అవి పెద్దవారికీ ఆనందాన్ని కలిగించేలా రూపొందించటం అవసరం. (చందమామ వంటి పిల్లల పత్రికల్ని పిల్లలతో సమానంగా పెద్దవారు చదివేవారు)

ఇక మొదటిసారి పూర్తి తెలుగులో వచ్చిన యానిమేషన్ చిత్రం 'కిట్టుగాడు' ఇందులో ప్రామాణికాలు పెద్దగా పాటించనప్పటికీ, నాణ్యతాపరమయిన లోపాలున్నప్పటికీ తెలుగులో వచ్చిన మొదటి యానిమేషన్ చిత్రంగా మనకు గుర్తుండిపోతుంది. పిల్లలు చేసే అల్లరికి అమ్మల బుజ్జగింపులు ఉంటాయి. అట్లాంటి అల్లరి పిల్ల



లను బుద్ధిగా కూర్చోబెట్టే బుజ్జగింపుల పనిని ఇప్పుడు యానిమేషన్ చిత్రాలు చేస్తున్నాయంటే అతిశయోక్తి కాదు. మనం చిన్నప్పుడు విన్న, చదివిన కథల్ని పుస్తకంగా వేస్తే చదివేంత సమయం ఇప్పటి పిల్లలకు లేకపోవచ్చు. అవే కథల్ని యానిమేషన్‌గా చేస్తే వద్దన్నా చూస్తారు. ఆవిధంగా అలనాటి అందమైన కథలు మళ్లీ ఓసారి పెద్దవారూ తలచుకోవచ్చు. చిన్నపిల్లలకూ ఆ అనుభూతులను పంచినట్లుంది. దీని వలన పెద్దపెద్ద ప్రయోజనాలు ఉండకపోవచ్చు కాని ఎంతోకొంత ఆనాటి సృజనాత్మక జీవితాలను అవగాహన చేసుకొనే వీలు కాస్తయినా ఉంటుంది. అప్పటి పాత్రల ద్వారా అప్పటి మనుషుల ప్రవర్తన, వ్యవహార శైలి, తెలివితేటలస్థాయి, మాట్లాడేతీరు, కొంత తెలియడం వల్ల మంచి చెడుల మధ్య ఉండే ఓ సన్నని గీతని అర్థం చేసుకోవచ్చు. చిన్ననాటి చిట్టిగీతాలు, పేదరాసి పెద్దమ్మ కథలు, చిన్నారిబాలశిక్ష పేర్లతో విడుదలయిన యానిమేషన్ చిత్రాలు పిల్లలను అమితంగా ఆకర్షిస్తూ ఆనందింపచేస్తున్నాయి. చెమ్మచెక్క చేరడేసిమొగ్గ, అష్టాచెమ్మ, పులీమేక, కోతికొమ్మచ్చి వంటి పాత ఆటలు గేయరూపాల్లో యానిమేషన్ బొమ్మల్లో చెప్పగలగడం ఆ ఆటలకు పునరుజ్జీవనం ఇవ్వటమే.

అమ్మమ్మ, తాతయ్య, పెద్దమ్మ, చిన్నమ్మ వంటి పదాలనే మర్చిపోతున్న మన పిల్లలకు పేదరాసి పెద్దమ్మ రూపంలో ఓ ముసలి అవ్వ 'ఒరేయ్ పిల్లలూ మీ అందరికీ ఓ కథను చెబుతాను. బుద్ధిగా కూర్చొని వినండ్రా, అనగనగా...' అంటూ పిల్లల్ని మెల్లగా కథల్లోకి లాక్కెళ్లే తీరు ఎవరికయినా నచ్చితీరుతుంది. ఇక మధురమైన మన మాతృభాషలో వింటుంటే మన అమ్మమ్మే ముందుకూర్చుని కథ చెబుతున్న అనుభూతి కలగడం సహజం. అట్లాగే వేమన, సుమతీ, అన్నమాచార్యవంటివారు పద్యాలు పాటలయి ప్రవహించటం చెవులకింపైన రీతిలో వాటిని ఆలపించటం పిల్లలు పాడుకోవడానికి, నేర్చుకోవడానికి కూడా అవకాశం కలిగించినట్లవుతుంది.

'చందమామ రావే/జాబిల్లిరావే...', 'చిట్టిచిలకమ్మా/అమ్మకొట్టిందా..', 'చుక్‌చుక్ రైలు వస్తుంది/దూరం దూరం జరగండి...' వంటి చిట్టి పాటలు, ఉప్పు కప్పురంబు నొక్కపోలికనుండి/చూడచూడ రుచులజాడ వేరు మేడిపండు చూడ మేలిమైయుండు/పొట్టవిప్పి చూడ పురుగులుండు వంటి పద్యాలను తెరపై ఇస్తూ వాటిని పాడి వినిపించడం... వింటున్నవారి మనసుకు ప్రశాంతత చేకూర్చటమే అవుతుంది.

అట్లాగే చెప్పుకోదగ్గ మరో కథ పరమానందయ్య శిష్యుల కథ. అది పిల్లల్ని వినోదపరుస్తుంది. పరమానందయ్య శిష్యులు చేసే అమాయకపు చేష్టలు కడుపుబ్బ నవ్విస్తాయి. కథలు, పాటలు, పద్యాల ద్వారా పిల్లల్లో సాహిత్యాన్ని పెంపొందించే ప్రయత్నం వల్ల పిల్లలు భాష, సాహిత్యం మీద అభిరుచి పెంచుకుంటారు. పిల్లలకు చిన్నవయసులో భాష, సాహిత్యాల మీద ఆసక్తి కలిగిస్తే వారు రేపటి తెలుగు పౌరులుగా ఎదిగి తెలుగును గౌరవివించటమే కాక వారి తర్వాత తరాలకు ఆ ఫలాలను అందిస్తారు. ఈ యానిమేషన్ చిత్రాలను పిల్లలు తెలుగులో చూస్తూ ఆనందాన్ని ఆస్వాదిస్తున్నారు. తెలుగు అంటే అంత మాలిమి లేని నేటి కాన్వెంట్ పిల్లలకు ఈ యానిమేషన్ చిత్రాల వల్ల తెలుగు గొప్పదనం అర్థమవుతుంది. పిల్లలంటే తెల్లని కాగితం వంటి వారు. దాని మీద మనమేది రాస్తే అది వాస్తవమనుకునే అమాయకపు స్ఫటికాలు. కాబట్టి వారికిప్పుడు ఈ తరహా చిత్రాలనందించటమంటే మన తెలుగు గత వైభవాన్ని వారికి తెలియజేయడమే. తెలుగు భాషావ్యాప్తికి ఇవే దోహదపడ్తాయని అనలేము కాని ఇవి కూడా ఎంతోకొంత తోడ్పడతాయి. వినోదం, విజ్ఞానం, నీతితోపాటు పిల్లలను మళ్లీ తెలుగు దారి వైపు లాక్కొచ్చే పని నాడు పుస్తకాలు చేసినంతగా ఈనాడు సీడీలు చేస్తే బాగుంటుంది.





**జావేద్**
చిత్రకారుడు,
హైదరాబాద్. 92900 78696

## కనక... కనక...



విశ్వనాథ సత్యనారాయణగారికి కనకాభిషేకం చేయతలపెట్టారు కోరుకొండలోని కొంతమంది సాహిత్యాభిమానులు. విశ్వనాథవారు వారిని వారించారు. 'నాయనా, కనకాభిషేకం చేయాలంటే బంగారం కరిగించి నెత్తిమీద పోయాలి. అలా చేస్తేనే అవుతుంది కనకాభిషేకం' అని చెప్పి వద్దన్నారు. కార్యకర్తలు స్వర్ణపుష్పాభిషేకం చేయడానికి బతిమాలి ఒప్పించారు. మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు అధ్యక్ష స్థానంలో ఉండి ఇలా అన్నారు- "విశ్వనాథ సత్యనారాయణగారు కవిసామ్రాట్ కనక... సాంప్రదాయ సాహిత్యానికి మణిమకుటం వంటివారు కనక... వివిధ ప్రక్రియలలో సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు కనక... మనం అంతా ఒకచోట చేరాం కనక... వారు వద్దన్నారు కనక... వీరు చేయకతప్పదంటున్నారు కనక... ఇది 'కనక అభిషేకం." ఇంకేముంది? కనకాన్ని కరగించి పోసినంత సంబరంగా సభ చిరునవ్వులు చిందించింది.

# రక్కెస పొదల్లో రస భాష

రసానికి ఏయే అర్థాలున్నా 'సారము' అనే కోణంలో నుంచి దానిని సందర్శిద్దాం. అసలు - రసానికి ఉపనిషత్కాలంలో ఉన్న అర్థం కూడా అదే. ఒక సారవాహిక 'మధురం'గా ఉంటే -మరొకటి 'ఉచ్చారణ'లో ఉదాత్తతను నింపుకొంది. వేరొకటి శాబ్దిక సౌందర్యంతో వెన్నెలంత సొగసును అద్దుకొంది. ఇదొక త్రివేణీ సంగమం అనుకొంటే ఆ కూడలి పేరు కచ్చితంగా 'తెలుగే' అవుతుంది. 'రసవత్తర భాష ఏది?' అన్నప్పుడు తెలుగు అని చెప్పక తప్పదు.

తెలుగు ఎప్పటిది అని ఎవరైనా అడిగితే - గుండెమీద చేయివేసికొని దాదాపుగా మూడు వేల సంవత్సరాల వయసని ఘంటాపథంగా చెప్పచ్చు. అయితే పరిణామ దశలనేవి ఎప్పుడూ ఉంటాయి. విత్తనం నుండే కదా వియత్తలాన్ని తాకే చెట్టు పరిణామదశల్ని చూస్తుంది. తెలుగు కూడా అలాగే దశల్ని దాటుకొంటూ, చీకట్లను చీల్చుకొంటూ ప్రసరించింది.

భాష శ్రవణపర్వంగా ఉండటం ఒక వరం. అలా ఉంటే బంగారానికి తావి అబ్బినట్లే. డబ్బాలో గులకరాళ్లు పోసి మోగిస్తే వెలువడే ధ్వనులే భాషలోకి ప్రవేశిస్తే - ఆ భాష - మాధుర్యానికి మారాకులతికే సంగీతభాష కాజాలదు. శ్రవణ పేయమైన భాషలో ఎప్పుడూ సంగీతముంటుంది. అది సంస్కృతినే శుద్ధి చేస్తుంది. ఆ మాధుర్యం అక్షరాలా తెలుగులో ఉంది. అందుకే తెలుగు- సంగీత భాష అయింది త్యాగయ్య కలంలో. ఎవరెన్ని కీర్తనలు తమ తమ భాషలలో రాసినా - ఒక్క తెలుగుపాకంలో ముంచిన కీర్తన మాత్రమే - గాన యోగ్యమై - గాంధర్వానికి అమృతదీప్తి ప్రసాదించింది. 'నగుమోము'ను కాదని అదే భావాన్ని అన్య భాషాపదాలతో అల్లితే - నలువరాణిలో నగుమోము ద్యోతకమవుతుందా! 'ఎందరో మహానుభావులు' తెలుగు కీర్తనలోనే కదా పరిఢవిల్లారు. త్యాగయ్యకు ముందే అన్నమయ్య 'చందమామ రావే... జాబిల్లిరావే...' అంటూ తెలుగులో బాలానందానికి బాటలు వేయలేదా. ఈ పదాలలో ఎంత మాధుర్యం తొణికిసలాడింది! చందమామ, జాబిల్లి శ్రవణాభరణాలై చెవిని ఎంతగా అలరించాయి! ఆధునిక తరంలో సైతం 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' అంటూ శంకరంబాడి అల్లిన పూలమాల ఎప్పటికీ వాడిపోదు కదా! తెలుగుతల్లి, మల్లెపూదండలలో ఎన్ని సోయగాలు చిమ్ము కొచ్చాయి!...

అలాగే ఉచ్చారణ- నాలుకపై నాట్యమాడని పదాలు తెలుగులో కనిపించవు. 'నల్లేరుపై బండినడకల్లా' సాగిపోతుంది మొత్తం భాషంతా. 'సిరి'నే తీసుకుందాం. పలకటానికి ఎంత సులభంగా ఉంది ఆ పదం. వల, తల, కల, ఆట, పాట... ఇవీ అంతే! తీపి, వెన్నెల... ఇలా ఎన్నో పదాలు భాషను ప్రభావితం చేసినవే! అదే ఇతర భాషలలో - ఇదే అర్థం వచ్చే పదాలను పరిశీలిస్తే అంతసారళ్యం ఉండదు. ఉచ్చారణలో కుదుపులే అనుభూతికి వస్తాయి. శబ్ద సౌందర్యమూ అంతే!

'సోయగం'లో ఎంత అందం ఇనుమడించింది! 'పల్లకి'లో ఎంత అందం ఊరేగింది! 'ఊయెల' ఎంత అందంగా ఊగింది! ఈ ప్రత్యేకతలన్నీ కలిసి తెలుగును 'త్రి'వాణి' సంగమంలో స్నానం చేయించగలిగాయి.

తెలుగు భాష గురించి తెలుగువాళ్లే ప్రశంసిస్తే - అది స్వోత్కర్ష అనిపించుకోవచ్చు. కాని, దేశంలో ఉన్న ఇతర భాషా పండితులు, విదేశీ ప్రముఖులు సైతం అగ్రతాంబూలాన్ని అందిస్తే - అదెంత పురస్కారం!

ఇటలీ దేశస్థుడు నికోలయ్ కోంటే తెలుగును 'ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్' అని కొనియాడటం ఇక్కడ గమనార్హం. యూరప్ ఖండంలో ఇటాలియన్ భాష ఎంతో విశిష్టమైంది. సుందరమైంది. దానికి కారణం పైన పేర్కొన్న లక్షణాలే!

నికోలయ్ వట్టినే ఆ మాట అనలేదు. 1420 సంవత్సరంలో భారతదేశానికి వచ్చిన ఆ విదేశీయుడు దేశంలోని అనేక భాషల తీరుతెన్నులను ఆకళింపు చేసుకొన్నాడు. విజయనగర సామ్రాజ్యంలో తెలుగును నేర్చుకొన్నాడు. దేశంలో అన్ని భాషలుండగా నికోలయ్ ఒక్క తెలుగునే ఎందుకు అభ్యసించినట్లు?... తెలుగులో ఉన్న ఆ త్రిగుణాలే ఆ ఆకర్షణకు ఆధారభూతాలు.

ఉద్యోగం చేసుకోవటానికి ఈ దేశం వచ్చిన బ్రౌన్- తెలుగు వెలుగులో తడిసిపోయి ఎంత సేవ చేశాడు! ఆ ఋణం ఎప్పటికీ తీర్చుకోలేనిదే! తెలుగు నేర్చుకొని ఆ సారాన్ని ఒంటబట్టించుకొని - తెరవెనుక దాగి ఉన్న ఎన్నో తెలుగు గ్రంథాలను సాహిత్య ప్రపంచానికి పరిచయం చేసింది ఆయనే కదా! అనువాదాలకు ఊపిరులూదిన భాషా సేవాపరాయణుడాయన. ఎన్నో వ్యయప్రయాలసకోర్చి అరవైయేళ్ల బతుకును తెలుగు కొరకు వెచ్చించిన మహనీయుడు సి.పి. బ్రౌన్.

అలాగే కాడ్వెల్, గిన్ తెలుగు భాషకు మహోపకారం చేసినవారే! ఆ తరువాత హాల్డేన్. హాల్డేన్ బ్రిటీషు దేశంలో పేరెన్నికగన్న జీవశాస్త్ర పండితుడు. భారతదేశంలో జాతీయభాషగా తెలుగుకున్న అర్హత మరొక భాషకు లేదని నొక్కి వక్కాణించటం విశేషం. ఆ కాలంలో కలెక్టర్ల పాలనా వ్యవహారాలు తెలుగులోనే నడిచేవి. వారి సంతకాలు కూడా తెలుగులోనే ఉండేవి.

అంతెందుకు పన్నెండేళ్ల క్రితం డా॥ డేనియల్ నెజర్స్ అనే ఫ్రెంచి దేశస్థుడు తెలుగు వారి బుర్రకథలపై పరిశోధనలు చేసి పారిస్‌లో సిద్ధాంత వ్యాసం సమర్పించటం ఎంత గొప్ప! మళ్లీ ఆయనే ఈ మధ్య 'ఆంధ్రుల సమాజస్థితి - భాష' అనే అంశంపై పరిశీలన చేయటానికి తెలుగుగడ్డపై కాలుమోపటం మరింత గర్వించ దగ్గ విషయం కాదా!

ప్రపంచంలో ఎక్కడైనా సరే ఫ్రెంచిభాష నేర్చుకొనే వీలుంది కాని, తెలుగును తెలుగు నేలపై నేర్చుకోవటానికే అవకాశాలు మృగ్యమయ్యాయని ఆయన ఆవేదన వ్యక్తపరిచారంటే - అదెంత మాత్రం ఉపేక్షించదగిందికాదు. రష్యా, ఫ్రాన్స్, జర్మనీ, జపాన్ మొదలైన దేశాలు మొదటి తరగతినుంచి మాతృభాషలోనే విద్య నేర్పుతుండగా - ఇక్కడ తెలుగుభాషకు ఆ స్థానం ఎందుకు లేదో నెజర్స్‌కు అర్థం కాలేదు.

ఈనాటికి కూడ భారతదేశంలో హిందీ తరువాత అత్యధిక శాతం ప్రజలు మాట్లాడే సంపన్నభాష తెలుగే! ప్రపంచ భాషలలోనే తెలుగు ఆరవస్థానంలో నిలబడుతుండగా ఇక్కడ మాత్రం ఈ ఉదాసీనత ఊరేగుతుంది. రసవత్తర భాషగా మన్ననలందుకొన్న తెలుగు ఈనాడు ఏ దశలో ఉన్నది? ఏ దిశగా ప్రయాణిస్తున్నది? అనేవి... ప్రశ్నలుగానే మిగిలిపోతున్నాయి.

**తలవంపులు**

నేర్వ నితరభాష నేర
మసలు కాదు
మరచిపోయనేని మాతృభాష
తగని నేరమగును తలవంపులగునురా
మధురమయిన భాష మాతృభాష

**-ఆర్.వి.రమణమూర్తి,**
**ప్రధానోపాధ్యాయులు,దమ్మపేట, ఖమ్మం.**

అన్నం, కూర, ఉప్పు - ఈ పదాలు కూడా అనలేని దుస్థితిలో ఉంది ఈనాటి వ్యవస్థ. టాటా, బైబైలు రక్తంలో ప్రవహిస్తున్న రోజులివి. ఎక్కువగా ఆంగ్ల పదాలపైనే మోజు చూపించటం ఎక్కడైనా తెలుగుపదం వాడినప్పుడు ఆ ఉచ్చారణకు కృతకత్వాన్ని జోడిస్తూ, సారళ్యాన్నీ, మాధుర్యాన్నీ మంటగలపటం కాలం గమనిస్తూనే ఉంది. అలాగే అనటానికి 'ఓకే' అంటున్నాం. చివరకు బిచ్చగాణ్ణి సైతం 'బెగ్గరం కుల్'గా మార్చేశాం. ఇదీ దుస్థితి.

ఏ భాషయినా వినియోగం లేకపోతే క్రమంగా మరుగునపడిపోవటం ఖాయం. పదేళ్ల క్రితం ఐక్యరాజ్యసమితి కట్టిన లెక్కల ప్రకారం ఆరువేల భాషలలో మూడువేలు క్రమక్రమంగా అంతరించిపోతున్నట్లుగా తెలుస్తోంది. 2003 సంవత్సరంలో నూటికి ఇరవైమంది పిల్లలు మాత్రమే తెలుగు అక్షరాలు నేర్చుకొనగలిగారంటే - తెలుగుకు ఎంతగా తెగులు పట్టిందో తేటతెల్లమవుతుంది. తమిళులకీ, బెంగాలీలకు ఉన్న భాషాప్రియత్వం తెలుగువాళ్లలో ఎందుకో కొరవడింది. దేశంలో హిందీ తరువాత రెండవ భాషగా ఉండవలసిన తియ్యని తెలుగు ఈ చేదును మింగలేపోతోంది. వ్యావహారిక భాషోద్యమంలో ముందడుగు వేసిన 'గిడుగు' భాషాభిమానం ఏపాటిదో ప్రతి తెలుగు వాడూ తెలుసుకోవలసిందే!

పట్టుదల, పౌరుషం, ఆయనలో పడుగుపేకలై జాతిని జాగృతం చేశాయి. ఎక్కువగా తెలుగువాళ్లు నివసిస్తున్న పర్లాకిమిడిని పక్కనే ఉన్న ఒరిస్సాలో విలీనం చేయటాన్ని ఆయన నిర్ద్వంద్వంగా వ్యతిరేకించారు. నెత్తిపై ట్రంకుపెట్టె ఎత్తుకొని రాజమండ్రి వచ్చిన అచ్చమైన ఆత్మాభిమాని ఆయన. ఆ 'కసి' ఇప్పటివాళ్లలో కనుచూపు మేరలో కూడా కనిపించటం లేదు. ఈ విషయంలో కొందరు కృషి చేస్తూనే ఉన్నారు. అయినా అది మరింత నిర్మాణాత్మకమై నిలదొక్కుకోవాలి. ఇక్కడ సంఘటిత ప్రయాణం ఎంతైనా అవసరం. ఉద్యమించడం మరింత అవసరం. అప్పుడే తెలుగు వెలుగులీనుతుంది. రక్కెస పొదల్లో పడిపోతున్న తెలుగు - రసవత్తర భాషగా - రసనలపై మళ్లీ రాజ్యమేలుతుంది.

మల్లెపువ్వుకంటె - మంచిగంధము కంటె
పంచదారకంటె-పాలకంటె
తెలుగు బాసలెస్స! దేశభాషలకు, సం
గీతభాష తెలుగుజాతి భాష

**రసరాజు**
కవి, సాహితీవేత్త,
తణుకు, పశ్చిమగోదావరి
94403 88659

# స్పందన



ఫోన్ మాట్లాడుతూ డాబా మీద అటూ ఇటూ తిరుగుతున్న అరుణ్ మనసు ఒక్కసారిగా ఉలిక్కిపడింది. ఎప్పట్నుంచో తాళం వేసి ఉంటున్న ఎదురింటి డాబా మీద మెరుపుతీగ మెరిసి మాయమైంది. ఆ అమ్మాయి మళ్లీ కనిపిస్తుందేమోనని ఆశగా చూస్తున్న అరుణ్ "బాబూ భోజనానికి రారా" అన్న తల్లి సావిత్రమ్మ పిలుపుతో అయిష్టంగా కిందికి వెళ్లాడు.

"అమ్మా పక్కింట్లో...." అన్నం తింటూ అడిగిన అరుణ్ ప్రశ్న పూర్తి కాకుండానే ఆవిడ అందుకుంది. "అవునురా ఎవరో దిగారు! అయనెక్కడో దూరం ఉద్యోగం అట, ఇక్కడ పిల్లల చదువు కోసం మీనాక్షమ్మ ఉంటుందట".

'అయితే ఆ మెరుపు తీగ ఇంకా విద్యార్థే అన్నమాట!' అనుకున్నాడు. మర్నాడు ఉదయం ఆఫీసుకు బయలుదేరుతున్న అరుణ్ గేటు దగ్గరనుంచి అప్రయత్నంగా పక్కింటి వైపు చూశాడు. ఇద్దరు అమ్మాయిలు స్కూటీ మీద బయటకు వస్తున్నారు. రాత్రి కనిపించిన మెరుపుతీగ స్కూటీ నడుపుతుంటే, పుస్తకాల సంచితో కాస్త చిన్నమ్మాయి, వెనుక కూర్చుంది. స్కూటీ గేటు దిగేసరికి, పాఠశాల బస్ ఏదో అడ్డంగా వచ్చింది. రోడ్‌కు ఇటువైపు వెళ్తున్న అరుణ్ బైక్‌కు తిన్నగా వచ్చి తగిలింది స్కూటీ. ఇద్దరూ కింద పడ్డారు. కంగారుగా బైక్‌కు స్టాండ్ వేసి నిలబెట్టాడు, పుస్తకాల సంచీ బరువుతో లేవలేకపోతున్న అమ్మాయిని లేవదీశాడు. దుస్తులకు అంటిన దుమ్మును దులుపుకొంటూ "కాస్త చూసుకోవద్దా?" కోపంగా అంది పెద్ద అమ్మాయి.

ఆశ్చర్యంగా చూసేడతను. "ఏం చూసుకోవాలమ్మా? నువ్వు ఎటునుంచి వచ్చి గుద్దేస్తావో అని చూసుకోవాలా రోడ్డు మీద జనాలు?"

కోపంగా చూసి, "కావాలని నీ బైక్‌ను మా స్కూటీకి అడ్డుపెట్టి, ఏమీ ఎరగనట్టు, ముఖం చూడు" అంది.

"అది చూద్దామనే అనుకున్నా, నువ్వు చూడనిస్తేగా, తిన్నగా వచ్చి గుద్దేశావ్, సర్లే ఇపుడు చూస్తా... పర్వాలేదు బానే ఉన్నావ్. పెద్ద అందగత్తెవు కాకపోయినా," బైక్ స్టాండ్ తీస్తూ చిలిపిగా అన్నాడు.

"ఏయ్.. నాకు కోపం వస్తే..."

"అక్కా... వద్దే పద వెళ్దాం" బతిమాలుతోంది చిన్నమ్మాయి.

"అబ్బో కోపం వస్తే ఏం చేస్తుందట మీ 'అక్క'?" అని నొక్కి అడిగేడతడు.

"అయ్యో వద్దండీ, ప్లీజ్... దానికి కోపం వస్తే చేతిలో ఏదుంటే అది విసురుతుంది," భయంగా బతిమలాడుతూ అందా అమ్మాయి.

"ఓహో ఎర్రగడ్డా?" అంటూ బైక్‌ను ముందుకు పోనిచ్చాడతడు.

"ఛీ పదవే దయ్యం!" చెల్లిని కోపంగా చూస్తూ స్కూటీని స్టార్ట్ చేసింది అపర్ణ.

***

సాయంత్రం ఆఫీసు నుంచి ఇంటిదారి పట్టిన అరుణ్ ఉదయం జరిగిన సంఘటన గుర్తొచ్చి చిన్నగా నవ్వుకున్నాడు. కాలేజీ వదులుతూనే ఉద్యోగంలో పడటంతో జీవితం మరీ యాంత్రికంగా తయారైంది. కాలేజీ రోజులు ఎలా ఉండేవి! ఎటు చూసినా కళకళలాడిపోతూ రంగులే రంగులు! ఇక కాస్త తోచిపోతుంది. అతడి బైక్‌కు ఒక్కసారిగా బ్రేకు పడింది. బండి ఆపి, రోడ్డు పక్కన ఉన్న చాట్ బండి దగ్గరకు నడిచాడు.

"పానీపూరీ బాగుందా?" సువర్ణను అడిగేడు!

"బాగుందండీ" బెరుకుగా అక్క అపర్ణ వైపు చూస్తూ చెప్పింది.

"అయితే నాకూ పానీపూరీ ఇవ్వు" అంటూ ప్లేట్ పట్టుకు నిలబడ్డాడతను.

"పానీపూరీ ఎపుడూ తినలేదా?" మింగేసేలా చూసింది అపర్ణ.





## కథ

"పానీపూరీ ఇంత బాగుంటుందని ఇపుడే తెలిసింది మరి," తింటూ అన్నాడు.

"బాబూ నాకు పానీపూరీ వద్దు, చాటే ఇవ్వు," ప్లేటు ఓ మూలకు కొడుతూ అంది అపర్ణ.

"అయితే నాకూ ఛాటే ఇయ్యి," అన్నాడు అరుణ్.

"నాకేమీ వద్దు, ఇక వెళ్దామా అక్కా!" భయంగా అడిగింది సువర్ణ.

పళ్ళుకొరుక్కుంటూ అటు తిరిగి నిలబడింది అపర్ణ. అందరికీ ఛాట్ పళ్లాలు అందించేడతను. తినేసి పళ్లాలు చెత్త బుట్టలో వేసి వచ్చేసరికి, స్కూటీ ఎక్కి అక్కా చెల్లెళ్లిద్దరూ వెళ్లిపోవడం గమనించాడతను.

"డెబ్భై రూపాయలు ఇవ్వండి," చెప్పాడు బండివాడు, "బిల్లు మీరే ఇస్తారని చెప్పిందా అమ్మాయి."

"అమ్మ పానీపూరీ..." అనుకుంటూ అతడికి డబ్బిచ్చి ఇంటి దారి పట్టేడు.

మేడమీద కాస్త గాలి పీల్చుకుందాం అని వచ్చిన అరుణ్‌కు ఎదురుగా కనిపిస్తున్న దృశ్యంతో కళ్లు మెరిశాయి.

యోగా భంగిమలలో 'పానీపూరీ'. ఆమె చూడటంతో చూపు మరల్చుకొని సెల్ తీసి చెవి దగ్గర పెట్టుకున్నాడు. కోపంగా పిట్టగోడ దగ్గరకు వచ్చింది. "నీకు వేరే ఏం పని లేదా?" అరిచింది.

చుట్టూ చూస్తూ "నాకేనా?" అడిగేడు.

"నీకే! సిగ్గు అనిపించటం లేదా, ఒక అమ్మాయిని లేచిన దగ్గర్నుంచి పడుకునే వరకు గమనిస్తూ వెంట పడటానికి?" ఆమె స్వరం స్థాయి పెరిగింది.

"ఏయ్ పానీపూరీ, నువ్వేమైనా మిస్ ఇండియావా, కనీసం మిస్ హైద్రాబాద్‌వా? ఇక్కడ మేం అన్ని పనులూ మానుకు కూర్చొని చూడటానికి?"

"ఇంకోసారి పానీపూరీ అన్నావంటే!"

"మరి బిల్లు నాతో ఎందుకిప్పించావ్ పానీపూరీ" కవ్వింపుగా అడిగేడతడు.

"నిన్నూ.... ఉండు చెప్తా," అంటూ ఇంట్లోకి పరుగుతీసింది. కొంచెం భయమేసిందతడికి, ఇపుడేం చేస్తుందోనని. ఆమె అయిదారు టమాటాలు తెచ్చి పిట్టగోడపై పెట్టి, ఒక్కోటి తీసి అరుణ్ మీదకు విసిరి కొట్టసాగింది. అతడు అవి తగలకుండా తప్పించుకొంటూ "ఏయ్ ఆగు, ఆగు, వద్దు." అన్నాడు. వేలితో 'జాగ్రత్త'అన్నట్లు చూపిస్తూ లోపలకు వెళిపోయింది. "అమ్మో, ఈ అమ్మాయి సాధారణమైందికాదు," అంటూ ఉయ్యాలబల్ల మీద చతికిల పడ్డాడు.

***

ఆదివారం ఉదయం ఆలస్యంగా నిద్ర లేచిన అరుణ్ తయారై కిందకువచ్చాడు. "అమ్మా టిఫిన్ ఏంచేశావ్?" అంటూ వంటింట్లోకి చూసిన అరుణ్ కళ్ళు విస్తుపోయాయి!

'పానీపూరీ'! తను మా వంటింట్లో ఏం చేస్తున్నట్లు చెప్మా అనుకుంటూ భోజనాల బల్ల దగ్గర కుర్చీ ఒకటి లాక్కొని కూర్చున్నాడు. "ఒక్క నిముషం కూర్చో నాన్నా, తెచ్చేస్తా," అంటూ వంటింట్లోకి వేగంగా వెళ్ళింది సావిత్రమ్మ.

ఏదో గిన్నె చేత్తో పట్టుకు బయటకు వచ్చి అతన్ని చూడనట్టే వెళిపోబోయింది అపర్ణ. "ఇది మా ఇల్లే" అన్న అరుణ్ మాటలకు ఆగి అతడి ముఖంలోకి చూసింది "అవునా! పైగదిలో అద్దె కున్నావనుకున్నాన్లే.." అంటూ వెళిపోయింది. కోపంతో బల్లమీద గుద్దేడు. చాలా పొగరు అనుకున్నాడు. గొణుక్కొంటూ ఆదివారం వచ్చిన తెలుగు పత్రికలో కవితల పేజీకోసం వెతికాడు. నిరాశగా పుస్తకం పక్కన పెట్టేశాడు. ఈవారం ఆమని కవిత రాలేదు. ఎందుకు రాలేదో! పదే పదే అనుకుంటున్నాడు. ఆమె కవితలంటే ప్రాణం అతడికి. జవాబు రాకున్నా తన భావాలతో జాబులు రాస్తూనే ఉంటాడు ఎపుడూ!

***

అస్సాంలో ఇంజనీర్‌గా పనిచేస్తున్నారు అపర్ణ తండ్రి ఆనందరావు. అనారోగ్యం కారణంగా సెలవుపెట్టి ఇంటికి వచ్చేశారు. తొందరగా పెద్ద కూతురి పెళ్ళి చేసేస్తే ఒక బాధ్యత తీరుతుందని ఆయన ఆలోచన. భార్య మీనాక్షి సలహాతో అరుణ్‌పై పడింది ఆయన దృష్టి.

అపర్ణ ఆ రోజు వచ్చిన ఉత్తరాల నుంచి లేత నీలంరంగు కవరు తీసి తెరిచింది. మళ్ళీ అతడే! జవాబు ఇవ్వకున్నా ప్రతివారం తప్పకుండా వచ్చే ఆ ఉత్తరం కోసం ఎదురుచూడటం అలవాటుగా పరిణమించింది అపర్ణకు. ఇన్నాళ్ళూ అజ్ఞాతంగానే రాసే ఆ 'తేజ' తనను కలవాలని ప్రాధేయపడుతున్నాడు. ఇప్పటికి మూడుసార్లు అదే అభ్యర్థన. ముందు ఎవరో ఆకతాయి అనుకుంది. లేఖల్లో కనపడే సున్నిత స్వభావం నచ్చింది! తనపట్ల ఆరాధనా భావమూ నచ్చింది! వివాహ వ్యవస్థపట్ల తన అభిప్రాయాన్ని అడిగిన తీరు ఇంకా నచ్చింది. క్రమంగా, అతడి పట్ల

పూర్వాభిప్రాయం తప్పనిపించసాగింది.

"నేను చదువు పూర్తయ్యేకనే చేస్కుందాం అనుకుంటున్నాను నాన్నా" పెళ్ళి ఈ ఏడాదే జర గాలని పట్టుపడుతున్న తల్లిదండ్రులకు చెప్పింది.

"పెళ్లయ్యాక చదువుకోవచ్చమ్మా! ఆ అబ్బాయి నీకు తెలిసిన వ్యక్తే. మన సావిత్రమ్మ గారి అబ్బాయి అరుణ్ మంచి ఉద్యోగం.....".

మాటలు పూర్తి కాకుండానే "వాడా" అరి చింది అపర్ణ అప్రయత్నంగా. "నాకు అస్సలు ఇష్టంలేదు".

"ఎందుకనీ?" అసహనంగా అడుగుతున్న భార్యను వారించేడు ఆనందరావు. "కామాక్షీ ఇన్నాళ్లూ పిల్లలకేం కావాలో మనకు తెలుసు! ఇపుడలా కాదు. ఆ అవకాశం వాళ్లకే ఇవ్వాలి" ఏమో చెప్పబోయిన కూతురి తల నిమురుతూ, "పర్వాలేదు తల్లీ, బాగా ఆలోచించి మంచి నిర్ణయం తీసుకో!" అని ఆయన వెళ్లిపోయాడు.

చాలా సేపు ఆలోచించిన అపర్ణ అల్మరాలో నుంచి గులాబీ రంగు లెటర్ పాడ్ తీసి రాసింది నెమ్మదిగా. "తేజాగారూ, వెంటనే స్పందించటం ఇష్టం లేక మీకు జవాబులు రాయలేదు. మీరు కలవాలని పట్టుపడుతున్నారు! సరే, నా సెల్ నెంబర్ ఇస్తున్నా, మాట్లాడండి నాతో". ఆమని ఉత్తరం మడిచి కవర్‌లో పెట్టి అతికించింది. మర్నాడు కళాశాలలో ఉండగా సెల్ మోగింది.

"ఆమని గారూ, నా పేరు" అన్న గొంతు విని కాస్త ఉద్విగ్నతకు లోనయ్యింది.

"నేను క్లాస్‌కు వెళ్తున్నాను, ఒక గంట ఆగి చెయ్యండి." అంటూ ఫోన్ ఆపేసింది.

కాలేజీ సమయం అయిపోయేక మళ్లీ చేశా డతను.

"ఆమని గారూ ఇవ్వాళ కలుద్దామా? రైలు వంతెన పక్కన ఉన్న పార్కుకి రాగలరా" సూటిగా అడిగేడతను. వస్తానంది.

***

హడావుడిగా తయారై బయటకు వెళ్తున్న కొడుకును పిలిచింది సావిత్రమ్మ.

"ఏంటమ్మా" వేయించిన అప్పడం ముక్క విరిచి నోట్లో వేసుకొంటూ అడిగేడు.

"ఆ కామాక్షమ్మ వాళ్ల ఆయన అస్సాం నుంచి వచ్చేడు, పెద్ద కూతురు పెళ్లి చేయడానికి. నీకిద్దామనుకుంటున్నారు. ఏమంటావు?"

"ఏమిస్తారు" అడిగేడు కంగారుగా

"నటించకురా అర్థం కానట్టు" మొట్టింది కొడుకు తలపై.

"అదేమన్నా చాక్లెట్టా వాళ్లివ్వటానికి, నేను తీసుకోవటానికి? సీమ మిరపకాయ్! నా కస్సలు కుదరదమ్మా, పిచ్చి కోపం.. ఎలా భరించాలి? వాళ్లు వదిలించుకోవాలని, నాకు కట్టేద్దామని చూస్తున్నారు అంతే."

"పెళ్లయ్యాక అలా ఎందుకుంటుందిలేరా?"

"అదే నేనూ చెప్పేది, పెళ్లి అవ్వకుండానే ముక్కూ ముఖం తెలియని నన్ను టమాటాలతో కొట్టింది. ఇక పెళ్ళయిందనుకో, ఏ కంకర రాళ్ళ తోనో సరసమాడుతుంది. నన్నిలా హాయిగా బతకనియ్యి." అని వెళ్లిపోయాడు.

***

పార్క్‌కు చేరుకున్నాడు. అక్కడక్కడా ప్రేమ జంటలు తప్ప, పెద్దగా ఎవరూ లేరు. గేటు కని పించేంత దూరంలో ఒక బల్ల మీద కూర్చు న్నాడు అరుణ్. తల్లి తెచ్చిన పెళ్ళి ప్రస్తావన కల వరపరచింది అతడిని. 'ఏ మానవుడైనా బతికి బట్టకడతాడా ఆ రాకాసిని చేస్కుంటే!'

ఆ ఆలోచనలను ఓ పక్కకు నెట్టేసింది ఆమని! ఎంతోకాలంగా కలుసుకోవాలని కలలు గన్న తన ఆమని వస్తుందన్న తలపు, అతడి మనసుకు గిలిగింతలు పెడుతోంది. ఫోన్లో మంచు తెరల్లా హృదయాన్ని మీటుతున్న మహ్మద్ రఫీ పాట వింటున్న ఆతడి కళ్ళు అర మోడ్పుగా అయ్యాయి!

"ఏయ్, నీకేం పనిలేదా నన్ను నీడలా వెంటాడటం తప్ప" ఉలిక్కిపడి చూశాడు అరుణ్. ఎదురుగా 'పానీపూరీ.'

"నీకు ఏమైనా పిచ్చా? ఇది పబ్లిక్‌పార్కు. నా మానాన నేను ఏదో పాటలు వింటున్నాను. అసలు నాకు తెలియక అడుగుతున్నాను, బుద్ధున్న వాడెవడైనా నీలాంటి పోట్ల గిత్త వెంట పడతాడా?"

"ఏంటి పోట్ల గిత్తా? ఇక్కడే ఉండు నీపని చెప్తా"అంటూ విసురుగా వెళిపోయింది, సెల్ ఫోను డయల్ చేస్తూ.

"వెళ్ళవమ్మా వెళ్ళి పని చూడు నన్ను తినక" చాలా విసుగ్గా వుంది అతడికి, ప్రశాంత మైన కొలనులో రాళ్ళు పడినట్లు కళవళ పడు తోంది అతడి మనసు! 'ఇంతకూ ఈవిడ రాలే దింకా. ఇక్కడ శకునం కూడ చాలా తేడాగా ఉందిగా. ఒకవేళ మనసు మార్చుకుందేమో! ఫోన్‌చేసి రానని చెప్తుందేమో' ఆఖరుకు ఆ నంబ రుకు ఫోన్ చేశాడు. అదే సంగీతం లాంటి తీయని స్వరం "హలో!" అంటూ, అతడి గుండె చప్పుడు అతడికే వినిపిస్తోంది.

"నేను మీకోసం ఎదురు చూస్తున్నాను.. మీరు..... " అన్నాడు ఎలాగో నోరు పెగల్చు కొని.

"మీరెక్కడున్నారు"

"మీరెక్కడున్నారో చెప్పండి, నేను వస్తు న్నాను," అన్నాడు ఆత్రంగా.

ఆమె చెప్పిన దిశగా నెమ్మదిగా నడుస్తు



న్నాడు అరుణ్, పరీక్ష ఫలితాలు చూసుకొనే సమ యంలో కలిగే ఉద్వేగం అతడిలో. తన కల నిజం కాబోతున్న రోజు!

వెళ్తున్న అరుణ్ కాళ్ళకు బంధంలా అపర్ణ కనిపించింది. అమ్మో మళ్ళీ నా వెంట పడుతు న్నావని పోట్లాట మొదలు పెడుతుంది, అను కుంటూ ఆగిపోయాడు.

ఫోన్ మోగింది. "ఎక్కడున్నారండీ తేజా గారూ?"

"గేటు దగ్గరకు రండి. ఇక్కడే చెట్టుకింద నిలబడి ఉన్నా" ఆత్రంగా అపర్ణను దాటి వెళ్ళేడు. చుట్టూ చూశాడు. ఆమె జాడేలేదు ఎక్కడా. మళ్ళీ రింగ్ చేశాడు. ఫోన్ మోగుతోంది



'హృదయం ఎక్కడున్నదీ' పాటతో. ఉలిక్కిపడి వెనుతిరిగి చూశాడు అరుణ్. అపర్ణ చేతిలో ఫోన్ మోగుతోంది! ఒక్కసారి ప్రపంచం అంతా గిర్రున తిరుగుతున్నట్లైంది. నిశ్చేష్టుడై నిలబడిపోయాడు, కళ్లప్పగించి అపర్ణవైపు చూస్తూ.

"ఇదెలా సాధ్యం!" ఇంత కటువైన మనిషి అంత సున్నితమైన, అద్భుతమైన కవిత్వం రాస్తోందా? తట్టుకోలేక పోతోంది అతడి మనసు.

అపర్ణ నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ ఏదో తెలియని స్థితిలో ఉన్నట్లు అరుణ్ దగ్గరకు నడిచింది. ఆమె ప్రపంచమే తలకిందులైనట్లుంది. "నీ పేరు... సారీ మీపేరు అరుణ్ కాదా?" అడిగింది విస్మయంగా. ఈ ఊహించని సంఘటన నుంచి అతడు ఇంకా కోలుకోలేదు. "చెప్పండి మీరు......అరుణ్ కాదా....." అదే బెంచ్‌పై చివరన కూర్చుంటూ మళ్ళీ అడిగింది అపర్ణ.

"అసలిది ఎలా సాధ్యం?" ఆమె ముఖంలోకి చూస్తూ అడిగేడతడు.

"ఏది" అడిగింది.

"మంచుకురుస్తున్నట్లు, వెన్నెలలో తడుస్తున్నట్లు, రెక్కలు విదిలించి ఆకాశంలో విహరిస్తున్నట్లు అనుభూతినిచ్చే కవితల వెల్లువ మీ మనసులోంచే ఉప్పొంగుతుందా!" అతడి కళ్ళు చెమ్మగిల్లాయి. "నేను నమ్మలేకపోతున్నాను. నా 'ఆమని' మనసు కాఠిన్యమే ఎరుగని సున్నితమైన పారిజాతం పువ్వులాంటిది. దయచేసి నిజం చెప్పండి అపర్ణా"

ప్రాధేయ పడుతున్నట్లడుగుతున్న అతణ్ని "మీ పేరు..." అతడి ముఖంలోకి చూసే ధైర్యం లేక ఎటో చూస్తూ అడిగింది.

"నన్నేనా?" అడిగేడు ఆమె చూస్తున్న దిశగా చూస్తూ.

"ఊ" అంది తలవాల్చి.

"నాపేరు అరుణ్ తేజ".

"ఆ!" అంది కూర్చున్న చోటు నుంచి లేస్తూ.

లేచేడు తటాలున అతడు. "సరే ఆమని గారూ, జరిగింది ఏదో జరిగి పోయింది. ఇక జీవితంలో మీ జోలికి రాను. మీకిష్టమైతే శత్రుత్వం లేకుండా మిత్రులుగా ఉందాం. బై!" అంటూ వెళిపోతున్న అతడి వెనుకే "తేజా ఆగండి" అంటూ పరుగు తీసింది అపర్ణ. ఆగలేదతడు. అతడికి ఎదురుగా అడ్డంగా నిలబడింది ఆమె. "ఒక్క క్షణం ఆగండి దయచేసి. మిమ్మల్నెంతో అవమానించేను. అందుకు నన్ను క్షమించండి. ఒక్క క్షణం ఇలా కూర్చోండి. నే చెప్పేది విని వెళ్లిపోండి" ఆమె చెక్కిళ్ళపై ధార కట్టిన కన్నీటిని చూసి ఆగిపోయాడు అరుణ్. నెమ్మదిగా కూర్చున్నాడు.

"మీలాంటి మంచి వ్యక్తి చెలిమిని కోల్పోకూడదనీ మనం అపరిచితులుగా మిగిలిపోకూడదనీ, ఇన్నాళ్ళూ నా తల్లితండ్రులకు కూడ చెప్పుకోని ఒక విషయం మీకు చెప్తున్నాను. ఆ తర్వాత, మనం స్నేహితులమో, ప్రేమికులమో లేక అపరిచితులమో ఆ నిర్ణయం మీకే వదిలేస్తున్నాను." కంపించింది ఆమె స్వరం.

ఇలా మాట్లాడటం కూడా వచ్చా ఈ అమ్మాయికి! అనుకున్నాడు. "కవితలు నా ప్రాణం, నా ఊపిరి! పదవ తరగతి నుంచీ నా మనసులో ఉప్పొంగి వెల్లువలా పరుగులు తీస్తున్నాయి కవితలు. డిగ్రీ చివరి సంవత్సరంలో సుమన్ అనే వ్యక్తి నా కవితలకు ఆరాధకుడినంటూ పరిచయం అయ్యాడు. అతని మాటతీరు అదీ చూసి అతడిపై నేనూ ఆశపడ్డాను! అతడిని నాన్నగారికి పరిచయం చేసే సమయంలో వాడి నిజస్వరూపం బయటపడింది. అతడికి భార్య, ఇద్దరు పిల్లలూ ఉన్నారు. ఊహించని ఆ గాయం నా మనసును మొద్దుబారేలా చేసింది. నా కవితల వెల్లువతోనే ఆ చేదు అనుభవాన్ని గతంలోకి నెట్టే ప్రయత్నం చేశాను. ఆ తరుణంలో తేజ నుంచి వచ్చే లేఖలు నా మనసులో తిరిగి స్పందనను కలుగజేశాయి. మరోసారి గాయపడి తట్టుకొనే శక్తి లేదు నా హృదయానికి. అందుకే మీకు జవాబు ఇవ్వలేదెప్పుడూ. మా అమ్మానాన్నలు, చెల్లి గురించే ఆలోచించాను. వాళ్ళ సంతోషాన్ని దోచుకొనే హక్కు నాకులేదు. అందుకే ఈ బాధను నా మనసులోనే సమాధిచేసి జీవిస్తున్న సమయంలో మళ్ళీ అరుణ్‌గా మీ పరిచయం నన్ను కలవర పరచింది. మీ తప్పు లేకున్నా మిమ్మల్ని దూరంగా ఉంచాలన్న ఉద్దేశంతో అలా ప్రవర్తిస్తూ వచ్చేను ఈ రోజు వరకు. తేజలోని భావాలు నచ్చాయి! అరుణ్‌లోని కొంటెతనమూ నచ్చింది. నా పెళ్ళిచేయాలన్న మా అమ్మానాన్నల కోరిక తీర్చటం కోసం తేజను కలిసి మాట్లాడటానికి వచ్చేను అంతే."

ఆమె కంటి కొనల నుంచి జారుతున్న కన్నీటి ముత్యాలను తన రుమాలులో భద్రపరుచుకున్నాడతను. ఎలా స్పందిస్తాడోనని భయపడుతున్న అపర్ణ ఆశ్చర్యంగా అతడి ముఖంలోకి చూసింది. "మనం ఎన్నటికీ అపరిచితులం కాము అపర్ణా," అన్నాడు ఆమె చేతిని తన చేతిలోనికి తీసుకుంటూ.

"మరి నా మీద కోపం లేదా?" అడిగింది చిలిపిగా.

"నువ్వు టమాటాలు కాదు, గుమ్మడికాయలు పెట్టి కొట్టినా కోపం రాదిక" అన్నాడతను.

"ఒట్టు!" అంది చెయ్యిచాపి.

"ఏ రాయో పెట్టి కొట్టి 'ఒట్టు'కు పరీక్ష పెడతావా, పానీపూరీ!" భయంగా అడిగేడు, ఆమె చేతిని చెంపకు ఆనించుకొంటూ! గలగలా నవ్వింది ఆమని.



**విజయరాణి**
హైదరాబాద్. 93947 11200

# ఇంటి నుంచే ఆరంభిద్దాం!

"ఒక సంగీతమేదో పాడినట్లు, భాషించునపుడు వినిపించు భాష" అని కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు కీర్తించిన భాష మనది. తెలుగు ఎంత కర్ణపేయమైందో ఈ ఒక్క వాక్యం చూస్తే అర్థమవుతుంది. 'ఇటాలియన్ ఆఫ్ ద ఈస్ట్' అనే గౌరవాన్ని మన తెలుగు పొందడానికి కారణం ఇదే. నాటి నన్నయ నుంచి నేటి నారాయణరెడ్డి వరకు తెలుగు ఎన్ని సొగసులు, ఎన్ని సోయగాలు ఆవిష్కరించిందో చూస్తే ఆశ్చర్యమేస్తుంది.



తల్లి భాషకు మించిన భాష మరొకటి లేదు. అలాంటి భాషకు ఇప్పుడు ఏమాత్రం ఆదరణ ఉంది? ఆలోచిస్తే బాధ కలుగుతుంది. మాతృభాషకు సంబంధించిన ఉద్యమాల్లో ప్రజా ప్రతినిధుల ప్రాతినిధ్యం అంతగా కనిపించదు. ఇది అభిలషణీయం కాదు. భాషా పరిరక్షణ ఉద్యమాల్లో వీరు ఎక్కువగా పాలుపంచుకోవాలి. మన చుట్టూ వాతావరణాన్ని గమనిస్తే ఐటీ చదువులు, ఐటీ ఉద్యోగాలు. వీటి జోరు ఆరంభమైన తరువాత యువతరం వాటి పట్ల ఏ స్థాయిలో ఆకర్షితమైందో ఆశ్చర్యం కలిగిస్తోంది. ఇదిలాగే కొనసాగితే ఇక ముందు యువతరంలో తెలుగు కాగడా వేసి వెతికినా కనిపించదు. దీనికి ప్రత్యామ్నాయం సామాజికవేత్తలు తప్పక సూచించాలి. లేకపోతే కొన్ని దశాబ్దాల తరువాత తెలుగు వినే అవకాశమే మృగ్యమైపోతుంది. మాతృభాష పరిరక్షణ తమ ప్రథమ కర్తవ్యంగా పౌరులు భావించాలి. తల్లి భాష ఇంటివద్ద తల్లిదండ్రుల నుంచే మొదలుకావాలి. మనమంతా తప్పనిసరిగా మన పిల్లలకు తెలుగు భాష పట్ల మమకారం కలిగేలా ఇంట్లో వాతావరణం కల్పించాలి. పౌరులుగా ఇది మనందరి బాధ్యత. మాధ్యమాల విషయానికొస్తే ప్రచురణ, ప్రసార మాధ్యమాలు తెలుగు భాషపై అత్యంత శ్రద్ధకనబరచాలి. ప్రచురణ మాధ్యమం కొంత సంతృప్తికరంగానే ఉన్నా ప్రసార మాధ్యమం పరిస్థితి అధ్వాన్నం. ఈ స్థితి నుంచి వెంటనే బయటపడాలి. వంకర టింకర మాటల సంకర భాష ఈ వేళ ప్రసార మాధ్యమాల్లో రాజ్యమేలుతోంది. రేడియో, టీవీ సంభాషణల్లో తెలుగు మాటలు వెతికి పట్టుకోవాలి. ఒక వేళ ఒకటి రెండు మాటలు దొరికినా వాటి ఔచిత్యమేంటో తరచి చూసినా అర్థంకాదు. వ్యాఖ్యాతలకు మితిమీరిన స్వేచ్ఛ, భాషకు సంబంధించిన అవగాహనారాహిత్యం రెండూ ప్రధాన కారణాలే. నిజానికి ప్రసార మాధ్యమం భాష విషయంలో అద్భుతమైన సేవ చేయగలదు. రేడియో, టీవీలు సవ్యమైన భాషను ప్రజలకు అందించగలిగితే, భాషా పరిరక్షణలో సగానికిపైగా బాధ్యతను నిర్వర్తించినట్లే. దోషం ఎవరిదైనా, ఎక్కడున్నా సవరించుకుని తీరాలి. అందరం కలిసి తెలుగును రక్షించుకుందాం. భావి తరాలకు తెలుగు మాధుర్యాన్ని మనమే అందిద్దాం.

**- పద్మశ్రీ శోభానాయుడు**

# పెద్ద బాలశిక్ష అవసరం!

తెలుగు భాష తియ్యనైనది. కాలానుగుణంగా పరభాషల ప్రభావంతో తెలుగు వెలుగు కరిగిపోతూ వస్తోంది. అందరూ దీనిపై మాట్లాడుతున్నారేగానీ ఎవరికి వారు తెలుగు భాషను కాపాడటంలో ఒక్కడుగు కూడా వేయలేకపోతున్నారు. మాతృభాషను ఈ స్థితికి తీసుకురావడంలో పాలకుల పాత్ర ఉంది. నేను బీఏ వరకు ఉర్దూలోనే చదువుకున్నాను. ఎకనామిక్స్‌ను మాషియత్ అని ఇలా ఒక్క ఆంగ్ల పదంకూడా రాకుండా గ్రంథాలను ఉర్దూలోకి తర్జుమా చేయించేవారు అప్పటి ఉస్మాన్ అలీ పాదుషా. తెలుగులోనూ అదే విధంగా చేయించాలి. అలా అని ఛాందసం వద్దు. రైల్వే స్టేషన్, బస్ లాంటి వాటిని మినహాయించవచ్చు. రైల్వే స్టేషన్‌ను ధూమశకటము నిలుపు స్థలం అంటే ఎవరికీ అర్థం కాదు. అసలు అధికారిక కార్యకలాపాలన్నీ తెలుగులోనే కొనసాగాలి. అర్జీలు, దరఖాస్తులన్నీ తెలుగులో ఉంటేనే తీసుకుంటాం అని శాసనసభలో చట్టం చేస్తేగాని మార్పు రాదేమో. హైదరాబాద్ మొదలు మారుమూల గ్రామం వరకు అన్ని శాఖల ఉత్తర ప్రత్యుత్తరాలు, లేఖలు, ఉత్తర్వులు ఇలా అన్నీ కూడా తెలుగులో కొనసాగాలి. తెలుగుకు మంచి రోజులు రావాలంటే ముందుగా తల్లిదండ్రులు, తరువాత ఉపాధ్యాయుల కృషి ఎంతో అవసరం. అదే ముఖ్యం కూడా. పిల్లలు అమ్మా, నాన్న అని పిలిస్తే ఎంతో సంతోషంగా మృదుమధురంగా ప్రేమాభిమానాలతో పిలిచినట్లుగా ఉంటుంది. మమ్మీ.. డాడీ అంటే ఎలా ఉంటుంది? ఉపాధ్యాయుల చదువు కూడా తెలుగు ప్రాధాన్యంగా ఉండటం లేదు. ప్రాథమిక పాఠశాల నుంచి డిగ్రీ, పీజీ వరకు 'పెద్దబాల శిక్ష' ఉంచాల్సిందే. దీని గురించి ఎందరికి తెలుసు? అందులో ఏముందనేది ఎంతమందికి అవగాహన ఉంది? అందులో తెలుగు భాష ఉంది. తెలియని సంగతులున్నాయి. వీటితోపాటు నీతిశాస్త్రం లాంటి పాఠ్యాంశాలను కూడా బోధించాలి. గతంలో ఇదొక పాఠ్యాంశంగా ఉండేది. దీనివల్ల పిల్లలకు మర్యాద తెలుస్తుంది. పెద్దల పట్ల



# మనసులో నుంచి రావాలి..!

తెలుగు భాష భ్రష్టుపట్టిపోతోందన్న బాధ నాకూ ఉంది. కాలం తెచ్చిన మార్పు ప్రభావంతోనే ఇలా జరిగిందా అనే అనుమానం నాలోనూ కలిగింది. అది ఎంత వరకు వాస్తవమో తెలుసుకునే ప్రయత్నం చేశాను. మన పొరుగు దేశమైన చైనాలో ఆంగ్లం వచ్చినవారు, రాని వారు కూడా వారి మాతృభాషలోనే మాట్లాడతారు గానీ ఇతర భాషల్లో కాదు. పొరుగు రాష్ట్రాలైన తమిళనాడు, కర్ణాటకలో వాళ్ల భాషపై చూపుతున్న అభిమానం గురించి విన్న దాన్ని బట్టి అలాంటి అభిమానం మనలో చాలా మందికి ఎందుకు లేదా అనే బాధ కలుగుతోంది. తెలుగువారి మొదటి అవలక్షణం అనైక్యత. ఇక రెండోది మనకు హక్కుల గురించి కావాలి గానీ బాధ్యతలు అక్కర్లేదు. ఇవి భాష విషయంలోనూ వర్తిస్తాయి. ప్రపంచీకరణ వల్ల భాషకు ఈ దుస్థితి వచ్చిందని చాలా మంది అభిప్రాయపడుతుంటారు. కానీ దీనిలో ప్రపంచీకరణ తప్పేముందండీ? మన భాషని మాట్లాడవద్దని వారేం మనకు చెప్పలేదే? గురజాడ అప్పారావు, గిడుగు రామ్మూర్తి వంటి భాషోద్యమకారులు వ్యావహారిక పదజాలం కోసం బాటలు వేశారు. ఒకరకంగా చెప్పాలంటే గ్రాంథిక భాష అంతరించిపోయేలా చేయగలిగారు. మారుమూల గ్రామాల్లో ఉన్నవారు సైతం కథలు, కవితలు రాయగలుగుతున్నారంటే అది వ్యావహారిక భాష వల్లనే. గురజాడ, గిడుగు వంటి వారు చేసిన ప్రయత్నానికి కొనసాగింపు నిరంతరం ఉండాలి. ఆధునిక సాంకేతిక రంగంలో వాడుకకు తగిన పదాలు తెలుగులో లేవంటూ మన భాషని చిన్నచూపు చూడటం ఎంత మాత్రం తగదు. ఈ దిశగా ఇప్పుడు గొప్ప విప్లవం జరుగుతోంది. తెలుగు భాష అంతరించిపోతుందనే వాదనను నేను నమ్మను. కాకపోతే భ్రష్టుపడుతుందనడం వాస్తవం. అదీ మనలో ఉన్న ఓ 30శాతం మంది వల్లనే. మిగిలిన 70శాతం మంది ప్రజలూ వీరి స్థాయికి చేరుకుంటే అంటే వారి జీవిత స్థాయికి వారు చేరిపోతే తప్ప భాష అంతరించిపోవడమనేది జరగదు.



### ప్రసార మాధ్యమాలదే ప్రముఖ పాత్ర

పిల్లవాడు బడిలో మహా అయితే రోజులో అయిదారు గంటలు ఉంటాడు. మిగిలిన సమయంలో ఎక్కువ సేపు టీవీ ముందు కూర్చొంటాడు. అందువల్ల అందులో వచ్చే భాష చాలా ప్రభావం చూపుతుంది. ఆ భాష ఎలా ఉంటుందో అందరికీ తెలిసిందే. ప్రసార మాధ్యమాలు, వాటి అధినేతలు బలంగా పూనుకుంటే తప్పిస్తే భాషాపతనం ఆగదు. విలేకరులు, ఉప సంపాదకులు పూనుకున్నా భాష బతికిపోతుంది. రూ.కోట్లు ఖర్చు చేసి జిల్లాకు ఒకరిని నియమించి, ఏడాదికోసారి మొక్కుబడిగా సమావేశాలు నిర్వహించడం వల్ల భాషకు ప్రయోజనం ఒనగూరదు. 5 నిమిషాల పాటు ఆంగ్లం పదం వాడకుండా తెలుగులో ప్రసంగించమనే తరహా పోటీల వల్లా పెద్ద ప్రయోజనం ఉండదు. ఆ 5 నిమిషాలు అయిపోగానే మళ్లీ మామూలే కదా. భాషకు మేలు జరగాలనే భావన మనసులో నుంచి రావాలి.

- కాళీపట్నం రామారావు

వినయవిధేయతలు, ఏది మంచి, ఏది చెడు అనేది అర్థం చేసుకోగలుగుతారు. నేటి సినిమాల్లో తెలుగు మాస్టారును ఎన్ని విధాలుగా ఏడిపిస్తారో అందరం చూస్తూనే ఉన్నాం. ఇది మన దౌర్భాగ్యం. తెలుగు బోధించే మాస్టారు వచ్చాడంటేనే ఇకిలింతలు, హేళనలు, నవ్వులు మొదలవుతాయి. దీనిపై సెన్సార్ బోర్డు ఏం చేస్తోందో తెలియదు. శాసనసభే ఇలాంటి వాటిపై నిర్ణయం తీసుకోవాలి. మన భాషను బోధించే ఉపాధ్యాయులను కించపరిచే విధంగా చిత్రాలుంటే ఆ ప్రభావం భాషపై పడుతుంది కదా. ప్రతి ఒక్కరూ తమ వంతుగా వారి వారి స్థాయిల్లోనే మాతృభాష అభివృద్ధికి కృషి చేయాలి. ఇతర భాషల్లోని ప్రతి పుస్తకాన్నీ తెలుగులోకి తర్జుమా చేయాలి. ఇతర భాషా పదాలకు సమానార్థకాలను వెతకాలి. కనుగొనాలి. ప్రభుత్వంలోని ఉన్నతస్థాయి కార్యకలాపాల్లో తెలుగును ప్రవేశపెడితే మెల్లగా గ్రామాల స్థాయికి చేరుతుంది. ఇందుకు ప్రతి ఒక్కరూ నడుం బిగించాలి. అలాగే గ్రామస్థాయిల్లో అర్జీలు, దరఖాస్తులు, రాత వ్యవహారాలన్నీ తెలుగులో జరిగేలా చట్టాల్ని పటిష్ఠంగా అమలు చేయాలి. ఇందుకోసం ప్రత్యేకంగా ఒక శాఖను ఏర్పాటు చేయాలి. అప్పుడే తెలుగు భాష తన పూర్వ వైభవాన్ని సంతరించుకుంటుంది. ముందు తరాలకు అందుతుంది..!

- పద్మశ్రీ నేరెళ్ల వేణుమాధవ్

### చెప్పుకోండి చూద్దాం

కొరవి గోపరాజు రచనల్లో వ్యంగ్యమే కాదు తెలియని బంధకవిత్వము ఉంది. విక్రమార్కుని వద్దకు ఒక పేద బ్రాహ్మణుడు కుమార్తెను తీసుకొచ్చి సీసపద్యంతో గోడు విన్నవించుకున్నాడు. అదేంటంటే పద్యంలో అర్ధపాదంలో మొదటి అక్షరాలను చదువుకుంటే ఒక ప్రశ్న వస్తోంది. ఆ బ్రాహ్మణుని చతురతకు సంతోషించి విక్రమార్కుడు పరిష్కారం చూపించాడు! (సింహాసన ద్వాత్రింశిక 7-75)

రాజ్యంబు వదలక రసికత్వమెడలక  
జయశీల ముదుగకనయము చెడక  
దీనుల జంపక దేశంబు నొంపక  
నిజముజ్జగింపక నేర్పుగలిగి  
విప్రుల జుట్టాల నెన్ను సొచ్చినయట్టి  
వారిని గొల్చిన వారి ప్రజల  
హర్షంబుతో గాచియన్యాయ  
ముదుపుచు మున్ను జెప్పిన రీతి జెన్ను మీరి  
చేతలొండులేక పాత్రల విడువక  
యశము కలిమి తమకు వశముగాగ  
వసుధ యేలు రాజవర్గంబులో నన  
య్యాది విష్ణుమూర్తి వంద్రు నిన్ను

# వాడుకలో



# వ్యాకరణంలో



తెలుగు భాష విస్తరణకు సంస్కృత పదాల సాయం తీసుకుంటున్నాం. అవసరానికి అనుగుణంగా మార్చుకుని వాడుకుంటున్నాం. సంస్కృత భాషాపదాలను తెలుగులో సమానస్థాయిలో వాడుతున్నప్పుడు ఆ భాషా నియమాల్ని మాత్రం ఉల్లంఘిస్తున్నాం. వాడుకలో చలామణిలో ఉన్న, కొన్ని అప్రయోగాలు చూద్దాం. భాషపై అవగాహన పెంచడానికే ఈ ప్రయత్నం...

### సిరిసంపదలు

సిరి అన్నా సంపద అన్నా ఒకటే. రెండు సమానార్థంగల శబ్దాలను కలిపి ప్రయోగించటం అంటే రెండుసార్లు చెప్పటమే. సిరి సంపత్తులు అనే పదప్రయోగం కూడా ఇలాంటిదే.

### ధారావాహికం

తెలుగువారికి చిరపరిచితమైన ధారావాహికం పత్రికా సీరియల్, టీవీ సీరియల్‌కు వాడుతున్నాం. 'వాహక' శబ్దానికి 'వాహిక' స్త్రీలింగ రూపం. స్త్రీలింగరూపాల మీద అమహన్నపుంసకాల మీదచేర్చే 'ము' ప్రత్యయం రాదు. కనుక 'ధారావాహికం' వ్యాకరణ విరుద్ధం. ధారావాహిక అంటే సరిపోతుంది. 'ము' ప్రత్యయం చేర్చి వాడదలిస్తే 'ధారావాహికము' అనాలి.

### నటప్రపూర్ణ

వెండితెర, రంగస్థలాల మీద నటప్రపూర్ణ బిరుదు తరచూ వింటుంటాం. నటనలో ప్రపూర్ణుడు అర్థంలో దీన్ని ఉపయోగిస్తారే కానీ నిజానికి ఆ అర్థం రాదు. నట శబ్దానికి నటుడు/నటులు అనే గానీ నటన అనే అర్థం లేదు. ఆ లెక్కన నటప్రపూర్ణ అంటే నటులతో నిండినవాడే తప్ప నటనలో ప్రపూర్ణుడు అని కాదు. ఆ అర్థం రావాలంటే నటన ప్రపూర్ణుడని అనాలి.

### జగదాంబ

జగత్, అంబ అనేవి ఇందులోని పదాలు. వీటిని కలిపినప్పుడు జగదంబ అవుతుంది గానీ జగదాంబ అవదు. మాణిక్యాంబ, శారదాంబ మొదలైన శబ్దాలను అనుసరించి ఇది వాడుకలోకి వచ్చి ఉంటుంది. కానీ అది వేరు, ఇది వేరు.

### వాద్యకారిణి

వాద్యవిద్యలో నిపుణురాలు అనడానికి వాద్యకారిణి అని వాడుతుంటారు. కానీ ఈ పదం ఆ అర్థాన్ని ఇవ్వదు. చిత్రకారిణి, శిల్పకారిణి మొదలైన శబ్దాలు ఉన్నాయి. వీటికి అర్థం - చిత్రాలను సిద్ధం చేసేది, శిల్పాలను సిద్ధం చేసేది అని. అలాగే 'వాద్యకారిణి' అంటే వాద్యాలను సిద్ధం చేసేది అనే అర్థమే వస్తుంది తప్ప వాద్యవిద్యలో నిపుణురాలు అని రాదు. ఆ అర్థం కావాలంటే వాద్య విదుషి అనాలి.

### రైతాంగం

రైతుజనం అర్థంలో ఇటీవల బాగా వాడుకలోకి వచ్చింది. రాజకీయ ప్రసంగాల్లో ఊదరగొట్టే పదమిది. ఇందులో రైతు, అంగం అనే పదాలున్నాయి. 'రయ్యత్' అనే అరబిక్ పదం నుంచి 'రైతు' వచ్చింది. అంగం అనేది సంస్కృత పదం. ఈ రెంటికీ సంధి చేసినప్పుడు తెలుగు సంధి వస్తే రైతంగం అని, సంస్కృతం సంధి వస్తే రైత్వంగం అని కావాలి. అయితే దీనికి భిన్నంగా రైతాంగం అనే విలక్షణమైన రూపం ఏర్పడింది.

### ప్రశ్నాపత్రం

విద్యార్థిలోకంలో బాగా వాడుకలో ఉన్నపదం. కానీ ఇది వ్యాకరణ సమ్మతం కాదు. ఎందుకంటే సంస్కృతంలో ప్రశ్న శబ్దం హ్రస్వ అకారాంత శబ్దం. దీనికి దీర్ఘ అకారాంతం లేదు. కనుక దీన్ని 'ప్రశ్న పత్రం' అని మాత్రమే అనాలి.

## సపరివార సమేతంగా

'బంధుమిత్ర సపరివార సమేతంగా వివాహానికి వచ్చి మమ్మానందింపజేయగలరు...' ఈ వాక్యం శుభలేఖల్లో కనిపిస్తుంటుంది. సపరివార సమేతంగా అనేది తప్పు. ఇందులోని సపరివారం, సమేతం రెండు పదాలు ఒకే అర్థం కలిగినవి. రెండింటి అర్థం కలిపి అనే. అలాంటప్పుడు సపరివారంగా అనో, పరివారసమేతంగా అనో అంటే సరిపోతుంది... బంధుమిత్ర సపరివార సమేతంగా అనే సమాసాన్ని సబంధుమిత్ర పరివారంగా అనో, బంధుమిత్ర పరివారసమేతంగా అనో అంటే దోషం ఉండదు.

## వాదన

వాదించటమనే అర్థంలో బాగా వాడుకలో ఉన్న పదం. దీని అసలు అర్థం శబ్దం కలిగించటమే. ఉదాహరణకు: వీణావాదన, మృదంగ వాదన. ఇలాగన్నమాట. వాదించాలి అనే అర్థం రావాలంటే వాదం అని వాడితే సరిపోతుంది.

## మహిళాబాధితులు

మహిళా బాధితులకు సత్వర న్యాయం అని తరచూ ఉపయోగిస్తుంటాం. బాధాతప్తులైన స్త్రీలు అనేది మన భావం... కానీ దీనికి ఆ అర్థం రాదు. మహిళలచే బాధింపబడిన వాళ్లు అనే అర్థం వస్తుంది. బాధలకు గురైన మహిళలు అనే అర్థం రావాలంటే 'బాధిత మహిళలకు' అనాలి.

## ఇష్టాగోష్ఠి

ఇష్టులతో గోష్ఠి లేక ఇష్టమైన గోష్ఠి అనే అర్థంలో ఈ పదం వాడుతున్నాం. ఇందులో ఇష్ట, గోష్ఠి అనే రెండు పదాలు ఉన్నాయి. వీటిని కలిపి చెప్పాల్సివచ్చినప్పుడు 'ఇష్టగోష్ఠి' అవుతుంది తప్ప ఇష్టాగోష్ఠి అవదు.

## దృశ్యశ్రవణ విధానం

ఆడియో - విజువల్ అనే ఆంగ్ల పదానికి సమానార్థకంగా తెలుగులో వాడుతున్న సంస్కృత పదం. దృశ్యం అంటే చూడటానికి యోగ్యమయింది అని, శ్రవణం అంటే వినటం అని అర్థం. అయితే ఆంగ్లపదంలో ఉన్నట్టుగా దృశ్యశ్రవణ అనే పదంలో ఏక రూపత కనిపించదు... కాబట్టి దర్శన శ్రవణ విధానమనో, దృశ్యశ్రవ్య విధానమనో వాడటం సవ్యంగా ఉంటుంది.

## అహోరాత్రుళ్లు

రాత్రింబవళ్లు అని అర్థం. సంస్కృత భాషలో అహశ్చ రాత్రిశ్చ అనే ద్వంద్వ సమాసంలో అహోరాత్రి శబ్దంపై 'అ' ప్రత్యయం వచ్చి అహోరాత్ర అవుతుంది. దీన్ని తెలుగులో అదే అర్థంలో వాడాలంటే అహోరాత్రం అనాలి. అంటే అకారంతో ముగియాలి. అంతే తప్ప అహోరాత్రులు లేదా అహోరాత్రుళ్లు అని ఇకారాంత రూపం ఏర్పడదు.

## అక్షింతలు

పెళ్లి మొదలైన శుభకార్యాలలో వాడే పసుపు లేక కుంకుమ కలిపిన బియ్యపు గింజలను అక్షింతలు అని పిలుస్తుంటాం. అక్షతాః అనే సంస్కృత పదం దీనికి మూలం. దీన్ని తెలుగులో అదే అర్థంలో వాడాలంటే... అక్షతలు అనాలి.

## పతాకం

జాతీయ పతాకం మొదలైన పద బంధాల్లో ఈ పదం బాగా వాడుకలో ఉంది. సంస్కృతంలో పతాకశబ్దం అకారాంత స్త్రీలింగం. దీన్ని అదే భావంతో తెలుగులోకి తెచ్చుకున్నప్పుడు పతాక అవుతుంది తప్ప పతాకం అవదు.

## తెలుగువెలుగుల మూర్తి నిక్షిప్తప్రాంగణం

హైదరాబాద్‌లో టాంక్‌బండ్‌పైన ప్రతిష్ఠించిన తెలుగు మూర్తుల ప్రాంగణానికి తెలుగు వెలుగుల మూర్తి నిక్షిప్త ప్రాంగణం అని నామకరణం చేశారు. ఇందులో తెలుగు వెలుగులు అనేది తెలుగు సమాసం. 'మూర్తి నిక్షిప్త ప్రాంగణం' సంస్కృత సమాసం. సంస్కృత భాషానియమాల ప్రకారం మూర్తులే ఆ ప్రాంగణాన్ని అక్కడ ఉంచారనే అర్థం వస్తుంది. కానీ అసలు రావాల్సిన అర్థం అది కాదు గదా! మూర్తులను ప్రతిష్ఠించిన ప్రాంగణం అని రావాలి. అంటే తెలుగు వెలుగుల మూర్తి ప్రాంగణం అని రాస్తే ఏ చిక్కూ ఉండదు.

## షష్ఠిపూర్తి

అరవై సంవత్సరాలు నిండటం అనే అర్థంలో ఈ పదం ఎక్కువగా వాడుతుంటారుగానీ.. అది పొరపాటు సంస్కృతంలో షష్టి, షష్ఠి అనే రెండు రూపాలున్నాయి. షష్టి అంటే అరవై అని, షష్ఠి అంటే ఆరు అని అర్థం. కాబట్టి అరవై సంవత్సరాలు నిండటం అనే అర్థంలో 'షష్టిపూర్తి' అనే అనాలి.



**ఆచార్య రవ్వా శ్రీహరి**
మాజీ ఉప కులపతి,
ద్రవిడ విశ్వవిద్యాలయం,
చిత్తూరు. 77026 73444

# ఈ గాలి...
# ఈ నేల...!



**ఏ జాతి చరిత్ర అయినా మట్టి చుట్టూ పరిభ్ర మిస్తుంది. అందుకే మట్టికంటే విలువైన అద్భుత మైన వస్తువు ఈ లోకంలో మరొకటిలేదు. ఈ మట్టి అందరిదీ- దున్నేవాళ్లూ.. దూసేవాళ్లూ.. కొన్నవాళ్లూ.. ఉన్నవాళ్లూ అది తమకే సొంత మని భావిస్తారు.. భాగిస్తారు.. భోగిస్తారు...! అలాగే భాష కూడా. అది అందరిదీ అయినా కొందరికి మాత్రమే హక్కుభుక్తమౌతుంది. మట్టినే నమ్ముకున్న కరకు చేతులూ మాట్లా డ్తాయి. వాటి భాషవేరు.. ఘోషవేరు.. యాస వేరు...!!**

ప్రతి భాషకూ రెండు పార్శ్వాలుంటాయి. మనిషి తన మనుగడ కోసం ఒకరితో ఒకరు భావాల్ని పంచుకోడానికొకటి. యుగయుగాల చరిత్రనూ సంస్కృతినీ మన ముందు అందంగా నిలపడం కోసం మరొకటి. మాతృభాష- మానవుల ఊహాశక్తికీ, భావవ్యక్తీక రణకీ నూతన సృజనకీ ఆధారమైంది. దీని ద్వారా ఎంత పరిజ్ఞానం సంపాదిస్తే- అంత సులువుగా లోతుగా పరాయి భాషను సొంతం చేసుకోవడం సుసాధ్యమౌతుంది.

ఏ భాషాభివృద్ధికైనా- గ్రాంథికం, వ్యావహా రికం, మాండలికం, అనేవి మూలస్తంభాలు. ప్రజలు తమ దినచర్యల్లో వినియోగించేదే 'వ్యావ హారభాష.' దీన్ని 'ప్రజల భాష' అని కూడా అంటారు. ఈ వ్యావహార భాషకీ, గ్రామ్యభాషకి తేడా వుంది.

ఒకే భాషకు ప్రజల వ్యవహారాల్లోనూ, పదా ల్లోనూ, వాటి పలుకుబడుల్లోనూ, ప్రత్యయా ల్లోనూ, పదాల అర్థాల్లోనూ, వ్యాకరణంలోనూ అనేక భేదాలుంటాయి. భాషకున్న ఇలాటి భేదా లతో నిర్దేశిత ప్రాంతంలో జనులు మాట్లాడే భాష 'మాండలిక భాష'. దీనికి 'ఉపభాష' 'ప్రాదేశికభాష' 'ప్రాంతీయభాష' అని పర్యాయప దాలు.

మన ఆంధ్రదేశాన్ని- పూర్వమండలం (శ్రీకా కుళం-విజయనగరం విశాఖజిల్లాలు) మధ్యమం డలం (ఉభయగోదావరి - కృష్ణ, గుంటూరు జిల్లాలు) దక్షిణమండలం (తెలంగాణ జిల్లాలు) ఉత్తరమండలం (రాయలసీమ-ప్రకాశం-నె ల్లూరు) నాలుగు ప్రధాన మండలాలుగా ఊహిం చుకుంటే- ఎన్నో మాండలిక పద భేదాలు కనిపి స్తాయి... వినిపిస్తాయి....!!

పూర్వ, ఉత్తరమండలవాసులు 'నాగలి' అంటే- మధ్య మండల వాసులు 'నాగలి-నాగేలి' అంటారు. అదే దక్షిణమండల వాసులు 'మడక' అంటారు.

పూర్వమండలం వారు 'గునపం' అంటే- ఉత్తరమండలం వారు 'గడ్డపార' అంటారు. మధ్యమండలం వారు 'గడ్డపార-గడ్డపలుగు' అంటే, దక్షిణమండలంవారు 'గడ్డపార-గడారు' అంటారు.

పూర్వమండలం వారు 'గొలుసు' అంటే- మధ్యమండలంవారు 'గొళ్లెం' అని, దక్షిణమండ లంవారు 'చిలుకు' అని, ఉత్తరమండలంవారు 'గొండ్లెం' అని అంటారు.

పూర్వ, ఉత్తర మండలం వాసులు 'రాట్నం' అని అంటుంటే మధ్యమండలవాసులు 'రాట' అని, దక్షిణం మండలవాసులు 'రాటం' అని అంటుంటారు.

ప్రస్తుత సంక్లిష్ట జీవన - సామాజిక - జా తీయ - అంతర్జాతీయ పరిస్థితుల్లో ప్రతిభాష లోనూ ఎన్నో కొత్త పదాలు వచ్చి పడుతు న్నాయి. సాంకేతిక-వైజ్ఞానిక-వైద్యాది రంగాల విషయాల్ని సూక్ష్మదృష్టిలో దర్శిస్తే స్పర్శిస్తే ఈ విషయం తేటతెల్లమౌతుంది.



సామాన్య జన వ్యవహారంలోది 'భాష' కాగా- నిర్దిష్టశాస్త్ర సాంకేతికాది రంగాల్లోని ప్రత్యేక పదజాలం 'పరిభాష' అవుతుంది.

మనం కోల్పోయిన ఎంతో పద సంపద నేటికీ జానపదాల్లో, పల్లెవాసుల్లో, వృత్తిదారుల మధ్యనే పదిలంగా వుంది. రెక్క (సిగ్నల్) బుగ్గ (బల్బు) పైదారులు (ఫ్లైఓవర్) తవ్వోడ (డ్రెడ్జర్) మేలరి (శ్రేయోభిలాషి) వంటి పదాల్నెన్నో ఉదాహరించవచ్చు. కాలగతిలో కొన్ని ధ్వనులు భాష నుంచి తొలగిపోతాయి. ఎన్నో కొత్తగా వచ్చి చేరిపోతాయి. దేశ కాల పాత్రోచితంగా శబ్ద స్వరూపంలో అర్థంలో మార్పులు వచ్చాయి.

ఉభయగోదావరి ప్రాంతంలో 'ఆబ' చాలా ప్రచారం గల పదం. దీనికి రెండర్థాలు. అభాశబ్దభవం - 'కంటిపాప' ఒక అర్థమైతే- 'అత్యాశ' అని రెండోది. ఆబపోతు అంటే ఎక్కువగా తినే పశువు. ఆంబోతును ఆబపోతు, ఆఁబోతు అనేది ఇక్కడ ప్రాంతీయుల వ్యవహారిక పదం.

అలాగే 'డక్కామొక్కీలు' పదం కూడా- 'డక్కా' అంటే కయ్యం, కష్టం, హాని, చెరుపు అని 'తెలుగు వ్యుత్పత్తికోశం'లో అర్థాలు. రెండో 'మొక్కి'కి అర్థశూన్యం. మొత్తానికి ఈ పదం ఎదురు దెబ్బలు, ఇబ్బందులు అనే అర్థాల్లో మాండలికమై ప్రజల గుండెల్లో ప్రతిధ్వనిస్తోంది.

అలాగే 'కలికి'. ఇది అచ్చతెనుగు పదం. దిట్టతనం (నేర్పు)గల స్త్రీ. ఆంధ్రభాషార్ణవంలో 'కొండతలఈక' అని అర్థం. మొత్తమ్మీద 'మేలైన మెలత' అని ఆయా గ్రామ్యప్రాంతాల్లో పరివ్యాప్తమైన పదమిది.

అదేవిధంగా- 'లొల్లి' అచ్చతెలుగుమాట. విశేషం- తరచు, ఘనం-ఎక్కువ అని అర్థాలు. తెలంగాణాలో ఎక్కువ వ్యాప్తిలో ఉన్న ఈ మాటను, దీనికున్న అర్థాలనూ తెలుగు వ్యుత్పత్తి కోశం గుర్తించింది-రంతు-ధ్వని-అల్లరి అని వ్యవహారంలో ఉంది.

క్రీస్తుపూర్వం-ప్రాకృత భాషలో హాలుని- 'గాథాసప్తశతి'లో గోదావరి తీర ప్రస్తావనలో తెలుగు గ్రామీణ జీవన విధాన వర్ణితంలో 'అత్త, అవ్వ, తుప్ప, పాడి పొట్టం' వంటి అనేక తెలుగు పదాలున్నాయి.

మన రాష్ట్రంలోనే అనేక మాండలిక భేదాలున్నాయి. కోస్తాజిల్లాల్లో ఒక రకమైన భాష. ఇందులో తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలో మరోరకంగా మాట్లాడతారు. కృష్ణా, గుంటూరు, ప్రకాశం జిల్లాల్లో మాట్లాడే భాష ఒకరకమైతే - నెల్లూరు, చిత్తూరుల్లో మరో రకం. రాయలసీమ, తెలంగాణ ప్రాంతాల్లోని ఒక జిల్లాకు మరొక జిల్లాకు మధ్య మాట్లాడే భాషలో ఎంతో తేడా.

నిజానికి భాషలు పెరిగి, ముసలివై చనిపోవు. సమాజంలో ఆధిక్యత చలాయిస్తున్న వర్గానికి ఎపుడైతే ఆ భాష పనికిరాదో అప్పుడు అది తన ఉనికిని పోగొట్టుకుంటుంది. వివిధ జాతుల నుంచి- విభిన్న మాండలికాల నుంచి అవసరమైన పదాలనూ పదబంధాలను తనలో ఇముడ్చుకుంటూ సంపద్వంతమయ్యేదే జీవభాష కాగలదు. నిజానికి - మట్టిలోని ధాతువులే మనిషి శ్వాసలోనూ, భాషలోనూ పరిమళిస్తాయి.






**ఎస్.ఆర్.భల్లం**
సాహితీ విమర్శకులు,
తాడేపల్లిగూడెం,
పశ్చిమగోదావరి.
98854 42642


## మేటి కవి

పల్లిపాలెంలో మధునాపంతుల వారి సన్మాన సందర్భంగా జరిగిన ఉదంతం అది. ఫొటోగ్రాఫర్ ఆకాశం, సూర్యుడు, వెలుతురు ఇంకా పరిసరాలు చూసుకుంటూ ఫొటో బాగా రావడానికి అనువుగా ఉండే ప్రదేశం కోసం వెతుకుతున్నాడు. ఆఖరుకు "ఇలా రండయ్యా, గడ్డిమేటు దగ్గర నుంచుంటే బావుంటుంది" అన్నాడట మధునాపంతుల వారితో. "బాగా చెప్పావయ్యా. అవును ఇక్కడే బాగుంటుంది 'మేటికవి' అనుకోవచ్చు" అని చిరునవ్వుతో అన్నారట శాస్త్రిగారు.



# కూర్చున్న కొమ్మ

సాగత ద్వారాలు... మామిడాకుల తోరణాలు... బంతిపూల దండలు... అరటి బోదెలు... వాటికి వేలాడే గెలలు... కొబ్బరి మట్టలు... కొబ్బరాకు ఈనెలతో బూరలు చుట్టి ఊదే పిల్లలు... వాళ్లను అదిలించే పెద్దలు!

చెన్నాయపాలెం అంతటా పండగ వాతావరణం! ఆ కుగ్రామం వీధులన్నీ మోటారు బళ్లతో నిండిపోయాయి. ముఖ్యంగా ఉన్నత పాఠశాల! అందులో చదువుకున్న విద్యార్థుల సమావేశం ఇవాళ. అమెరికా, కెనడా, ఇంగ్లండు, జపాన్, ఆస్ట్రేలియా, న్యూజిలాండు... అన్ని దేశాల్లోనూ ఉన్నారు ఆ పాఠశాల పూర్వ విద్యార్థులు.

వెంకటప్పయ్య నాయకత్వంలో ఈ సమావేశం జరుగుతోంది. చిన్నప్పుడు అమ్మమ్మగారింట్లో ఉండి ఈ బళ్లోనే చదువుకున్నాడు. ఇప్పుడు అమెరికాలో వైద్యుడిగా రెండు చేతులా సంపాదిస్తున్నాడు. పోయినేడాది వచ్చినప్పుడు, తాను చదువుకున్న బడిని చూద్దామని అక్కడకు వెళ్లాడు. బడి దుస్థితి చూసి వెంకటప్పయ్య కళ్లు చెమ్మగిల్లాయి. పై కప్పు పెచ్చులు ఊడి, ఊచలు బయటపడ్డాయి. పైన మొలిచిన మర్రిచెట్ల వేళ్లు కిటికీల్లోంచి గదుల్లోకి తొంగి చూస్తున్నాయి. ఆట మైదానమంతా ముళ్లచెట్లు. తరగతి గదుల్లో విరిగిన బల్లలు.

తానిప్పుడు కోట్లు సంపాదిస్తున్నాడు. తనొక్కడే ఏంటి? ఈ బళ్లో చదువుకున్న అప్పారావు, వెంకట్రావు, కృష్ణయ్య, నారాయణ... అందరూ మంచి స్థితిలోనే ఉన్నారు. అందరూ తలుచుకుంటే... బడిని బాగుచేయడం ఎంతసేపు? వంద రోజుల్లోపే ఈ స్థలంలో బ్రహ్మాండమైన భవనం ప్రత్యక్షమవుతుంది. లేడికి లేచిందే పరుగన్నట్టు వెంకటప్పయ్య వెంటనే కార్యరంగంలో దూకాడు. అన్ని దేశాల్లో ఉన్న మిత్రులకు అంతర్జాలంలో సందేశం పంపాడు. అదీ కారణం!

పసితనంలో పాఠాలు నేర్చుకున్న బడిలో వాళ్లంతా సమావేశమయ్యారు. అభిప్రాయాలను కలబోసుకున్నారు. వాళ్ల మాటల్లో అప్పుడప్పుడూ తెలుగు పదాలు కూడా దొర్లుతున్నాయి. మళ్లా అవి ఎక్కడ అర్థం కావేమో అని వెంటనే ఆంగ్లంలో వివరిస్తున్నారు. సాయంత్రం ముగింపు సమావేశం.

ఈ కార్యక్రమానికి మూలకారకుడు వెంకటప్పయ్యే గదా! అందుకే చొరవతీసుకుని అందరి కంటే మూడు ముక్కలు ఎక్కువ చెప్పాడు. వాళ్లకంటే నాలుగు తెలుగు ముక్కలు ఎక్కువే పడ్డాయి.

"...మన స్కూలు డెవలప్ చెయ్యాలంటే... కేవలం బిల్డింగ్, ఫర్నిచర్ ఉంటే చాలదు. స్టూడెంట్స్‌కి కమ్యూనికేషన్ స్కిల్స్ ముఖ్యం... ఐమీన్ వెరీ ఇంపార్టెంట్! ... ఇటీజ్ ఎ మస్ట్ నౌ ఎడేస్! ఇంగ్లీష్ వస్తేనే కమ్యూనికేషన్ స్కిల్స్ పెరుగుతాయి. ఇంగ్లీష్ లేనిదే ఫ్యూచర్ లేదు! సో... ఫ్రెండ్స్! మన స్కూల్ని ఇంగ్లీష్ మీడియం స్కూల్‌గా మార్చేద్దాం! ఫ్రెండ్స్! వాటీజ్ యువర్ ఒపీనియన్ రిగార్డింగ్ దిస్ ఐడియా?" వెంకటప్పయ్య మిత్రులందరి కళ్లల్లోకీ గుచ్చిగుచ్చి చూస్తూ చెప్పాడు.

అందరూ "హియర్ హియర్! వావ్!! వాట్ ఎన్ ఐడియా! బ్రిలియంట్! షూర్ షూర్!!" అంటూ కరతాళ ధ్వనులతో తమ ఆమోదాన్ని తెలిపారు.

పులిహోర, చప్పిడి పప్పూ దప్పళం, గోంగూర పచ్చడి, బంగాళ దుంపల వేపుడు, గుమ్మడికాయ పులుసు, ఉలవచారు, సగ్గుబియ్యపు పరవాన్నం...

అమృతం ఎందుకు పనికొస్తుంది...

చిన్ననాటి రుచులు... జ్ఞాపకాలు!

అమ్మమ్మ చేతి వంటకం రుచి చూస్తూ వెంకటప్పయ్య భార్య జయవైపూ, కూతురు విజయవైపూ చూశాడు. వెంకటప్పయ్యది ప్రేమ వివాహం. జయది కోయంబత్తూరు. ఇక... విజయ పుట్టిందే అమెరికాలో! ఇలాంటి తిండి చూడటం ఇదే మొదలు! వెంకటప్పయ్య వాళ్లకి ఏది ఎలా తినాలో చెబుతూవుండగా, అమ్మమ్మ ముసిముసి నవ్వులు నవ్వుతూ కొసరి కొసరి వడ్డించింది.

భోజనాల తరవాత ఆరుబయట, నులక మంచంపై వెన్నెల్లో... పసి తనంలోని మధుర స్మృతులు మదిలో మెదులుతూ ఉండగా నిద్రలోకి జారుకున్నాడు వెంకటప్పయ్య.

ఉదయం అమ్మమ్మ వేడివేడిగా వేసి పెడుతున్న పెసరట్లు లాగించేస్తున్నాడు వెంకటప్పయ్య.

ట్రింగు ట్రింగున మోగింది 'దూరవాణి'.

కూతురు విజయ మాట్లాడుతున్నది.

"పాటి! టిప్పిడి ఇరుక్కింగ?" (అమ్మమ్మా! ఎలా వున్నావు)

"............."

"తాత! ఒడంబు నల్లా ఇరుక్కా?" (తాతయ్య ఆరోగ్యం బాగుందా)

"......."

"ఎన్న పండ్రింగ?" (ఏం చేస్తున్నారు)

"......."

విజయకి పదేళ్లుంటాయి. వాళ్ల అమ్మమ్మతో తమిళం ధారాళంగా మాట్లాడుతున్నది. ఆ పిల్లకు ఆంగ్లం ఎంత బాగా వచ్చో తమిళమూ అంతే!

"వాళ్లమ్మమ్మతో మాట్లాడుతోంది!" అన్నాడు మురిసిపోతూ వెంకటప్పయ్య తన అమ్మమ్మతో.

"అయితే అప్పిగా! నీ కూతురికి అసలు తెలుగే రాదంట్రా?"

"అమ్మమ్మా! నీ పిచ్చిగాని... తెలుగెట్లా వస్తదే! ఇంట్లో వాళ్లమ్మ అరవం నేర్పుతుంది! బయట ఇంగ్లీషు!"

"ఓరి దద్దమ్మా! తెలుగు పుటక పుట్టావు! అట్లా అనడానికి సిగ్గు లేదంట్రా? నీ పెళ్లాన్ని చూసైనా బుద్ధి తెచ్చుకోరా!"

అమ్మమ్మను ఇంత కోపంగా వెంకటప్పయ్య ఎప్పుడూ చూడలేదు.

"ఏంటి నువ్వనేది?"

"ఏంటా? చెబుతా విను! నీ భార్య చక్కగా తన మాతృభాష కూతురికి నేర్పింది! అందుకే అది అంతబాగా అరవం మాట్లాడుతోంది. తెలుగు రాకపోతే నీ వాళ్లందరికీ అది దూరమైపోయినట్లే గదరా సన్నాసి!"

> **తెలుగు భాష ఔన్నత్యం**
>
> అన్యభాషలలేని అవధాన ప్రక్రియ
> కనువైనదొక్కటే ఆంధ్రభాష
> పౌరాణికములైన పద్య నాటకముల
> ప్రేక్షకావళిమెచ్చు విమల భాష
> ఆత్మాభిమానులై ఆంగ్లేయ ప్రభువులు
> అభ్యసించినయట్టి ఆంధ్రభాష
> ప్రాకృతభాషతో వారసత్వముగల్గి
> తేనెలొల్కెడు భాష తెలుగు భాష
>
> నిండు పదజాల స్పష్టత నియతిగల్గి,
> సరళముగ పల్కవీలగు సరసభాష
> భావమధురిమ గల్గిన పద్యకవిత
> తెలుగు భాషకే పరమయి వెలుగుచుండె
>
> -గన్నమనేని చెంద్రాయుడు, పోట్లదుర్తి,
> కడప, 94416 37058.

వెంకటప్పయ్యకి నిన్న తాను 'కమ్యూనికేషన్ స్కిల్స్'ని గూర్చి దంచిన ఉపన్యాసం గుర్తుకొచ్చింది.

మాతృభాష రాకపోతే తన కూతురు తన వాళ్లకు దూరమైపోవడం ఖాయం గదా! ముందు ఈ 'నేర్పరితనం' లేకుండా ఏ 'స్కిల్స్' ఉండి ఏం ప్రయోజనం?...

"ఏంట్రా... నువ్వు బళ్లో నిన్న ఏందో వాగావంట?"

"అమ్మమ్మా! నీవన్నీ వెనకటి కాలపు ఆలోచనలు! ఇంగ్లీషు లేకపోతే ఇవాళ ప్రపంచమే నడవదు తెలుసా?"





కథ

"తాచెడిన కోతి వనమెల్లా చెరిచెరా అన్నట్టుంది నీ వాలకం! ఏంట్రా నీ ఇంగిలిపీసు గొప్పదనం?"

"సైన్సు, ఇంజినీరింగ్, టెక్నాలజీ, హిస్టరీ, ఆర్ట్స్, ఫిలాసఫీ, ఎకనామిక్స్, కామర్స్... ఏదైనా సరే... నాలెడ్జి అంతా ఇంగ్లీషులోనే వుంది!"

"ఏడిశావ్! చదవేస్తే వున్నమతి పోయిందంట! నువ్వు ఈ బడిలో చదువుకొని గొప్పస్థాయికి వచ్చావా లేదా? ఏనుగంత తండ్రి కంటే ఏకంత తల్లిమేలని వినలేదంట్రా? సరేగాని, ఒరేయ్! నువ్వు రాత్రీ... ఇందాకా... తిన్నావే.."

"గోంగూర పచ్చడీ, ఉలవచారూ, గుమ్మడి పులుసూ, పులిహోర, పరవాణం... పెసరట్టూ! అవేనా?"

"ఆ! అవే! వాటిని ఇంగిలిపీసులో ఏవంటారో చెప్పరా?"

"అమ్మమ్మా! అవన్నీ ఇంగ్లీషులో ఎందుకుంటాయే?"

"పిచ్చి సన్నాసీ! ఉండవని నాకు తెలీదా? నాకు ఇంగిలిపీసు అవసరమైతే ఇట్టే... నెల రోజుల్లో నేర్చుకోగలను ఏవనుకున్నారో! కానీ తెలుగును బలిపెట్టి మాత్రం కాదురోయ్! చూడూ! తల్లిని మరిచిపోతార్రా ఎవరైనా? మన తెలుగుతల్లి కల్పవల్లిరా! అది పచ్చని చెట్టు! ఆ చెట్టుకొమ్మపై హాయిగా కూర్చుని ఉన్నాం! ఎవరైనా కూర్చున్న కొమ్మును నరుక్కుంటార్రా?"

అమ్మమ్మ విజ్ఞానానికీ, వివేచనకీ వెంకటప్పయ్య నిర్ఘాంత పోయాడు! తన తల్లి చిన్నప్పుడే చనిపోతే అమ్మమ్మే పెంచింది! ఆ పోయిన తల్లి తను ఏడ్చినా తిరిగొస్తుందా?

బడిని భవనాలతోపాటు భాష గూడా మార్చాలని తను భావించడం ఎంత పొరపాటు! తెలుగు భాష ఉనికి ప్రమాదంలో పడిందంటున్నారు! తనలాంటి వాళ్లేగదా కారణం!

* * *

"నా అభిప్రాయం మార్చుకున్నాను. తెలుగు మాధ్యమం అలాగే ఉంచి ఇంగ్లిషు నేర్పిద్దాంలే!" - అని మనవడు మిత్రులందరికీ దూరవాణిలో చెబుతూవుంటే అమ్మమ్మ ముసిముసి నవ్వులు నవ్వుకుంది.






డా॥పులిచెర్ల సాంబశివరావు
చిత్రకారుడు, విశ్రాంత అధ్యాపకుడు, గుంటూరు.
94409 37699



# బందీలవుతున్న భావి వెలుగులు

పక్షులు గూళ్ల నుంచి బయటకు వచ్చినప్పుడు కిలకిలరావాలతో ఆనందిస్తాయి. గూళ్లలోకి వెళ్లేటప్పుడూ కిలకిలల సరిగమ రాగాలనే ఆలపిస్తాయి. పిల్లల విషయంలో కూడా... పాఠశాలను వదిలి వెళ్లేటప్పుడు కనపడే ఆనందం వచ్చేటప్పుడూ ఉండాలి. అలా ఉండాలంటే ప్రతీ ఉపాధ్యాయుడు, ఉపాధ్యాయినిలో పిల్లలకు వాళ్ల తల్లిదండ్రులు కనపడాలి. చిన్నారులకు ఆ ఆప్యాయత, అనురాగం దొరికినప్పుడు ఇంట్లో ఉండటానికి ఎంత ఇష్టపడతారో బడిలో గడపటానికీ అంతే ఇష్టపడతారు. అందుకు తానెంచుకున్న మార్గాన్నీ, అనుభవాలనూ వివరిస్తున్నారు విశ్రాంత ఉపాధ్యాయులు ఎన్నవెల్లి రాజమౌళి.

ఊఁక్... ఊఁక్... అంటూ ఏడ్చేపాపను కాళ్లపై వేసుకుని లాలిస్తూ, జోలపాడుతూ బుదగరిస్తుంది తల్లి. ఆమె కాళ్లనే ఉయ్యాల చేసి పాపను ఊపుతుంది. పాప నవ్వుల పరిమళాలు ఆస్వాదించడానికి వందసార్లు నవ్వుతుంది. ఒక్కమాట పలికించడానికి లక్ష మాటలు మాట్లాడుతుంది.

మరీ! అమ్మంటే మాటలా!! త్రిమూర్తులనే ఊయలలేసిన అనసూయే అమ్మ. పాపనవ్వులో నవ్వై, పాప ఏడుపులో ఏడుపై ఏకపాత్రాభినయం చేస్తుంది అమ్మ. ఆ అభినయానందనాలను అనుభవిస్తాడు బాబు. అమ్మ దగ్గర ఐదేళ్ల వయసులో నేర్చినన్ని మాటలు ప్రాథమిక పాఠశాలలోని ఐదేళ్లలో నేర్చుకుంటున్నాడా? ఆలోచించాలి మేధావులు! తల్లి ఒడిలో ఒకటి, రెండుకూ స్వేచ్ఛ ఉంది. ఆ స్వేచ్ఛ బడిలో కరవు. గంట కొట్టే వరకూ పిల్లలు ఎదురు చూడాలి.

పాఠశాల పేరెత్తగానే పారిపోయే పిల్లలెంతో మంది! బడంటే వారికెందుకు అంత అయిష్టం! ఎప్పుడైనా ఆలోచించారా? ప్రస్తుతం పాఠశాలలో... ప్రేమతో పాఠాలను బోధించకుండా, వాటిని బలవంతంగా విద్యార్థుల మెదళ్లలోకి ఎక్కించాలని చూస్తున్నారు. ఇది ప్రయివేటు పాఠశాలలోనైతే మరీ ఎక్కువ. పిల్లలకు ఇష్టంలేని పాఠాలైనా వినాలి. తోటి విద్యార్థుల వేధింపులనూ భరించాలి. కళాశాలలో వేధింపులకు పెద్దవాళ్లే తట్టుకోలేకపోతున్నారని నానాయాగి చేస్తారు. ఈ పిల్లలకు వేధింపులు ఎవరి దృష్టికైనా, ఎప్పుడైనా వచ్చాయా?

పిల్లల్లో కూడా తోటి వారిని ఏడిపించే మనస్తత్వాలు ఉన్న వాళ్లుంటారు. అది గ్రహించి అలా చేయవద్దని వారికి చెప్పాలి. ఇలా పిల్లలను కనిపెడుతూ ఉండాలి.

చిన్నారుల ముఖాలలోని వేదనను, బాధలను గమనించే ఓర్పు-నేర్పు నేటి పంతుళ్లలో నూటికొక్కరికైనా ఉందా? ప్రస్తుత తరం ఉపాధ్యాయుల విధి నిర్వహణలో నిబద్ధత కొరవడుతోంది. పిల్లలకు ప్రేమగా పాఠాలు చెబుదామన్న ఆసక్తి ఉండట్లేదు. సమయపాలన పాటించే వారూ తక్కువే. ప్రభుత్వం కఠినంగా ఉంటే వారందరూ వేళకు పాఠశాలకు వస్తారేమో. కానీ... మనసా వాచా వారంతట వారే ఆ పని చేసినప్పుడే ఫలితం దక్కుతుంది. విద్యార్థుల్లో ఉపాధ్యాయులు స్ఫూర్తి నింపాలి.

దూషణలు, దండనలు, అవమానాలు - వేటినైనా పిల్లలు తొందరగా మర్చిపోతారు.. అది వారికి భగవంతుడిచ్చిన వరమేమో! అదే లేకుంటే ఉపాధ్యాయులతో మాట్లాడటానికి పాఠశాలలో పిల్లలు ఎవరూ ఉండేవారు కాదు.

చుట్టీ బెల్లు కొట్టినప్పుడు పిల్లల ముఖాలు చూడండి ఎంత ఆనం దంతో వెలిగిపోతాయో? అదే పాఠశాలకు వచ్చేటప్పుడు మాత్రం వాడిపోయిన ముఖాలతో కనిపిస్తారు. పాఠశాల వదిలివెళ్లే వాళ్ల ముఖాలలోని నవ్వులు చిన్న దీపా లలో చూపించకపోయినా... సూర్యుణ్నే దీపం చేసి చూసినా కనపడవేమో!

పిల్లలు అప్పుడప్పుడు ఒకటితో నిక్కర్లు తడుపు కోవడం, ఇంకా ఆపలేని పిల్లలు అక్కడే రెండు కూడా పోవడం జరుగుతుంది. ప్రాథమిక పాఠశా లలో పనిచేసే ఉపాధ్యాయులకు ఈ అనుభవాలు మామూలే. చిన్న పిల్లలకు రెండు మూడుసార్లు విరామం (ఇంట్రవెల్) ఉంటే ఈ సమస్య ఎదురవ్వదు.

చిన్నారులందరినీ ఒకే గాటన కట్టకూడదు. వారిలో స్థాయీబేధాలుంటాయి. వాటికనుగుణం గానే విద్యా బోధన జరగాలి. రోగికి మందు ఎంత ముఖ్యమైనా చేదును మింగాలంటే ఇబ్బందే కదా! అందుకేనేమో క్యాప్సూల్స్‌లో చేదుమందు నింపు తారు. పైన తొడుగు తొడుగుతారు. అందుకే పిల్ల లకు చేదు అనే విద్య అందించాలంటే క్యాప్సూల్స్ అనే తొడుగులా పాట, మాట, ఆట, కథ ఉండాలి. ఒకటి, రెండో తరగతుల్లోని పిల్లలకు ప్రతి పాఠమూ ఒక పాట కావాలి. ఆ 'పాట'కు చప్పట్లు కొట్టుకుంటూ పాడుకునేటట్లు లయ ఉంటే ఇంకా బాగుంటుంది. అలాగే ప్రతీ పాఠమూ ఒక కథ కావాలి. అందులో పిల్లలను లీనం చేయాలి.

ఏకబిగిన రెండు మూడు గంటల పాటు కూర్చో బెట్టి పాఠాలు చెబుతామంటే కుదరదు. పసివాళ్లు కదా, తట్టుకోలేరు. మధ్యమధ్యలో విరామం ఇవ్వాలి. ఆటలకు సమయం ఉండాలి. అప్పుడే పిల్లలు తరగతిగదిలో కూర్చుంటారు. మూడో తర గతి నుంచి క్రమంగా పాఠాల విస్తృతిని పెంచు కుంటూ వెళ్లాలి. చదువు అవసరం తెలుసుకునే వయస్సు వస్తూంటుంది కాబట్టి నేర్చుకోవడానికి కృషి చేస్తారు.

తరగతి గదిలో ఉపాధ్యాయుడు చెప్పే దాంతో పాటు పిల్లలతో చెప్పించడమో, మాట్లాడించడమో ఎక్కువగా జరగాలి. దీని వల్ల పిల్లల్లో బెరుకుత నం పోగొట్టవచ్చు. నల్లబోర్డు ఉపాధ్యాయులకే కాదు, పిల్లలకు కూడా. అప్పుడప్పుడు పిల్లలతో దానిపై అక్షరాలనో, అంకెలనో, బొమ్మలనో వేయిం చాలి. ఇది పిల్లలకెంతో తృప్తినిస్తుంది. ఇంటి దగ్గర అమ్మనాన్నలకు, మిత్రులకు చెప్పి మురిసిపోతారు.

పలకలపై బొమ్మలు వేయమని అప్పుడప్పుడు పిల్లలకు చెప్పాలి. వాళ్లలో కాపు రాజయ్యలు, రవి వర్మలూ తయారవుతారు. పాటలు పాడే పిల్లలను ప్రోత్సహించాలి. ఘంటశాలలైనా, బాలసుబ్రమ ణ్యంలైనా ఒకనాడు పాఠశాలలో చదివినవారే కదా!

ఇది నేను 30 సంవత్సరాల క్రితం ఉపాధ్యాయ వృత్తిలోకి వచ్చినప్పుడు గ్రహించాను. తల్లి ఒడి నుంచి ఒడిలోకి పిల్లలను చేర్చుకున్నాను. నా పాట, కథలతో వాళ్లను అలరించాను. ముఖ్యంగా నా ఉద్యోగ కాలమంతా ఒకటిరెండు తరగతుల లోనే గడిచింది.

ప్రస్తుతం ఉద్యోగ విరమణ పొందినా పిల్లల నుంచి దూరమవడం కష్టంగా అనిపించింది. తిరిగి పాఠశాలకు వెళ్లి కథలు, పాటలు, పద్యాలు వినిపి స్తున్నాను. ప్రతి తరగతికీ కథ చెప్పడంతో ప్రారం భిస్తా. మొత్తమ్మీద రెండు మూడు కథలు చెబుతా. మొదట్లో మన పురాణ కథలు చెప్పే వాణ్ని. అయితే... పిల్లలు వాటిపై ఆసక్తి చూప ట్లేదని తర్వాత అర్థమైంది. అప్పటి నుంచి హాస్య కథలు చెబుతున్నా. వాటికి చిన్నారులు బాగా స్పందిస్తున్నారు. ఆ కథలోనే తెలుగు భాషను, నీతిని కలిపి చెబుతున్నా. వారికిష్టమైన శైలిలో చెబుతుండటంతో పిల్లలు విషయాలను త్వరగా నేర్చుకుంటున్నారు. పిల్లల కోసమే 'బాలల మనస్తత్వాలు' (వ్యాసాల సంపుటి), 'చిలుక పలుకులు' (బాలల గేయాలు), 'ఎన్నవెల్లి కథలు' తదితర పుస్తకాలను ప్రచురించా.

నేను గమనించిన మరో ముఖ్యమైన అంశం... తరగతి పూర్తయి, బయటకు వచ్చేటప్పుడు పిల్ల లందరూ నా చుట్టూ మూగుతారు. నా చేతిలో చేయి వేస్తారు. చక్కగా నవ్వుతారు. పాఠం చెప్ప డానికి మళ్లీ రావాలని అడుగుతారు. ఎప్పుడైతే చిన్నారులిలా ఉపాధ్యాయునితో అనుబంధం పెంచుకుంటారో అప్పుడు పాఠశాలంటే పిల్లలకు ఇష్టం పెరుగుతుంది. దాంతో వారి చదువు సాఫీగా సాగిపోతుంది.

నేనీ అభిప్రాయం మీ ముందుంచే సమయానికి 56 పాఠశాలలు సందర్శించా. మెదక్ జిల్లాలోని ఈ నా ప్రస్థానంలో 23 పాఠశాలలు తొగుట మండలానికి చెందినవి కాగా, 31 చిన్న కోడూరు మండలానికి చెందినవి. ఇప్పుడిప్పుడే సిద్ధిపేట మండలంలోని రెండు పాఠశాలలు పూర్తి చేశాను.

ఇలా నాకు శక్తి ఉన్నంతవరకు కొనసాగిస్తా. పిల్లలను చీకట్లో ఉంచి వారి మోముల్లో వెలుగులను చూడాలనుకుంటే సరిపోదు కదా.



**ఎన్నవెల్లి రాజమౌళి**
సిద్ధిపేట
98485 92331



## వర్ధిల్లు తల్లీ!

పరిమళించు మల్లి కన్న
సంపెంగల ఛాయ కన్న
ముద్దబంతి పువ్వు కన్న
తెలుగు భాష సొగసురా!

పాలపిట్ట రంగు కన్న
నెమలి కన్ను కాంతి కన్న
రామ చిలుక పలుకు కన్న
తెలుగు భాష అందమురా!

పసిపిల్లల నగవు కన్న
పసిడి నగల మెరుపు కన్న
గల గల సెలయేరు కన్న
తెలుగు భాష గొప్పదిరా!

ఉడుత పిల్ల చూపు కన్న
శశికూనల మృదువు కన్న
లేడికూన పరుగు కన్న
తెలుగు భాష మిన్నదిరా!

దోరజామ మిసిమి కన్న
నిమ్మపండు పసిమి కన్న
దబ్బపండు ఛాయ కన్న
తెలుగు భాష మెరియునురా!

పప్పు నెయ్యి బువ్వకన్న
పనసపండు తొనల కన్న
పంచదార అరిసె కన్న
తెలుగు భాష మధురమురా!

**- బెలగాం భీమేశ్వరరావు,**
**పార్వతీపురం, 99895 37835**



# భాషకు ఆలయాలు పొత్తపుగుడులు

తెలుగునాట నలుచెరగులా ఉన్న గ్రంథాలయాలు తెలుగు భాషకు, సాహిత్యానికి బహు విధాలుగా సేవలు చేసి శోభిల్లినవే. భాష ఉనికికి మనికికి జనుల నాలుకలూ, గ్రంథాలే ఆటపట్టులు. 'చెట్టపట్టాల్ వేసుకుని' స్వాతంత్ర్యోద్యమం, ఆంధ్ర రాష్ట్రోద్యమం నడిచాయి. కలాలూ గళాలూ రెండు ఉద్యమాల గుండెల్నీ నినదించాయి. ఆంధ్ర మహాసభల తీర్మానాలను గమనిస్తే రాష్ట్ర సాధన - సామాజిక రాజకీయ ఆర్థిక రంగాల అభివృద్ధికి ప్రధానంగా ఉద్దేశించినప్పటికీ స్వభాష, స్వసాహిత్యం వంటివి అభివృద్ధి చెందడానికి కూడా అనేది తేటతెల్లమవుతుంది. ఇందుకు గ్రంథాలయోద్యమం బాసటగా నిలబడింది. అయితే గ్రంథాలయాలు తెలుగు సాహిత్యసేవ చేస్తూ ఆంతరంగికంగా భాషా సేవకూ పూనుకొన్నాయి. గ్రంథాలయోద్యమ నాయకులైన వారిలో కవి, పండిత, సాహితీ వేత్తలు ఉండటం వల్ల సహజంగానే తెలుగుకు సాహితీ సృజన ద్వారా గ్రంథ పుష్పపూజలు జరిగాయి. అన్ని దిక్కులకు భాషా పరిమళాలు చేరాయి.

ఆంధ్ర, తెలుగు పదాలు ఒక్కొక్కప్పుడు జాతిపరంగాను మరొకప్పుడు భాషాపరంగానూ ఉపకరించాయి. నైజాంలో గ్రంథాలయాలకు స్వాభిమాన సంకేతాలుగా ఆనాడు 'ఆంధ్ర' పదం నిలిచింది. హైదరాబాదులోని శ్రీకృష్ణదేవరాయ 'ఆంధ్రభాషా నిలయం' వంటివి ఇంకొన్ని ఉన్నాయి. ఈ వ్యవహారం విజయవాడ తదితర ప్రాంతాలకూ వెళ్ళింది. విజయవాడలోని 'శ్రీభ్రమరాంబామల్లేశ్వర ఆంధ్ర గ్రంథాలయం' వంటివి ఇందుకు దాఖలాలు.

1897లో పశ్చిమగోదావరి జిల్లాలోని కుముదవల్లిలో శ్రీ వీరేశలింగకవి సమాజ గ్రంథాలయం స్థాపించారు. హైదరాబాదు, వరంగల్లు,




ఖమ్మం, విజయవాడ, రాజమండ్రి, అనకాపల్లి, విశాఖపట్టణం, విజయనగరం వంటి పలు తావుల్లోని ప్రాచీన గ్రంథాలయాలూ తెలుగు భాషా సాహిత్య సేవలు చేశాయి. కొన్ని గ్రంథాలయాలు భాషా సాహిత్య సభలు ఏమేం చేశాయో వార్షిక నివేదికల్లో ఇవ్వడం సాంప్రదాయంగా ఉండేది.

గ్రంథాలయం అనే పదబంధం సంస్కృతం. దానికి తెలుగు 'పొత్తపు గుడి' అని ప్రచారం చేసింది గ్రంథాలయోద్యమ విశిష్ట సేవకులు మారేపల్లి రామచంద్రశాస్త్రి. ఆయన 'నుడికడలి' కోశకర్త.

విజయవాడ గ్రంథాలయ సర్వస్వం తెలుగు భాషా సాహిత్య వ్యాసాలు ప్రచురించింది. 'సర్వస్వం'లో రెండవ సంచికలో మారేపల్లి 'గ్రంథ రచన' అనే వ్యాసం రాశారు. అందులో భాషాజ్ఞానం ఉపశీర్షికలో- 'ప్రపంచ జ్ఞానము కలిగినంత మాత్రమున గ్రంథ రచన సాధ్యము కాదు. ఏ భాష యందు గ్రంథ రచన చేయదలంచితిమో ఆ భాషయందు మంచి పాండిత్యము తెలిసి వుండవలె. అందుకు నిఘంటు జ్ఞానము వ్యాకరణ జ్ఞానమును ఆవశ్యకములు. అంతేకాదు, అలంకార శాస్త్రమును, ఛందశ్శాస్త్రమును తెలిసి వుండవలె' అంటూ ఇంకా ముందుకు తర్కబద్ధంగా వెడుతూ ఇలా చెప్పారు.

'భాషా జ్ఞానము లేని యెడల మనస్సులో ఎన్ని మంచి తలపులున్నను అవి దరిద్రుల కోరికల వలెనె లోన అణగి జీర్ణము కావలసినవే కాని క్రియా రూపమును పొందజాలవు. చక్కని భాషా జ్ఞానమున్న యెడల - ధనవంతుని కోరికలు మేడలుగానో, మిద్దెలుగానో, తోటలుగానో, నగలుగానో, నాణెములుగానో ఇక మఱి ఏ రూపుననో పరిణమించి ఆనందమును కలిగించు విధమున' ఎన్నో పనుల్ని చేసుకోగలమన్నారు. ఈ నేలపై రాళ్ళు ఎప్పటి నుంచి ఉన్నాయో అప్పటి నుంచే మా భాష వుందనే డబ్బాలు కొట్టుకోవడం తెలుగు భాషోద్యమకారునికి ఎన్నడూ లేదు.

'పలుకు మనుగడ- తెనుగు - చేయవలసిన పని' అని ఓ వేరే వ్యాసం గ్రంథాలయ సర్వస్వంలోనే మారేపల్లి రాస్తూ-

'తెనుగున గట్టివారు కాదలచుకొనువారు తెనుగుతోబాటు దాని తోబుట్టువులగు తమిళము, కన్నడము, మలయాళము, తుళు, కోదు మొదలగు పలుకులను, దాని తోడులగు ప్రాకృతము, సంస్కృతము, మరాఠ, ఒడియా మొదలగు పలుకులను చదువవలె. మేటి పలుకుల లోని మేలుబంతి పొత్తములు పరికించి తెలుగులో అట్టివి వ్రాసి, మన పలుకుతల్లిని గద్దె ఎక్కించవలె. తెలుగు తల్లికి తగిన బిడ్డలమని మన్ననలంది ఉప్పొంగగల ఉనికిలోకి రావలె'నని ప్రబోధించారు. 1936లో ఈ భాషా వీరుని మేలి

పలుకులు నేటికీ మనకు బాట చూపేవే. ఈ గత స్ఫూర్తిని తవ్వుకోవడం ఎందుకంటే భవిష్యానికి విత్తనాలు చల్లుకోవడానికే. 'తెలుగును గూర్చిన గుట్టు మట్టు లరయుటయు గ్రంథాలయాభిమానులకు ముఖ్యమగు పనులలో ఒకటి' అని ప్రకటించిన తెలుగు గ్రంథాలయోద్యమం ఇటువంటి ఎన్నిటినో పొదిగించుకుంది.

ఇలా పొదిగించుకున్నదనడానికి దాఖలాలు అనేకం. కట్టమంచి రామలింగారెడ్డి ముసలమ్మ మరణం కావ్యాన్ని ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘం ప్రకటించింది. గాడిచర్ల, అయ్యంకి, పాతూరి, కోదాటి వంటి వారి అంకిత సేవల వల్ల గ్రంథాలయోద్యమం, ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘం బలకరమయ్యాయి. వీరందరూ రచయితలు కావడం వల్ల భాషకు, సాహిత్యానికి సమయ సందర్భాలలో సేవ చేసినవారే. వ్యవసాయ గ్రంథాలను తెలుగువారికి తెలుగులో అందించిన ఘనత ఆం.ప్ర.గ్రం. సంఘానిది. తెలుగు వాఙ్మయ సూచికల్ని ఈ సంఘం ప్రచురించింది. అధికార భాషా సంఘానికి అధ్యక్షులుగా సేవ చేసిన వావిలాల గోపాలకృష్ణయ్య గ్రంథాలయోద్యమ నాయకులే. సరససరళమైన తెలుగులో బాలసాహిత్యాన్ని పద్యఖండికలుగా రాసిన నాళం కృష్ణారావు గ్రంథాలయోద్యమానికి చెందిన ముఖ్యవ్యక్తి. ముఖ్యంగా పొత్తపుగుడుల ఉద్యమ పత్రిక గ్రంథాలయ సర్వస్వం వాడుక భాషోద్యమాన్ని గట్టిగా బలపరచింది. గిడుగు వెంకటరామమూర్తి అక్షరాలా కీర్తిశేషులయినప్పుడు ఒక సంస్మరణ వ్యాసంలో - 'తెలుగు భాషా ప్రపంచంలో సామ్రాజ్యవాదం పోయి ప్రజాస్వామికం ప్రబలడానికి గత 30 సంవత్సరాల నుంచి కృషి చేసి కృతార్థులైన గిడుగు రామమూర్తి పంతులు నిర్యాణం ప్రతి ఆంధ్రునికీ సంతాపహేతువు.' అని రాయడంలో 'భాషలో సామ్రాజ్యవాదం' పోయేందుకు కృషి చేయడాన్ని గుర్తించడంలో గొప్ప వ్యక్తీకరణ! అదీ పొత్తపుగుడుల 'ఆత్మీయ' భాషాభిమానం.

1940 మార్చి-జూన్ గ్రంథాలయ సర్వస్వంలో గిడుగు 'నీడబొమ్మ' (ఛాయాచిత్రం) వేసి ఆయన హృదయ ప్రకటన ఇలా ఇచ్చారు - 'రెండు కోట్ల డెబ్బై లక్షల మంది ఆంధ్రులను విద్యావంతులను చేయడానికి నా మతము అంగీకరించేటట్లయితే ఒక మాసం రోజులలో సాధ్యమవుతుంది. ముందుగా వ్యావహారిక భాషలో మీ కరపత్రాలన్నిటినీ అచ్చొత్తించండి. ఆ తరువాత తెలుగు అక్షరాలూ గుణింతమూ ప్రతివారికీ నేర్పడానికి గ్రామగ్రామానికొక ప్రచారకుణ్ణి ఏర్పాటు చేయండి. అక్షరాలూ గుణింతము మామూలు తెలివితేటలు గలవాడు నేర్చుకోవడానికి వారము పది రోజులకన్నా ఎక్కువ పట్టదు. ఎప్పుడయితే అక్షరాలూ గుణింతమూ వచ్చిందో ఆ క్షణం నుంచీ మీ కరపత్రాలు మొదలగునవి చదువుకొనగలుగుతాడు. ఇంతకన్నా దేశంలో విద్య వ్యాపింపజేయడానికి మార్గము లేదు. మీరీ పనికి పూనుకొనవలెను. ఈ విధంగా (ఐరోపాలోని) బాల్కను రాష్ట్రాలలో యుద్ధము పోయిన తరువాత చేసినారు. నేను ఆ విషయమంతా చదివినాను. బాల్కను రాష్ట్రాలలో ఆరు మాసాలలో విద్య శూన్యత అంతా తొలగిపోయింది.' - గిడుగు వెంకటరామమూర్తి

ఇందులో కరపత్రాలు సైతం వాడుకభాషలో ఉండాలని, జనాన్ని అక్షరాస్యులుగా చేయాలని అలా చేయడానికి నెల రోజుల్లో సాధ్యమయ్యే తన పథకాన్ని తెల్పడం, అటువంటి పథకం విజయవంతమయిన సందర్భం తెల్పడం




వంటివి ఉన్నాయి. రాష్ట్రంలో విద్యావ్యాప్తికి పూనుకొనవలసిందిగా ఆయన ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘానికే ఎందుకు చెప్పారంటే పొత్తపుగుడుల ఉద్యమం వయోజన విద్యావ్యాప్తికి తగిన ప్రాధాన్యమివ్వడమే కారణం.

తెలుగుభాషలో ఎటువంటి గ్రంథాలుండాలన్నది కూడా పొత్తపుగుడుల ఉద్యమం చర్చించింది. 1916 గ్రంథాలయ సర్వస్వం 3, 4 సంచికల్లో గ్రంథాలయోద్యమం పరమావధి జనసామాన్యము యొక్క జ్ఞానాభివృద్ధి అనే రచనలో 'జ్ఞానానికి సాధనలో వాఙ్మయం. వాఙ్మయాభివృద్ధితో కూడిన అన్ని అంశములును ఈ ఉద్యమానికి సంబంధించినవే... ఎట్టి గ్రంథములు తెలుగుభాష యందున్నవి? ఇందులో లోపములేవి గలవు? ఆ లోపమును సవరించుటెట్లు? ఇందుకొరకు మన భాషయందున్న గ్రంథములన్నిటి యొక్క పట్టిక నొకదానిని తయారుచేయవలెనని' తెలుగుజాతికి సూచించింది. 'బడులలో పెట్టు తెలుగు పుస్తకములు' అనే వ్యాసం పాఠ్యగ్రంథాలపై కూచి నరసింహంది, ఎన్నో అంశాలను తెలిపేది. ఆంధ్రవాఙ్మయ స్థితి అనే ఆదిరాజు వీరభద్రరావు వ్యాసంలో 'తల్లిపాలు త్రాగిన బాలునకును దాదిపాలు త్రాగిన బాలునకును ఎంత వ్యత్యాసము కలదో స్వభాష యందు జ్ఞానార్జనము చేసిన వానికిని ఇతర భాషలో జ్ఞానార్జనము చేసిన వానికిని అంత భేదము కలదు' అని తెలిపారు.

భాష గురించి నిఘంటువుల గురించిన ప్రసంగాలు కూడా పొత్తపుగుడుల ఉద్యమసభలలో చోటు చేసుకొనేవి. 1950 ఏప్రిల్ నెలలో సూర్యాపేటలో 27వ ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ మహాసభ జరిగింది. అప్పుడు మారేపల్లి తెనుగు నిఘంటువుల పై ప్రసంగం చేశారు. ఆయన కీర్తిశేషులయిన తరువాత 1953లో ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘం కార్యదర్శి పాతూరి నాగభూషణం సంఘం తరపున ఆ వ్యాసాన్ని 'తెనుగు నుడిదండలు' పేర యాభై పుటల పొత్తాన్ని ప్రకటించారు. దీనికి 'పరిచయం' పేర ముందు మాటల్ని సురవరం ప్రతాపరెడ్డి రాస్తూ 'దీపము అనువాదానికి 'తిల్లిక' అనే తెలుగు మాటను శాస్త్రి గారే ఉద్ధరించిరి... తెనుగు సంస్కృతము నుండి భిన్నించినిదనియు, సంస్కృత దాస్యము తెలుగునకు సరిపడదని శాస్త్రి గారి భావమని 'తెనుగు నుడిదండల' ద్వారా తెలుస్తోంద'ని రాశారు. నుడిదండ అంటే నిఘంటువు అని అర్థం. ఇటువంటి మౌలిక పుస్తకాన్ని వేయడం అంటే ఒకనాటి భాషోద్యమానికి పొత్తపుగుడుల సేవ ఎటువంటిదో తెలుస్తోంది.

స్వాతంత్ర్యోద్యమానికి, ప్రత్యేక రాష్ట్రోద్యమానికి, వయోజన విద్యోద్యమానికి సేవలు చేసినది, నిరంతరం సాగవలసినది పొత్తపుగుడుల ఉద్యమం. అది ఒకనాడు తెలుగు భాషకు, సాహిత్యానికి, జ్ఞానప్రసారానికి చేసిన సేవా స్ఫూర్తి పొంది మనం వర్తమానాన్ని దేదీప్యమానం చేసుకోవాలి.





**సన్నిధానం నరసింహశర్మ**
సాహితీవేత్త, పరిశోధకులు,
హైదరాబాద్. 92920 55531

# ఒకడు లెక్కల కవి..!

రాజరాజనరేంద్రుని ప్రోత్సాహంతో నన్నయ ఆంధ్ర మహా భారత రచనకు శ్రీకారం చుట్టాడు. తెలుగు సాహిత్య చరిత్రలో ఇదొక మలుపు. దాదాపు అదే కాలంలో గణిత శాస్త్రాన్ని పద్యాల రూపంలో రాశాడు ఓ కవి. ఇది కూడా ఒక సాహసమే. అంటే తెలుగులో అటు సాహిత్య, ఇటు శాస్త్రగ్రంథాల రచన ఒకే కాలంలో జరిగింది.




తెలుగు సాహిత్యాన్ని ఎందుకు చదవాలి? అందులోనూ ప్రాచీన సాహిత్యాన్ని.. అంతా ఊహలు, వర్ణనలు. చదివితే ఏమొస్తుంది?.. చాలామంది ఆలోచనలు ఇలా సాగుతుంటాయి. సాహిత్యం చదివితే మానసిక వికాసం కలుగుతుంది, ఊహాశక్తి పెరిగి చేసే పనిలో నూతన ఆవిష్కరణలకు దారి చూపుతుంది. ఇదొక్కటే కాదు.. ఆధునిక గణితం, ఇతర శాస్త్రాలను అర్థం చేసుకోవడానికి, మెదడుకు పదును పెట్టే సమస్యలను పరిష్కరించడానికి, సాహిత్యం ఎంత శాస్త్రీయమైందో, శాస్త్రంతో సాహిత్యానికి ఎంత సాన్నిహిత్యం ఉందో తెలుసుకోవడానికి ప్రాచీన గ్రంథాలను చదవాలి.

ఇందుకు ఉదాహరణ 'పావులూరి గణితం'. ఇది మహాభారతమంత ప్రాచీనం. రాజరాజనరేంద్రుని ప్రోత్సాహంతో నన్నయ ఆంధ్ర మహాభారత రచనకు శ్రీకారం చుట్టాడు. ఈ మహా గ్రంథాలను తెలుగులో రాయడం, చదవడమూనా? అన్న ఆక్షేపణలు వచ్చిన నేపథ్యంలో మహాభారతాన్ని అనువదించడం ఒక మలుపు. దాదాపు అదే కాలంలో గణిత శాస్త్రాన్ని పద్యాల రూపంలో రాశాడు ఓ కవి. అది కూడా ఒక సాహసమే. అంటే తెలుగులో అటు సాహిత్య, ఇటు శాస్త్ర గ్రంథాల రచన ఒకే కాలంలో జరిగింది. అదీ పద్య ప్రక్రియలో.

గణిత సూత్రాలు వచనంలో రాస్తేగానీ ఒక పట్టాన అర్థం కావు. అలాంటిది పద్యాల్లో రాసి మెప్పించడం సులువేమీ కాదు. నిజానికి పద్య రచనే చిక్కు లెక్కలాంటిది. నిర్దిష్టమైన ఛందస్సు- (అంటే.. ఇన్ని పాదాలు, పాదానికి ఇన్ని అక్షరాలు, లఘువులు-గురువులు, యతి నియమాలు) పాటిస్తే తప్ప పద్య రచన పూర్తి కాదు. ఈ ప్రమాణాలన్నింటినీ తు.చ. తప్పకుండా పాటించి అందులో గణిత సూత్రాలను, లెక్కలను ఇమడ్చడం, అదీ అందరికీ అర్థమయ్యే పదాలతో రాయడం రచయిత ప్రతిభకే కాదు, తెలుగు భావ సంపత్తి, విస్తృతికీ నిదర్శనం. ఈ గ్రంథాన్ని రాసింది పావులూరి మల్లన. కవి పేరుతో గ్రంథానికి ప్రాచుర్యం లభించడమూ విశేషం.

క్రీ.శ. 814 నుంచి 877 వరకు మైసూరు ప్రాంతాన్ని పాలించిన అమోఘ వర్ష నృపతుంగుని ఆస్థానంలోని మేధావి మహా వీరాచార్యుడు సంస్కృతంలో రాసిన 'గణిత సార సంగ్రహం' ఆధారంగా 'సారసంగ్రహ గణితం' పేరుతో మల్లన ఈ గ్రంథాన్ని రచించాడు. అనువాదమైనా చాలా చోట్ల స్వతంత్ర వైఖరి అవలంబించాడు. జనం నోట్లో ఇది 'పావులూరి గణితం'గానే స్థిరపడింది. గ్రంథం అసలు పేరును జనం మరచి పోయారు. పెద్ద బాలశిక్ష వాడుకలో ఉన్నంతవరకు ఇందులోని కొన్ని పద్యాలనయినా పిల్లలకు చెప్పే వారు. రాను రానూ ఆదరణ తగ్గడంతో ఈ గ్రంథంలోని కొన్ని భాగాలే ఇప్పుడు లభ్యమవుతున్నాయి.

మల్లన వ్యక్తిగత విషయాలకు వస్తే ఆయన పూర్వీకులది కమ్మనాడు (ప్రస్తుత గుంటూరు జిల్లా)లోని పావులూరు. ఆయన తాత పేరు కూడా పావులూరి మల్లనే. రాజరాజనరేంద్రుని కొలువులో ఉద్యోగి. నన్నయ సహచరుడు. ఇప్పటి తూర్పుగోదావరి జిల్లా పిఠాపురం సమీపంలోని నవఖండవాడ అనే గ్రామాన్ని అగ్రహారంగా పొందాడు. తండ్రి పేరు సివ్వన, తల్లి గౌరమ. తాత వెంట తిరిగే మల్లనకు నన్నయతో పరిచయం ఉండే ఉంటుంది. గ్రంథ రచనలో ఆయనను స్ఫూర్తిగా తీసుకొనే ఉంటాడు. నాటి కరణాలు, ప్రభుత్వోద్యోగుల కోసం ఈ గ్రంథాన్ని రచించి ఉంటాడని ఊహించడం సమంజసమే. నన్నయ మహాభారతాన్ని 1051- 1060 మధ్య రాశాడని అనుకుంటే, ఆ తరువాత కొన్ని సంవత్సరాలకు పావులూరి గణితం వెలుగు చూసిందని అంచనా వేయవచ్చు. నన్నయ చేపట్టిన భారతం రచన అసంపూర్తిగా మిగలగా, మల్లన గ్రంథం మాత్రం సంపూర్ణంగా వెలుగు చూసింది. ఆ విధంగా చూస్తే ఇది తొలి తెలుగు గ్రంథమన్నా తప్పులేదేమో! తెలుగులో తొలి శాస్త్ర గ్రంథకర్త అన్న కీర్తి మాత్రం తప్పకుండా మల్లనకే దక్కుతుంది.

చిన్న పిల్లలకు అర్థమయ్యే లెక్కల నుంచి పెద్ద పెద్ద సమస్యలను ఇందులో పొందుపరిచాడు. స్థలాల విస్తీర్ణం, దాంట్లో నిలిచే నీటి పరిమాణం, ధాన్యం కొలతలు, తూకాలు, కాలం వివరాలతో పాటు, ఆధునిక గణితంలో ఉండే వర్గాలు, వర్గమూలాలు, ఘనాలు, సమీకరణాలను కూడా వివరించాడు. నాలుగు ఆవగింజల

బరువెంతో కూడా చెప్పాడు. సంస్కృత గ్రంథాల్లోవి కాకుండా అప్పటి సమాజంలోని అంశాలను ఉదాహరణలుగా చూపించాడు. అందుకే పావులూరి మల్లన గణితాన్ని ప్రాథమిక దశ నుంచే చెప్పేవారు.

వీధి బడులు నడిచే వరకు తెలుగునాట బహుళ ప్రచారంలో ఉన్న పద్యాల్లో మచ్చుకు ఒకటి...

ఖర్జూర ఫలములు గణికుండు కొనితెచ్చి
సగపాలు మోహంపు సతికినిచ్చె
అందు నాల్గవపాలు అనుగు తమ్మునకిచ్చె
అష్ట భాగంబిచ్చె అనుజ సతికి
తగ తొమ్మిదవ పాలు తన తనయునకిచ్చె
తన చేత నాల్గున్న తల్లికిచ్చె
మొదలు తెచ్చినవెన్ని? మోహంపు సతికెన్ని?
అనుగు తమ్మునకెన్ని, అతని సతికి
ఎన్నియిచ్చె సుతునకెన్నిచ్చె మరియును
తల్లికెన్నియిచ్చె తగ వచింప
గణిత మెరిగినట్టి కరణాల బిలిపించి
అడగవలయు దేవ! అవధరింపు!

ఈ పద్యం ఛందస్సు 'సీసం'. ఇందులోని పదాలు తేలికైనవే. అందరికీ అర్థమయ్యేవే. అందుకే బాలశిక్షలో దీనికి చోటు కల్పించారు.

ఇప్పటి బీజ గణితం ప్రకారం ఈ లెక్కను సాధిస్తే

$x/2 + x/4 + x/8 + x/9 + 4 = 288$

భారతీయులే శూన్యం ('సున్న')ను కనిపెట్టారు. దీని లక్షణాలను చెప్పకుండా ఉంటాడా? శూన్యం లక్షణాలను వివరిస్తూ చెప్పిన పద్యం ఇది.

సున్నయు సున్నయు బెంచిన
సున్నయ; తత్కృతి ఘనంబు సున్నయు వచ్చున్
సున్నయు లెక్కయుబెంచిన
సున్నయ తానమరియుండు సుస్థిర రీతిన్

0ను సున్నతో గుణించినా, మరో సంఖ్యతో గుణించినా, వర్గం, ఘన పరిమాణం చేసినా సున్న వస్తుందన్నది ఈ పద్యం అర్థం. ఆధునిక గణితంలోనూ ఇదే చెబుతారు.

లెక్కలు చేయాలంటే ఎక్కాలతో పాటు, సంఖ్యల వర్గాలు (ఆధునిక గణితంలో స్క్వేర్‌లు) కూడా నోటికి రావాలన్నది మల్లన అభిమతం. అందుకే దీన్ని గుర్తు చేస్తూ ప్రాథమిక స్థాయి విద్యార్థుల కోసం ఈ పద్యం చెప్పాడు.

ఒక్కటి మొదలుగ గలిగిన
లెక్కలు నవ సంఖ్యదాక లెక్కించి ముదం
బెక్కగ వర్గించిన నం
దొక్కనికి వర్గపాలమొగి నెంతయగున్!

1 నుంచి 9 సంఖ్యల వర్గాలను లెక్కించండన్నది ఈ పద్యం సారాంశం.

అంకెలను పద్యాల్లో ఎలా రాస్తారు? ఈ ప్రశ్న తలెత్తడం సహజం. పద్యాల్లో రాసినప్పుడు ఒక్కో సంఖ్యకు ఒక్కో గుర్తు ఇవ్వడం భారతీయ సంప్రదాయం. ఉదాహరణకు 3కు 'లోక' అని రాస్తారు. అంటే ముల్లోకాలు ఉన్నాయని విద్యార్థికి ముందే తెలిసి ఉంటుంది కాబట్టి పద్యంలో 'లోక' అన్న పదం వస్తే అది '3' అని వెంటనే స్ఫురిస్తుంది. ఇదే విధంగా 7కు ముని (సప్తర్షులు), 6కు రుచి (షడ్రుచులు) అని రాస్తారు. 673ను పద్యంలో రాయాలంటే 'లోక ముని రుచి' రాస్తారు. ఒకట్ల స్థానంలో ఉన్న సంఖ్యను పద్యంలో ముందుగా చెప్పడం ఆనవాయితీ. ఈ గుర్తులు తెలుసుకోవడానికి సంఖ్యా నిఘంటువులు ఉన్నాయి. మల్లన కూడా ఒక జాబితా ఇచ్చాడు. అచ్చంగా ఈ మాటలే కాకుండా ఛందస్సుకు అనుగుణంగా ప్రత్యామ్నాయ పదాలు వాడేవారు. విద్యార్థులకు ముందు భాష, తరువాత గణితం చెప్పేవారు కాబట్టి లెక్కలు చేయడంలో ఇబ్బంది ఉండేది కాదు.

ఇలాంటి లెక్కకు ఒక ఉదాహరణకు:

ఎనిమిది యేనులు వరుసను
నెనయంగా నెనిమిదార్లు నెనయగ వావి
న్ననువొంద నిలిపి నిధులను
గనుగొనగా బెంచి చెప్పు గణిత విధిజ్ఞా!

వరుసకు ఎనిమిది 5లు, ఎనిమిది 6లు రాసి 9తో గుణించాలన్నది ఈ పద్యం తాత్పర్యం.

సంప్రదాయం ప్రకారం పద్యంలోని మొదటి పాదంలో చెప్పిన దాన్ని ముందుగా ఒకట్ల స్థానం నుంచి రాయాలి.

అంటే 5555 5555 రాయాలి.

ఆ తరువాత ఎనిమిది 6లు- 6666 6666 రాయాలి.

దాన్ని 'నిధుల'తో గుణించాలి. నిధులు అంటే 'నవ నిధులు' కాబట్టి 9తో హెచ్చించాలి.

ఈ లెక్క చేస్తే...

6666 6666 5555 5555 × 9

జవాబు: 5 999 9999 8 999 9999 5

ఇది విద్యార్థుల మెదడుకు మేత పెట్టేదే.

మల్లన ప్రయోగాల్లో ముఖ్యమైనవి 'కంఠహార' లెక్కలు. పై లెక్కే అందుకు ఉదాహరణ. ఈ జవాబుకు రెండు చివర్లా 5లు, మధ్యలో 8ఉండగా, మిగిలినవన్నీ 9లు. దీనిని బొమ్మ గీస్తే ఒక దండలా ఉంటుంది కాబట్టి ఆ పేరు పెట్టారు. ముందుగా జవాబు అనుకొని, దానికి తగ్గ సమస్య రాసుకొని, దాన్ని పద్యం రూపంలో తర్జుమా చేయడం ఆయన ప్రత్యేకత. గణితంలో ప్రావీణ్యం ఉన్నవారే ఇలాంటివి చేయగులుగుతారు. ఆధునిక గణిత సూత్రాల ప్రకారం కూడా ఇలాంటి లెక్కలు చేయడం సాధ్యమే.

మల్లన లెక్కలు కేవలం జీవిత అవసరాలకో, విద్యార్థుల మేధో వికాసానికో పరిమితం కాలేదు. రాజ్య పరిపాలనలో భాగమయ్యాయి. రాజులు రహస్య సమాచారాన్ని పంపించడానికి లెక్కలను ఆశ్రయించేవారు. రాజులు తాము పంపించే విషయాన్ని అంకెల రూపంలో చెప్పేవారు. దీని వెనుక ఉన్న సూత్రం పంపేవారికి, అందుకొనే వారికి మాత్రమే తెలిసేవి. ఈ సూత్రాలు ఎలా రాయాలి? ఎలా అర్థం చేసుకోవాలన్నది కూడా మల్లన పద్యరూపంలో చెప్పాడు. ఇప్పటి రోజుల్లో 'ఐ లవ్ యూ'ను '143'గా రాస్తున్న విధంగానే ఆ రోజుల్లో రహస్య సందేశాలను పంపేవారు.

గణితం కాలాలకు, ప్రాంతాలకు అతీతమైనది. నిజానికి దానికదే ఒక భాషలాంటిది. మల్లన అందించిన సమాచారం ఆధునిక గణితానికి సరితూగేదే. లెక్కను ఎలా చేయాలో అన్న దాని కంటే అసలు సమస్యను ఎలా ఇవ్వాలో తెలుసుకోవడానికి పావులూరిని ఆశ్రయించాల్సిందే!

*(ఆధారం: పావులూరి గణితం- రచయిత విద్వాన్ తెన్నేటి)*



**పి.శంకర్రావు**
సీనియర్ ఉప సంపాదకులు,
ఈనాడు. హైదరాబాద్.
94416 95492

**మాధురీ పుష్పం**

తెలుగు తేనెల ఊట
తెలుగు చక్కెర మూట
తెలుగు మాటల తేట
మరుమల్లె పూదోట

– కవివరపు ఉమ
విజయవాడ. 94917 28615

# ఆబాలగోపాల సాహిత్యం



కథలంటే పిల్లలు చెవి కోసుకుంటారు. ఒకప్పుడు పల్లెటూళ్లలో రాత్రి భోజనాలు అయిన తరువాత కథలు వినటానికి బామ్మ చుట్టూ చేరేవారు, ఊ కొడుతూ నిద్రలోకి జారుకునేవారు. రాజులు, రాణులు, రాక్షసులు, వీరులు, మాయలు, మర్మాలు, అద్భుతాలు, సాహసాలు, హాస్యం, చతురత వంటివి ఈ కథల్లో ఉండేవి. పౌరాణిక, జానపద కథలు చాలాకాలం మౌఖికంగా కొనసాగాయి. ఇప్పుడు కథలు చెప్పే సంస్కృతి దాదాపుగా అంతరించిపోయిందనే చెప్పాలి. బాల సాహిత్యం అంటే ఇపుడు పుస్తకాల్లో చదువుకునేదే.

రామాయణం, భారతం వంటి ఇతిహాసాలు, భాగవతం వంటి పురాణాలు, శతక పద్యాలు, పేదరాసి పెద్దమ్మ కథలు వంటివి తొలినాళ్లలో తెలుగునాట బాలసాహిత్యంగా ప్రచారం పొందాయి. 1950, 60 దశకాలలో విస్తృతంగా ఇతర దేశాల, రాష్ట్రాల సాహిత్యం తెలుగులోకి అనువాదం అవుతున్న క్రమంలో అక్కడి చెప్పుకోదగ్గ బాలసాహిత్యమంతా కూడా తెలుగులోకి వచ్చింది. ఇవి ఎంతగా ఆదరణ పొందాయంటే ఆలీబాబా 40 దొంగలు వంటి కథలు మనవి కావంటే ఆశ్చర్యపోతారు. ఆండర్సన్ కథలు, గ్రిమ్స్ సోదరులు కథలు, సిండరెల్లా వంటి అనేక జానపద కథలు, టాంసాయర్, అరేబియన్ నైట్స్, ఆలీస్ ఇన్ ది వండర్ ల్యాండ్, టాగూర్ కాబూలివాలాతో సహా తెలుగులోకి అనువాదం కాని బాలసాహిత్యం లేదంటే అతిశయోక్తి కాదు. 'బాలల బొమ్మల' అనే శీర్షికతో రామాయణ, భారతాలతో పాటు సింద్‌బాద్ సాహస యాత్రలు, రతనాల దీవి వంటి పుస్తకాలు ప్రచురితమయ్యాయి.

స్వాతంత్ర్య స్ఫూర్తితో నేషనల్ బుక్ ట్రస్ట్ ఆధ్వర్యంలో నెహ్రూ బాల పుస్తకాలయ కింద ఇతర భారతీయ భాషలతో పాటు తెలుగులో కూడా అనేక పిల్లల పుస్తకాలు వచ్చాయి. చిత్రకారుడు శంకర్ ఏర్పరిచిన చిల్డ్రన్స్ బుక్ ట్రస్ట్ ద్వారా కూడా కొన్ని పుస్తకాలు వచ్చాయి. అదే సమయంలో సోవియట్ రష్యా ఇతర సాహిత్యంతోపాటు రంగురంగుల బొమ్మలతో, చాలా తక్కువ ధరకు ఎన్నో పుస్తకాలను అందించింది. ఒకటి, రెండు తరాల తెలుగు పిల్లలు ఈ సాహిత్యంతో ఎదిగారు.

ఆ కాలంలోనే ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి జానపద కథ, కథ, పద్య, గేయ నాటిక వంటి రూపాలలో దాదాపు 150 పుస్తకాలను అందించింది. చిలక పలుకుల పేరుతో పాటల పుస్తకంతోపాటు ఆడియో క్యాసెట్లు, వీడియో మ్యాగజైను వంటి పలు ప్రయోగాలను చేసింది.

## నీతి ప్రధానం




నీతులు, బుద్ధులు చెప్పి, క్రమశిక్షణ అలవాటు చేసి పిల్లల వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దటం బాల సాహిత్య ఉద్దేశం అన్న భావన ప్రధానంగా చలామణిలో ఉంది. కథ చివరలో 'నీతి' వాక్యంతో ఈ కథలు ముగుస్తాయి. పంచతంత్రం, ఈసోపు కథలు ఇందుకు ప్రధాన ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు. మొక్కై వంగనిది మానై వంగుతుందా అన్న సూక్తిని చూపుతూ ఈ కథలు ప్రచారం పొందుతున్నాయి. ఈ కారణంతోనే తల్లిదండ్రులు, పెద్దలు నీతి పుస్తకాలు కావాలని అడుగుతుంటారు. క్రమశిక్షణ, నీతి నియమాలు పిల్లలకు అలవర్చాలన్న తపన పెద్దలకు ఎక్కువగా ఉంటుంది. ఆధునికంగా వస్తున్న ఇటువంటి కథల్లో 'కథనం' కంటే సందేశాత్మక సన్నివేశం ప్రధానంగా ఉంటోంది. ఈ కథలు చాలా కృతకంగా కూడా ఉంటాయి. అంతే కాకుండా కథ చివర 'నీతి' అని ఉంటే అది కూడా వల్లే వేయాల్సిన వాక్యంగా ఉంటుందే కానీ, పిల్లలు దాని నుంచి గ్రహించుకోవలసింది, దాంట్లోని ఇతర కోణాలు మరుగున పడిపోతాయి. చక్కటి బాల సాహిత్యానికి ఈ నీతి ప్రధాన ధోరణి ఆటంకంగా భావిస్తున్నాను.

## నీతి అంతర్లీనం

పిల్లలకు చెప్పే కథల్లో చివర నీతి అన్న వాక్యం ఉండగూడదన్న వాళ్లల్లో మొట్ట మొదటివాడు లియో టాల్‌స్టాయ్. ఈసోపు కథలను రష్యన్ భాషలో రాయటానికి టాల్‌స్టాయ్ గ్రీకు భాష నేర్చుకున్నాడు. నీతి వాక్యం లేకుండా ఈసోపు కథలను రాశాడు. టాల్‌స్టాయ్ నవలా రచయితగా, తత్త్వవేత్తగా ప్రఖ్యాతి గాంచినప్పటికీ ఆయనలోని ఈ కోణాన్ని అంతా విస్మరించారు.

'ఈ జీవితం ఏమిటి? ఇందులో నా పాత్ర ఏమిటి?' అని పిల్లలు పైకి ప్రశ్నించకపోయినప్పటికీ అంతర్లీనంగా ఆ ప్రశ్నలు వాళ్లను వేధిస్తుంటాయట. వీటికి పిల్లల్లో ఎవరికి వాళ్లు తమ సమాధానాలు వెదక్కునే విధంగా ఉంటాయి అనేక జానపద కథలు. వీటిని 'మానవ అంశం' (human element) ఉన్న కథలుగా పేర్కొనవచ్చు. అందుకే ఈ కథలు తరతరాలుగా నిలిచి ఉన్నాయి, ఎంతో ఆదరణ పొందుతున్నాయి. ఒకే రకమైన కథలు పూర్తిగా భిన్నమైన ప్రాంతాల్లో, దేశాల్లో ఉండటం ఈ విషయాన్నే సూచిస్తుంది. ఉదాహరణగా జానపద కథల్లో రెండు, మూడు ధోరణులను (genres) వివరిస్తాను.

## అమాయకుడినే విజయం వరిస్తుంది

ముగ్గురు అన్నదమ్ములుంటారు (ముగ్గురే ఎందుకో నాకు తెలియదు), మూడవవాడు అమాయకుడు. ఇద్దర న్నలూ అమాయకుడిని మోసం చేసి ఆస్తి కాజెయ్యాలనుకుంటారు. అయితే తండ్రి పెట్టే పరీక్షల్లో అమాయకుడే గెలుస్తాడు. లేదూ, అమాయకుడైన తమ్ముడిని అన్నలు ఆటపట్టిస్తుంటారు. కానీ అతడే రాకుమారిని గెలుచుకుని ఆశ్చర్యపరుస్తాడు. ఇటువంటి కథల్లో శాపగ్రస్తమైన రాకుమారో, మంత్రమహిమలున్న ఒక జంతువో అమాయకుడైన చిన్నవాడికి సహాయం చేస్తారు.

## రాకుమారిని వరించిన సామాన్యుడు

ఒక పేదవాడు రాకుమారిని ప్రేమిస్తాడు. రాకుమారిని పెళ్లాడటానికి రాజు పెట్టిన పోటీలో అతడు గెలుస్తాడు. పేదవాడికి తన కూతురునిచ్చి పెళ్లి చెయ్యటమేమిటి అని రాజు అతడిని చంపించటానికో, మరిన్ని పరీక్షలు పెట్టి ఓడించటానికో ప్రయత్నించి విఫలమవుతాడు. పేదవాడు, రాకుమారి పెళ్లి చేసుకుని హాయిగా ఉంటారు.



## తెలివితేటలతో తండ్రిని (లేదా భర్తను) కాపాడుకునే అమ్మాయి

రాజు కొలువులోని వ్యక్తికి కఠినమైన పరీక్ష ఎదురవుతుంది. విచారంగా ఇంటికొచ్చిన తండ్రికి ఉపాయం చెప్పి కూతురు కాపాడుతుంది. బాల సాహిత్యంలో ఇటువంటి అనేక ధోరణులను పేర్కొనవచ్చు. ఒక్కొక్కసారి ఒకే కథలో రెండు మూడు ధోరణులు కలిపి ఉంటాయి. కొద్దిపాటి తేడాలతో ఇటువంటి కథలు అనేకం ఉన్నాయి.

హృదయాలను తాకటమే కాకుండా విశ్వజనీనత ఈ జానపద కథల లక్షణం. అందుకే వందల సంవత్సరాలుగా ఇవి నిలిచి ఉన్నాయి. అన్ని తరాల వారిని అలరిస్తున్నాయి. ఒకే భావాన్ని తెలిపే కథ విస్తృతిలో చాలా చిన్నగా లేదా ఎంతో పెద్దగా ఉండొచ్చు. హాస్యం, చతురత ప్రధానంగా ఉండే కథలు మనకు అనేకం ఉన్నాయి. తెనాలి రామలింగడు, బీర్బల్, ముల్లా నసీరుద్దీన్ (హొడ్జా), మర్యాద రామన్న, పరమానందయ్య శిష్యుల కథలు హాస్యం వెనక అంతర్లీనంగా ఎన్నో విషయాలను తెలియజేస్తాయి. హేతువాదం పేరుతో రాక్షసులు, దెయ్యాలు, మంత్రాలు, మహిమలు వంటివి బాల సాహిత్యంలో ఉండగూడదన్న ఒక వాదన ఉంది. అద్భుత, ఆశ్చర్యాలతో, సాహసాలతో ఉండే ఇటువంటి కథలు పిల్లలను ఎంతో ఆకట్టుకుంటాయి. సమాజంలోని మూఢనమ్మకాలకు కారణాలు వేరే. ఒక దశవరకు బాల సాహిత్యంలో ఇవన్నీ ఉండాల్సిందే. అదే విధంగా పిల్లలందరూ తమ సంస్కృతులకు సంబంధించిన పౌరాణికాలను, ఇతిహాసాలను కథలుగా చదువుకోవాలి.

## పుస్తక ప్రేమికులను చెయ్యాలి

భావ వ్యక్తీకరణలో మాట్లాడటం, చదవటం, రాయటం ముఖ్యమైనవి. ఈ నైపుణ్యాలను పెంపొందించటం బాల సాహిత్య ప్రధాన లక్ష్యంగా ఉండాలి. అందుకు అది దోహదం చెయ్యాలి. చక్కటి బొమ్మలు చిన్నపిల్లలను ఆకర్షిస్తే, ఆసక్తి, ఉత్కంఠ కలిగించే కథనం పుస్తకాల పట్ల ప్రేమను కలిగిస్తుంది.



భాష మీద పట్టు కల్పించే లక్ష్యంతో వయసుల వారీగా పదజాలాన్ని నిర్ధరించి 'గ్రేడెడ్', 'లాడర్' సిరీస్‌లుగా ఇంగ్లిషులో అనేక పుస్తకాలు ప్రచురితమయ్యాయి. తెలుగులో వయసులవారీగా పదజాలాన్ని నిర్ధరించటానికి కొన్ని ప్రయత్నాలు జరిగాయి. కానీ వాటి ఆధారంగా విస్తృతంగా బాల సాహిత్యం రాలేదు. తెలుగు భాషా స్వరూపం, ప్రాంతాల మధ్య వైవిధ్యత వంటివాటినీ పరిగణనలోకి తీసుకుని బాల సాహిత్యాన్ని రూపొందించటానికి బృహత్ సంకల్పమే కావాలి.

ఆంగ్ల భాషకున్న విస్తృతి కారణంగా బాల సాహిత్యంలో అనేక ప్రయోగాలు జరిగాయి. ఒకే కథ, నవల వివిధ వయసులవారికి అనువుగా అనేక రూపాలలో ప్రచురితమవుతాయి. పూర్తి నవలలు, అనేక సంక్షిప్తీకరణలు, బొమ్మలతో, బొమ్మలు లేకుండా ఒకే కథ అనేక పుస్తకాలుగా అందుబాటులో ఉండి పఠన సామర్థ్యాన్ని బట్టి ఎంచుకోటానికి వీలుంటుంది.



ఇంతటి ప్రయోగం తెలుగులో బహుశ ఒక్క పంచతంత్రంతోనే జరిగి ఉంటుంది. ఇటీవల పిల్లల పుస్తకాలకు పెరుగుతున్న ఆదరణ నేపథ్యంలో ఇటువంటి ప్రయోగాలు మరిన్ని జరగాలి.

పాఠ్య పుస్తకాలు తప్పించి చదవటానికి ఏమీ లేని పిల్లలకు చరిత్ర, జీవిత చరిత్రలకు సంబంధించిన అనేక పుస్తకాలు రావాలి. పాఠ్య ప్రణాళికతో సంబంధం లేకుండా విజ్ఞాన శాస్త్రం పట్ల ఆసక్తి కలిగించే పుస్తకాలు, 'సైన్స్ ఫిక్షన్'

వెలువడాలి. సాహసాలు, అద్భుతాలతో ఆధునిక బాల సాహిత్యం రావాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

ఆ మధ్య కొంత కాలంపాటు తెలుగులో పిల్లల పుస్తకాల ప్రచురణలో ఒకరకమైన స్తబ్దత ఏర్పడిందని చెప్పాలి. ప్రభుత్వ పాఠశాలల్లో చదివి ఉద్యోగ, వాణిజ్య రంగాలలోకి వెళ్లినవారి పిల్లలు ప్రైవేటు, ఆంగ్ల మాధ్యమ పాఠశాలలకు మారటం ఒక కారణమని అనిపిస్తోంది.

విద్యా వ్యాప్తి, పెరుగుతున్న ఆర్థిక స్థాయితో బాలసాహిత్య అవసరాన్ని గుర్తించటం, ప్రభుత్వ గ్రంథాలయాల, పాఠశాలల ఆదరణ, పుస్తక పఠనాన్ని ప్రోత్సహించటంలో స్వచ్ఛంద సంస్థల పాత్ర వంటివాటి కారణంగా పిల్లల పుస్తకాలకు మళ్లీ మంచి రోజులు వచ్చాయి. విశాలాంధ్ర, ప్రతిభ, నవరత్న, ప్రజాశక్తి, జన విజ్ఞాన వేదిక, మంచి పుస్తకం, పీకాక్ క్లాసిక్స్, తులిక, ప్రథం వంటి ప్రచురణ సంస్థలు ఒక్కొక్కటి వందకి తక్కువ కాకుండా బాలసాహిత్యాన్ని ప్రచురించాయి. సాంప్రదాయంగా వస్తున్న, క్లాసికల్ బాలసాహిత్యంతోపాటు ఆధునిక కాలానికి తగిన కథలు, బొమ్మలు కథలు ఎన్నో

## మహానుభూతి

అమ్మ వడ్డనవలెతెల్లు కమ్మనైన
పెరుగు గడ్డల మాదిరి ప్రీతి నిచ్చు
తలచుకొన్నంతనే మేను పులకరించు
తెలియనిది యేదొయనుభూతి కలుగు
భాష!

- దరెగోని శ్రీశైలం, అచ్చంపేట.

ప్రస్తుతం వస్తున్నాయి. పిల్లల్లో చదవాలన్న ఆసక్తి కలిగించటంతోపాటు, పఠన సామర్థ్యాన్ని కూడా పెంపొందించే విధంగా ఈ పుస్తకాలు ఉంటున్నాయి.

**ఎంపికలో వివేచన అవసరం**

పిల్లల కోసం సాధారణంగా పెద్దవాళ్లు పుస్తకాలు కొంటుంటారు. వీళ్లు ఎక్కువగా నీతి కథలు, వ్యక్తిత్వ వికాసం, విజ్ఞాన శాస్త్రం, పోటీకి పనికొచ్చే పుస్తకాలు, పాఠ్యాంశాల విషయాలలో (ప్రత్యేకించి ఆంగ్లం నేర్చుకోటానికి) ఉపయోగపడే పుస్తకాలకు మాత్రమే ప్రాధాన్యత ఇస్తుంటారు. మా ఇన్నేళ్ల అనుభవం, పరిశీలనల్లో తేలిందిదీ.. పిల్లలు వయసును బట్టి బొమ్మల పుస్తకాలు, అద్భుతాలు, సాహసాలు, మంత్ర తంత్రాలు, హాస్యం, చతురత, మంచి కథనం ఉండే పుస్తకాలను ఇష్టపడతారు.

**సామాజిక బాధ్యత**

పుస్తకాల ప్రచురణ ఒక ఎత్తు అయితే వాటిని పిల్లల దగ్గరకు చేర్చటం మరొక పని. ఈ మెట్టు కూడా అధిగమిస్తే, పిల్లల చేత ఆ పుస్తకాల్ని చదివించటం ఇంకా ఎంతో పెద్ద పని. దీనిని సామాజిక బాధ్యతగా భావించి పాఠశాలల్లో ఉపాధ్యాయులు, ఇంటిలో తల్లిదండ్రులు, ఇతరులు పూనుకోవాల్సిందే. నా అనుభవంలో మంచి కథకీ, పుస్తకానికీ మంచి స్పందన ఉంటుంది. అయితే ఒక కథను పిల్లలు ఇష్టపడంలో ఆ కథను వారికి పరిచయం చేసే వ్యక్తి పాత్ర ఎంతో కీలకం. కథలు చెప్పటం, పైకి చదవటం, చదువుకోవటం, చదివినదానిని తిరిగి సొంత మాటల్లో చెప్పటం, రాయటం, నాటకంగా వెయ్యటం వంటివి బడులలో, సమాజంలో పిల్లల పండగలుగా జరగాలి.

ఒకప్పుడు గ్రామ పంచాయితీలోని గ్రంథాలయం, సంచార గ్రంథాలయం, అద్దె గ్రంథాలయాల నుంచి పుస్తకాలను తీసుకుని చదివిన జ్ఞాపకాలు చాలా మందికి ఉండి ఉంటాయి. ప్రస్తుతం పాఠశాలల్లో గ్రంథాలయాల ఏర్పాటుకు పెద్ద ఎత్తున నిధులు కేటాయిస్తున్నారు. అయితే ఈ పుస్తకాలు అంతగా వినియోగంలోకి రావడం లేదనే ఒక విమర్శ ఉంది. పట్టణాల్లోని అపార్ట్‌మెంట్లలో, కాలనీల్లో, ఇళ్లల్లో ఔత్సాహికులు కలిసి గ్రంథాలయాలను ఏర్పాటు చేసి, పఠన బృందాలను ప్రోత్సహించాలి. ఇటువంటి కార్యక్రమాలు బాల సాహిత్యం మరింతగా రావటానికి దోహదం చేస్తాయి. వీటివల్ల ప్రచురితమైన పుస్తకాలు సద్వినియోగం అవుతాయి. పిల్లల్లో మంచి వ్యక్తిత్వం, సృజనాత్మకత పెరుగుతాయి.




















**కె.సురేష్,**
ట్రస్టీ, మంచి పుస్తకం
హైదరాబాద్.
kosaraju.suresh@gmail.com

## శాసనాలు కాదు... స్వేచ్ఛ కావాలి

భాషాభివృద్ధికి ఏం చెయ్యాలి అనటం కంటె, ప్రమాణీకరణం పేరుతో ఏం చెయ్యగూడదో తెలుసుకోటం ముఖ్యం. భాషను ఇది వరకు వాడని ఏయే రంగాల్లో ఇక ముందు వాడాలో శాసించవచ్చు గాని, ఆ భాష ఎట్లా ఉండాలో ఏ రకమైన పదాలు ఏరంగాల్లో వాడాలో ప్రభుత్వం కానీ



విద్యాసంస్థలు కానీ, అకాడెమీలు కానీ శాసించగూడదు. భాషస్వరూపాన్ని గూర్చి చేసిన శాసనాల వల్ల సహజమైన సృజనాత్మకశక్తి రచయితల్లో దెబ్బతింటుంది. సంస్కృతం వ్యవహారంలో జారిపోయి ప్రజలు వాడే ప్రాకృత భాషలు నేటి ఔత్తరాహ భాషలు కావటానికి ఇదే కారణం. గ్రాంథిక భాషాప్రాబల్యం వల్ల తొంభై ఏళ్లుగా తెలుగులో సహజ వచన రచన, కాల్పనిక సాహిత్యం పైకి రాలేదు. అధికార భాషగా తెలుగు వ్యాపించాలంటే అన్ని శాఖల్లోనూ వెంటనే తెలుగులో ఉత్తరప్రత్యుత్తరాలు జరపాలి అని ఆదేశిస్తే చాలు. ఆ తెలుగురచన ఎలా ఉండాలో, ఏ పదాలు వాడాలో నిర్ణయించటం ఇప్పుడు కర్తవ్యం కాదు. నిర్బంధం లేనప్పుడు ప్రతి వ్యక్తీ పదజాల నిర్మాణంలోనూ, రచనాసృష్టిలోనూ భాగస్వామి అవుతాడు.

***(భాష - సమాజం - సంస్కృతి - భద్రిరాజు కృష్ణమూర్తి)***

# మంత్రపుష్పం

అంగ్రేజీ కల్లోల కలలను కట్టిపడేసి
తేట తెలుగు సూర్యోదయానికి
మేలిపొద్దు పలుకుదాం.
మమ్మీ డాడీ జంటపదాల 'అంటు' చీడను తుంచి
నిలువెత్తు అమ్మ పదానికి 'అంటు' కడదాం
ఇంటి పందిరి పైకి తెలుగు తీగను ఎగబాకించి
ఊరి వాకిట పరిమళాల గుబాళింపుని గుమ్మరిద్దాం

★ ★ ★

బస్తాల కొలది పుస్తకాలను
సామానుగా వేసుకున్న ఆటోరిక్షాలు
పిల్లకాయల్ని పిప్పళ్ల బస్తాల్ని చేసి
కాన్వెంటుకి తోలుకుని పోతూ
వస్తూ పోతూ వుంటూ వుంటాయి
నవగ్రహ విగ్రహాల మాదిరి
ఆటోలో అడ్డదిడ్డంగా కూర్చున్న పిల్లదేవుళ్ళు
పుక్కిటిపట్టిన ఆంగ్లరసాన్ని కక్కుకుంటూ
వుంటారు

★ ★ ★

కావ్‌కావ్‌మంటూ చేసిన
బడి గంట శబ్దంతో
చెల్లాచెదురైన కాన్వెంటు కాకులు
అపార్ట్‌మెంట్రీ ఫ్లాట్ కొమ్మలకు చేరి
కుహూ కుహూ అంటూ పిల్ల కోకిలలై పోతారు.

★ ★ ★

రెక్కల మీద రక్కుతున్న పుస్తకాలను
నేలమీదకు జారవిడిచి
అంగ్రేజీ పదాల తప్పొప్పుల
వెతుకులాటలో పడి
సదరు తెలుగు భాషలో
కుంటు పడిపోతూ వుంటారు

★ ★ ★

ఫ్లాట్ చెట్టు గూటిన తల్లి పక్షి
పిల్లలకు బుక్కుతో ఆహారం అందిస్తూ వుంటుంది
రెమ్మలపై రెయిమ్స్‌ని వల్లివేస్తూ
నర్సరీ మణులు ఇంద్రధనస్సుని సృష్టిస్తాయి
పెన్సిల్ ముక్కుతో
అక్షరాలను నింపుకున్న నోటుపుస్తకాలు
ఆకలి తీర్చుకుని కునుకుతీస్తాయి

★ ★ ★



అన్యభాష అభ్యాసాన్ని అంతరంగాన
అచ్చతెలుగుకి అనువదించకుంటే
స్వీట్ అన్న ఆంగ్రేజీ పదంలోని
తీయదనం కోల్పోతుంది
పూర్ణాలను పూర్ణంగా ఆస్వాదించినప్పుడు
తెలుగుదనం పరిపూర్ణమై
తీయని తేనె రుచుల నేతి మిశ్రమాన్ని
నోట్లో నాలిక కవ్వం పడుతుంది
'ఎవరికి వారే యమునా తీరే' తీరు మాదిరి
నిలబడి తినే భోజనానికి నీళ్ళొదిలి
కుటుంబమంతా అన్నం ముద్దై
ప్రతీరాత్రి మాతృభాషకు
మంత్రపుష్పం అర్పిద్దాం
తెలుగు పుస్తక పఠనంతో పరుండి
తెలుగు కలలనే కందాం
అంతవరకు తెలుగులోనే మాట్లాడుకుందాం

**- వింజమూరి అచ్యుతరామయ్య,**
**యాంజాల, రంగారెడ్డి, 90009 25560**



# కమ్మతెమ్మెర

మధురాంతకం రాజారాం

అటు సన్నాయి మేళంలో వినతాసుతవాహనుడై కాంచీ వరదుడు బయల్దేరుతుండగా, ఇటు రికాబులో కాలు పెట్టి, కళ్లాన్ని బిగపట్టి, చివాలున పైకెగిరి, గుర్రంపైన కూర్చున్నాడు శేషాద్రి. మున్నెన్నడూ చేసి చూడని పని! శేషాద్రి కాస్త తబ్బిబ్బు పడిన మాట నిజం, కానీ అది తొట్రుబాటుకి సమయం కాదని శేషాద్రికి తెలుసు. వెయ్యి కళ్లు తనవైపు పరకాయించి చూస్తున్నాయి. తనలోని ప్రతి కదలికకూ ఎక్కడలేని ప్రాధాన్యం వచ్చిపడిన ఈ విచిత్ర పరిస్థితిలో తనెంత జాగ్రత్తగా ఉండగలిగితే అంత మంచిది...

సర్దుకుని చక్కగా కూర్చున్నాడు శేషాద్రి. వీలున్నంతలో ఠీవిగానే కూర్చోగలిగామన్న నమ్మకం కలిగిన తరువాత, అతడొకసారి తన చుట్టూరా కలయ పరికించాడు. ఎట్టఎదుట మేళం మోగుతోంది. ఆ మేళంలో ప్రత్యేకించి చెప్పుకోదగిన ముఖ్యాంశం డోలు. మేలుమేలు! అది డోలు కాదు- శివతాండవాన్ని చూస్తూ పరవశుడై తలాడిస్తున్న నందికేశ్వరుడి గంగడోలు! మెడలోని బంగారపు గొలుసు జిగేల్ జిగేల్మని మెరుస్తుండగా, పైకెగిరి, పాయలుగా చీలి, సుళ్లు తిరిగి రకరకాలుగా రోజుకుంటూ గిరిజాలు పున్నమనాటి సముద్ర తరంగాల్లా కల్లోల పడుతుండగా ఆ డోలు వాద్యగాడు మనసిచ్చి, లాలించి, బుజ్జగించి బుగ్గలు చుంబించి, అంతలో మూతిబిగించి, నుదురు చిట్లించి పెడముఖం పెట్టి సాధించి, చిట్టచివరకు ఉపాయాంతరం లేక దాసోహమన్నట్టుగా తలవంచి పెళ్లాన్ని ఏలుకోడంలో ఉన్న వెయ్యి ఒడుపుల్ని తన వాద్య విద్య మూలంగానే విశదీకరిస్తున్నాడు. ఒక్కుమ్మడిగా పెళ్లి కొడుకును అభిషేకించవలసిన చూపుల్ని తనవైపునకు మళ్లించుకుంటున్నందుకు డోలు వాద్యగాడిపైన కోప్పడుతూ, అతడు ముక్తాయింపులు ముగించగానే నాదస్వరాలు పైకెత్తి, శేషాద్రిని నిర్దేశించి ' అందరూ ఈ వైపు చూడాలి! ఇతడే పెళ్లికొడుకు' అని మేళగాళ్ల హెచ్చరికలు ధ్వనిస్తున్నాయి. మేళం చుట్టూ నిల్చుని సంగీత రసాస్వాదనలో ఒళ్లు మరచిన రసికులు కొందరు తమకు తలా ఒక డోలూ, నాదస్వరమూలేని కొరతను చిటికెలు వేయడం మూలంగా, తలపంకించడం మూలంగా సర్దుబాటు చేసుకుంటున్నారు. పెళ్లికుమారుడి వెనుకవైపున పట్టు చీరలు పట్టుకున్న పెద్దముత్తయిదువుల దగ్గరి నుంచీ, పరికిణీలు కట్టి ఓణీలు వేసుకున్న కన్నె పడుచుల వరకూ వివిధ వయోరూపలావణ్యాలతో ఒప్పారుతున్న తన్వంగులు ఈ ఊరేగింపు నేగాదు, ధరిత్రి చరిత్రను సైతం ముందుకు నడిపిస్తున్నది మేమేనన్నంత ధీమాతో, మత్తేభాలతో పోటీ పడుతూ, మరాళాలకు సవాళ్లు విసురుతూ అడుగులు కదిలిస్తున్నారు...

దొంగచూపులతో తన వైపోసారి చూసుకు



న్నాడు శేషాద్రి. ఫరవాలేదు! తను గూడా ఏమంత నాసిరకం పెళ్లికొడుకులా లేడు. చెంగులు జీరాడుతున్న పంచెకట్టు, మిసమిసలాడుతున్న సిల్కు లాల్చీ, కుడి భుజంపై నుంచి కిందికి తీసి ఎడమవైపున ముడివేసిన పట్టుసెల్లా, మెడలో పుష్పహారం! తనకేం, లక్షణంగా ఉన్నాడు. ఈ ఫోజులో తనను ఫొటో తీస్తే, ఆ ఫొటోలో తను పురవీధుల్లో ఊరేగుతున్న పిన్నపాళె గాడిదలా ఉంటాడు!

శేషాద్రి మళ్లీ తలపైకెత్తాడు. బారులు తీర్చి నిల్చున్న మింటి మిద్దెల మధ్య పెట్రోమాక్సులైట్ల వెల్లువల్లో పెళ్లి ఊరేగింపు పూలతెప్పలా సాగిపోతోంది.

శేషాద్రి పెదవులపైన లీలగా ఓ చిరునవ్వు తటిల్లతలా మెరిసి తటాలున మాయమైంది. ఇదేదో నడమంతరపు సిరిలా ఉంది.

కాకపోతే ఒకరోజు రాచరికంలాంటిదనుకోవచ్చు. మూడు ముళ్లుపడి ముహూర్తం ముగిసే దాకా తనకు రాజమర్యాదలు జరుగుతాయి. షోడశోపచారాలు సమకూరుతాయి. కోరితే కొండ మీద కోతైనా కిందికి దిగివస్తుంది. 'ఒరే శేషాద్రి' అంటూ చనువుగా కొందరు, 'ఇదిగో నాయనా శేషూ' అంటూ ముద్దుగా కొందరు, ఇంకా రకరకాల వావివరసలతో మరికొందరు- వీళ్లందరూ తనను పీటలపైన కూర్చోబెట్టి సంసార సామ్రాజ్యానికి యౌవరాజ్య పట్టాభిషేకం కట్టి, ఎవరి దారిన వాళ్లు చక్కా వెళ్లిపోతారు!

అంతవరకూ బాగానే ఉంది. కానీ ఆ తరువాత? అర్ధాంగి అనుకూలవతి అయితే సంసారం స్వర్గసుఖాలకు ఆవాసమవుతుంది. కానైతే అందుకు ప్రతికూలంగా జరగదని మాత్రం పూచీ ఏముంది? అందుకే మరి ఎవడో లోకజ్ఞుడు వివాహాన్ని లాటరీతో ఉపమించాడు. శేషాద్రి విషయంలో లోకోక్తి అక్షరాలా నిజమనిపిస్తుంది. ఎందుకంటే పెళ్లి చూపుల మిషతోనైనా అతడొకసారి తన జీవితంతో పాలుపంచుకోనున్న అమ్మాయిని చూసే అవకాశాన్ని కోల్పోయాడు. పార్సెలు అందచందాలను బట్టి అందులోని వస్తువు ఎలాంటిదో తెలుసుకోడానికి ప్రయత్నించడం శుద్ధ తెలివి తక్కువ అనుకున్నాడు. లౌకిక జ్ఞానానికి సంబంధించినంత వరకూ తన కంటే ఏడాకులు ఎక్కువగా చదివిన తల్లి ఈ సంబంధం పట్ల మొగ్గు చూపింది గనుక, తాను ప్రత్యేకంగా అమ్మాయిని చూడవలసిన అవసరం లేదనీ, ఆ సంబంధం తనకు ముమ్మాటికీ నచ్చినట్టేననీ నిక్కచ్చిగా తేల్చి చెప్పేశాడు.

"హవురా శేషాద్రీ! నువ్వెంతవాడి వయ్యావురా నాయనా! అంతా నా ఇష్టప్రకారమే జరిగితే ఆ తరవాత నీ పెళ్లానికి అత్త పోరుండదనే గదూ నీ పథకం!" అని విస్తుపోయింది పార్వతమ్మ.

"ఏ మరి నేను పుట్టింది ఎవరి కడుపులోనే అమ్మా!" అన్నాడు నవ్వుతూ శేషాద్రి.

సన్నాయి మేళంలో సాటిలేని రీతిగా కల నిజమై మదికెంతో హాయిగా కోరిక తీరుతుండగా జాగ్రత్తగా గుర్రం దిగి నాలుగడుగులు ముందుకు వేసిన శేషాద్రి, 'కుడికాలు, కుడికాలు' అంటూ వెనుకవైపు నుంచి వినవచ్చిన కేకను విని హఠాత్తుగా ఆగిపోయాడు. తన కుడి కాలు నొకసారి జాడించి చూసుకున్నాడు కూడా! అది పదిలంగానే ఉంది.

"అది కాదురా శేషాద్రీ! మొదట కుడి కాలు పెట్టాలి" అంటూ ఓ ముసలాయన ముందుకొచ్చాడు.

"ఓహో అదా! చంపేశావ్ బాబాయ్..." అన్నాడు శేషాద్రి.

"శుభమా అని పెళ్లి చేసుకుంటూ అదేం మాటరా నాన్నా! రక్షించావు పో అనాలి..." అన్నాడు శేషాద్రి.

ఒకటిరెండు క్షణాలపాటు ఆ మాట నిజమే కాబోలుననుకున్నాడు శేషాద్రి. సమయానికి ఆపద్బాంధవుడిలా బాబాయి హెచ్చరించాడు కాబట్టి సరిపోయింది గానీ లేకుంటే ఏమై ఉండేది? మనిషికున్నవి రెండంటే రెండే పాదాలు గనుక, వాటిలో ఏదో ఒకటి కదిలించకపోతే నడకసాగదు గనుక తను ఎడమపాదం మోపినా మోపి ఉండవచ్చు. మోపితే ఏమై ఉండేది? ఈ ప్రశ్నకు స్పష్టమైన సమాధానం లభించదు. లేదంటే అనుమానానికి జవాబుగా వెయ్యి అనుమానాలు స్ఫురిస్తాయి.

శేషాద్రికి చాదస్తాలంటే గిట్టవు. ఉదయం లేచింది మొదలు, రాత్రి పడుకునే వరకూ అడుగడుగునా ప్రతి కార్యకలాపానికీ ఎదురయ్యే మూఢ విశ్వాసాలను జాతి జీవనంలో నుంచే పెకలించి వేయాలని శేషాద్రి కలలు కనేవాడు. అవకాశం దొరికినప్పుడల్లా సభల్లో ఉపన్యసించేవాడు కూడా!

మాటలు కోటలు దాటుతాయి గానీ కాళ్లు గడపదాటవంటారు. ఆ మాట శుద్ధ అబద్ధం. ఎందుకంటే శేషాద్రి కాళ్లు గడపను దాటేశాయి. ఆ దాటడంలో ప్రయత్నపూర్వకంగానైతేనేమి అప్రయత్నంగానైతేనేమి మొట్టమొదట అతని కుడిపాదమే మామగారింటిని పావనం చేసింది.

పచ్చివాసనలు వీస్తున్న పచ్చని కొబ్బరిమట్టల పందిరి కింద నుంచి నడిచివెళ్లి, నట్టింట్లో తన కోసం పరిచిన చాపపైన కూర్చున్నాడు శేషాద్రి. పనుల తొందర మూలంగా అంతవరకూ పెళ్లి కొడుకును చూడలేకపోయిన ఆడ పెళ్లివారు ఒక్కపెట్టున శేషాద్రి చుట్టూ మూగిపోయారు. వీధిలో నుంచి పందిరి కిందికి వినవచ్చిన వాద్య ఘోష తాకిడికి, చాపలపైన పడుకుని నిద్రపోతున్న పసికుంకలు ఉలికిపడి లేచి రాగాలాపన ప్రారంభించేశారు. శేషాద్రి కూర్చున్న చోట గాలి కదలడం లేదు. కనిపించిన ప్రతి ముఖమూ కొత్తముఖం కావడంవల్లనైతేనేమి, అందరూ తన వైపు పరిశీలనగా చూస్తుండటం వల్లనైతేమి, శేషాద్రి మానసికంగా కూడా ఉక్కిరిబిక్కిరైపోసాగాడు.

నిమిషాలు దొర్లిపోతున్నాయి. అక్కడ తనెంతసేపలా నిశ్చలంగా కూర్చోవాలో శేషాద్రికి తెలిసిరావడం లేదు. ఎంతగా తను నిర్లిప్తంగా ఉండటానికి ప్రయత్నించినా సుముహూర్తం దగ్గరించిన కొద్దీ తన పని ముళ్లపైన కూర్చున్నట్టుంది. పెళ్లికూతురు కనిపించేదాకా తన పరిస్థితి ఇలాగే ఉంటుందేమో! అయినా తొందరపడి లాభమేముంది? దీక్షావిధి సాంగోపాంగంగా పరిపూర్తి అయితే కానీ ఇష్టదేవత ప్రత్యక్షం కాదు.

గడియారం చూసుకున్నాడు శేషాద్రి. పది కావస్తోంది.

పదిన్నరకల్లా భోజనాలు వడ్డించేశారు. చివరిపంక్తి లేచేసరికి పన్నెండు దాటింది.

భోజనానంతరం భుక్తాయాసమైనా తీరక మునుపే శేషాద్రిని తీసుకెళ్లి నలుగులకు కూర్చోబెట్టారు. చెంపలకూ, చేతులకూ గంధంపూసి, పన్నీటి జల్లులో ముంచి లేవనెత్తారు. చల్లచల్లగా చలిగాలి వీస్తున్న ఆ అర్ధరాత్రి సమయాన ఈ నలుగుల తతంగం శేషాద్రికేమంత సుఖావహంగా లేదు. అయినా అతడు పెదవి కదపకుండా, కదలని పెదవిపైన మందహాసం చెదరకుండా అక్కడ తన పాత్రను సక్రమంగానే నిర్వహించాడు.

చివరకు అభ్యంగనాలు కూడా ముగిశాయి. పట్టుపంచె కట్టుకుని, నడుముకు ఉత్తరీయం బిగించిన పురోహితుడు ముక్కాలి పీటపై కలశ స్థాపన చేసి వివాహ కార్యక్రమానికి నాంది వాచకాలు చదువుతున్నాడు. రాత్రంతా నిద్రలేక స్వల్పంగా ఎరుపెక్కిన కళ్లతో శేషాద్రి వెళ్లి పీటపైన కూర్చున్నాడు. సందడి చేయవలసిన కుర్రకారంతా నిద్రలో ఉండటంవల్ల పందిరి కింద వాతావరణం ప్రశాంతంగా ఉంది.

నిరీక్షణా ప్రబంధంలో అంతిమాశ్వాసంలో ఉన్న శేషాద్రికి జరుగుతున్న ప్రతి క్షణమూ తన ఓర్పును పరీక్షిస్తున్న మహా యుగంలాగానే భాసిస్తోంది.

తల వంచుకుని కుర్చున్నాడు శేషాద్రి. పందిరిలో ఏవైపు నుంచోగాని మనుషులు లేస్తున్నట్టు, లేచి ఎవరికో దారి చేస్తున్నట్టు సన్నగా అలికిడి వినవచ్చిందతనికి! తటాలున తలపైకెత్తాడు. ముత్తయిదువ ఒకరు దారి చూపుతూండగా, కన్నె పడుచు ఒక్కతె ముందుకు నడిపిస్తుండగా, పెళ్లికూతురు మెల్లమెల్లగా పీటలవైపు సాగివస్తోంది.

ఒకటి... రెండు... మూడు... శేషాద్రికి ఆ మూడు క్షణాలపాటు అనిమిషత్వం సిద్ధించింది.

ఆమె పొడుగరి కాదు. అలాగని పొట్టిగా, బొద్దుగా లేదు. రెపరెపలాడుతున్న పట్టుచీరలో ఆమె ఉత్సవానికి బయల్దేరిన దేవీ విగ్రహంలా ఉంది. శరీరచ్ఛాయ అచ్చమైన ఎరుపుగాదు, గులాబీరేకుకు మల్లే తెలుపు కలిసిన ఎరుపు. కాటుక రేఖల మధ్య అరవిచ్చుకున్న కలువపువ్వుల్లాంటి కళ్లు. ఆ కళ్లల్లో ప్రపంచమంటే ఏమిటో ఈమెకు తెలియదేమోననిపించే అమాయకత్వం! శేషాద్రి ఆశ్చర్యపడ్డాడు- లోకజ్ఞతకు కాణాచి లాంటి తన తల్లి ఏమి చూసి ఈమెను తన కోడలుగా వరించింది?

శేషాద్రి జాలిపడ్డాడు కూడా! ఈ అమ్మాయిని గనుక ఇంతకుమునుపే చూసి ఉంటే తాను ఈ పెళ్లికి సమ్మతించేవాడు కాదేమో! అందం చాలక కాదు! అద్దాల బీరువాలో పదిలంగా ఉంచుకుని కనులవిందుగా చూసి ఆనందింపదగిన అందమైన వస్తువును నేలపైకి గిరవాటెట్టడం తనకు మనస్కరించదు. బొమ్మ పెండ్లిళ్లకు పోనొల్లనని బిడియపడే బాల ఎక్కడ? రణరంగమెక్కడ? స్నిగ్ధసుందరమైన ఈ లావణ్యం గృహకృత్యాల అలజడిలో బడలిపోవడం తను చూడలేడు. అంతగాకాదూ కూడదీ అమ్మాయినే చేపట్టాలని తల్లితోబాటు తన హృదయం కూడా పట్టుపట్టి ఉంటే, అప్పుడు సైతం తను తొందరపడేవాడు గాదు. నాలుగేళ్లపాటు ఓపిక పట్టమని నచ్చజెప్పి, ఆ వ్యవధిలో కుటుంబ జీవితానికి సంబంధించిన పాఠాలను శ్రద్ధగా అధ్యయనం చేయవలసిందని తనే అమ్మాయికి సలహా ఇప్పించి ఉండేవాడు!

ఆకుల గుబురులో అణగిమణగి ఉన్న పుష్పగుచ్ఛంలా పెళ్లికూతురు పీటపైన కూర్చుంది. శేషాద్రి ఓరకంటి చూపులు బారులు కట్టిన తుమ్మెదలై ఆ కన్నెపడుచు ముఖ సౌందర్యాన్ని గ్రోలడానికి ఉరకలు వేస్తున్నాయి. శేషాద్రి తనలో తనే నవ్వుకున్నాడు- పెద్దలు చెప్పడానికేమి! వాళ్లు పెక్కు సూక్తులను నొక్కి వక్కాణించారు. వాటిలో రూపం కన్నా గుణం ప్రధానమన్నది ఒకటి! కానీ మున్ముందుగా కళ్ల ఎదుట ప్రత్యక్షమయ్యే రూపాన్ని గురించి పట్టించుకోకపోవడం మానవుడి స్వభావం గాదు. మాటాపాటా, నవ్వూనడకా, సిగ్గూ చిరుకోపములాంటి వెయ్యి హంగులున్నాయి రూపానికి! ఇన్ని దారాలు పెనవేసి పేనిన తాళ్లతో ఊగే శృంగారడోల రూప సౌందర్యం!

కాని సృష్టిలో అందమైన ప్రతిదీ అభిలషించదగినదిగా ఉండటం లేదు. చూపులకేగాని మేపులకు పనికిరాని పళ్లెన్ని లేవు! కళ్లకు కమనీయంగా కనిపించి, దగ్గరికి రాగానే ముక్కులు మూసుకోవలసిన పువ్వులెన్ని లేవు! వెయ్యి రేకుల జలజానికున్న అందంతో పోల్చిచూస్తే, మల్లెమొగ్గ ఏపాటిది? ఐతేనేం? మల్లెమొగ్గ కమ్మని తావికి కాణాచి. డాంబిక ప్రవృత్తికి నిలయం



లాంటి తామరపువ్వును తలలో పెట్టుకునేవారు లేరు. పూజావిధులకది సుతరామూ పనికిరాదు. తరుణులు తలదాల్చడానికైనా, పరమేశ్వరుడి పాదసేవకైనా ఉపకరిస్తున్నవి నిరాడంబరతకు, వినమ్రతకు నెలవులైన మల్లెమొగ్గలే! అందుకే మరి, అందచందాల కంటే ఆత్మసౌందర్యం ముఖ్యమంటారు.

గొలుసుకట్టులా సాగిపోతున్న శేషాద్రి ఆలోచనా స్రవంతి ఇక్కడ మలుపు తిరిగింది. తనను పెళ్లికొడుకును చేసి సాగనంపుతూ కళ్లనీళ్లు పెట్టుకున్న తల్లి ఆకృతి అతడి మనోఫలకంపైన నిలిచింది. కుమారుడి పెళ్లి తల్లికి ఆనందహేతువు. అయితే మంచి సంగీతంలో అపశృతిలా ఈ కన్నీరెందుకు? బహుశా కారణం ఒకటిగావచ్చు- కుమారుడి పెళ్లి కావడమంటే అతడి పట్ల తనకున్న బాధ్యతలు పెక్కింటిని తల్లి కోడలికి అప్పజెప్పడమన్న మాట! ఆ బాధ్యతల్ని కోడలు ఎంతరకూ సక్రమంగా నిర్వర్తించగలదన్న ప్రశ్నకు కాలమే జవాబు తేల్చి చెప్పవలసి ఉంటుంది. ఈ విషయానికి సంబంధించి లోకులు ఒక మాట చెబుతూంటారు. భర్త ఇంటికి రాగానే పెళ్లాం వీపు చూస్తుందట! అదే తల్లి అయితే కుమారుడి కడుపు చూస్తుందట! భార్య కన్నెప్పుడు భర్త సంపాదన మీద, తల్లికి అనుక్షణమూ కుమారుడి అవసరాల పట్ల ధ్యాస. తల్లి కుమారుడు సంతోషంగా ఉన్నాడా, లేదా అని గమనిస్తుంది. భార్య భర్త తనను సంతోషపెడుతున్నాడా లేదా అని వితర్కిస్తుంది. 'కార్యేషుదాసీ, కరణేషు మంత్రి...' అంటూ భర్తృహరి సహధర్మిణి కుండవలసిన గుణాలను ఏకరువు పెట్టాడు. ఆ లక్షణాలను మననం చేసుకున్నపుడు అనుకూల దాంపత్యం భగవంతుడు ప్రసాదించవలసిన వరమనిస్తుంది.

శేషాద్రి పరధ్యానంలో ఉండగానే పురోహితుడు ఆచారాలన్నింటినీ సాంగోపాంగంగా నిర్వర్తించి ముహూర్తమేళం కానివ్వమని కేక పెట్టాడు.

***

అప్రస్తుతమైన పరామర్శలతోనూ, అసందర్భమైన హాస్యాలతోనూ, అయాచితమైన గౌరవాలతోనూ విసుగెత్తిపోయిన శేషాద్రి ఆ రోజు సాయంత్రం కాస్త స్వేచ్ఛగా ఊపిరి పీల్చుకోడానికి వీలుగా ఊరికి దూరంగా పారిపోయాడు. ఆందోళనలకు, గందరగోళాలకు అలవాటైన శబ్ద ప్రపంచంలోకి చొచ్చుకుపోయిన కొద్దీ శేషాద్రి మనసుకు శాంతి లోపిస్తుంది. శాంతము లేక సౌఖ్యము లేదంటాడు త్యాగరాజు, శాంతం ఆయనకు సంగీతం ద్వారా లభ్యమైంది. తనకు ఏకాంతంలో లభ్యమవుతుందేమో!- నడుస్తూనడుస్తూ ఆలోచనలో పడ్డాడు శేషాద్రి... అదేం విచిత్రమోగాని, ఈ వ్యవహారిక జగత్తులో ఎలాంటి అమందానందంలోనైనా సరే, ఒక ఆవేదన అంతర్లీనమై ఉన్నట్టుంది. సంబరాలన్నింటికీ తలమానికమైన సంబరం వివాహం. సృష్ట్యాది నుంచి పరిణతినందుతూ వచ్చిన మానవ నాగరికతలో చెప్పుకోతగ్గ గొప్ప మజిలీ వివాహం. మూడు మాసాలనాడు తనకు వివాహం నిశ్చయమైంది. ఆనాటినుంచీ తన హృదయం కడుపునిండుకూ కొత్తనీటిని పెట్టుకున్న చెరువులా తెలియని ఆనందంతో దబ కలెత్తిపోతూనే ఉంది. అప్పుడప్పుడూ మానసాకాశంలో తటిల్లతలా మెరసి మాయమైపోతూ వచ్చిన తన ఊహాసుందరి, విస్పష్టమైన రూపాన్ని ధరించి తనకోసం వేచి చూస్తోందన్న భావన మదిలో మెదలిన ప్రతిసారీ హృదయవీణపైన ఆనందభైరవి రవళించినట్టు తను పరవశుడైపోయాడు. ఆ పరవశత్వం వెనుక మళ్లీ కొన్ని సందేహాలు- తన జీవితాన్ని పంచుకోనున్న ఆ అమ్మాయి ఎలాంటిది? ఎలా ఉంటుంది? తల్లి

...మెను ముత్తెమంటుంది, పగడమంటుంది. ...దిమి దీపం పెట్టవచ్చునంటుంది. స్వరూపాన్ని ...ళ్ల ఎదుట నిలపదుగానీ ఆ వర్ణన పండుగనా ...కి గానీ చేతికి రాబోని తినుబండారంలా మన ...సును ఊరిస్తుంది.

అసలు వేచి ఉండటంలోనే మోదమూ ఖేదమూ, పాలూ, నీరులా కలిసి ఉన్నాయేమో! సమాగమాన్ని గురించి తలచుకున్న కొద్దీ మోదం, ఆలస్యమనిపించిన కొద్దీ ఖేదం.

ఎలాగైతేనేం, మూడు మాసాల వ్యవధి ముగింపునకు వచ్చింది.

అయితే తన గ్రహచారం మాత్రం తనపట్ల వక్రించింది.

ఆవిడ నవ్వితే తనిప్పుడు ముత్యాలు ఏరుకోకూడదట! ఆవిడ పెదవి కదిపితే ఆ మాటల మకరందాన్ని ఆస్వాదించకూడదట! ఆ మంచి రోజు కోసం తనింకా నాలుగు రోజులు వేచి ఉండాలని ఆంక్ష విధించారు.

సంధ్యా సౌందర్యాన్ని విలోకిస్తూ ఏటి ఇసుక తిన్నెపైన కూర్చున్నాడు శేషాద్రి. ఆకసంలో మబ్బులు, గాలిలో పక్షులు, నీటి పాయలో చేపలు జంటలు జంటలుగా పరుగెడుతున్నాయి. శేషాద్రి కళ్లు మూసుకున్నాడు. ఏటి పక్కన చెట్ల గుబురులో నుంచి కొత్తగా జతకట్టిన కోయిల ఒకటి రసాలకిసలయంతో పదునెక్కిన పంచమ స్వరంతో తన ప్రియురాలిని పిలుస్తోంది. శేషాద్రి చెవులు మూసుకున్నాడు.

శేషాద్రి మళ్లీ కళ్లు తెరచి చూసేసరికి కొండలపైన నడయాడే పొగమబ్బుల్లా వెన్నెల వెలుగులు సందెచీకట్లోకి వ్యాపిస్తున్నాయి.

ఊళ్లోకి తిరిగివస్తూ మార్గమధ్యంలో దారి తప్పాడు శేషాద్రి. లేతవెన్నెల్లో పొలాలగట్ల వెంబడి ఏవో కొండగుర్తుల మూలంగా మళ్లీ దారిలోబడి అతడిల్లు చేరుకునే సరికి రాత్రి తొమ్మిది గంటలైంది. ఆ పాటికి మగపెళ్లివారందరూ భోజనాలు ముగించి తమకోసం ప్రత్యేకించిన విడిదికి వెళ్లిపోయారు. సాయంత్రం అయిదు గంటలనుంచీ కంటికి కనిపించకుండా పోయిన పెళ్లికుమారుడి కోసం ఊరు ఊరంతా గాలించిన ఆడ పెళ్లివారికి అతడి పునర్దర్శనం లభించగానే ప్రాణాలు లేచివచ్చాయి. బహుశా ఏదో నిరాదరణ జరిగి ఉంటుందనీ, అందుపైన అలక సాధించడానికి పెళ్లికుమారుడిలా మాయమై ఉంటాడనీ ఊహాగానం చేసుకున్న ఆడపెళ్లివారు, శేషాద్రి కనిపించగానే రెట్టింపు మోతాదులో వినయాలు ప్రదర్శింపసాగారు. ఈ తెచ్చికోలు వినయాల తాకిడికి తట్టుకోలేకపోయాడు శేషాద్రి. ఖాద్య పదార్థాలన్నింటినీ ఆకులోనే వదిలిపెట్టి, తొందర తొందరగా ముగించి పైకి లేచాడు. అల్లుడికి కోపం వచ్చిందని అవతలివాళ్లు భావించడానికి అతడు భోజనం చేసిన పద్ధతి కూడా కొంతవరకూ సహకరించింది.

"ఎక్కడ పడుకుంటావు బావా?" అన్నాడు బావమరిది.

"ఎక్కడైనాసరే. కానీ కొన్ని షరతులున్నాయి. మనుషులు మాట్లాడుతుంటే నాకు కన్ను మూతపడదు. చీమ చిటుక్కుమంటే మెలకువ వస్తుంది. గాలి బాగా వీస్తుండాలి. నాకు తెలిసినంతలో వసారాలో మంచం వేయిస్తే బాగుంటుంది..." అన్నాడు శేషాద్రి.

"అబ్బే, మా ఊళ్లో చలి ఎక్కువ బావా! నువ్వు నిభాయించుకోలేవు. పైగా..."

బావమరిది మాటకు అడ్డుతగిలి "ఫరవా లేదు లేవోయ్! నీకెందుకూ, నేనెలాగో సర్దుకుంటానులే" అన్నాడు చిరాకుగా శేషాద్రి.

రెండుమూడు రాత్రులుగా నిద్రలేని కారణం వల్ల పడుకోగానే నిద్ర పట్టవచ్చుననుకున్నాడు శేషాద్రి. ఆ ఆశ అడియాసే అయింది. బావమరిది మాటను బలపరుస్తూ చలిగాలి జోరుగా వీస్తోంది. అందుకు తోడుగా దోమల సంరంభం కూడా ఉద్ధృతంగా ఉంది. శేషాద్రి దుప్పటి కోసం పడకవైపు తడివి చూశాడు. తలగడను పైకెత్తి చూశాడు. మంచంపైన పరుపు మాత్రంఉంది. దుప్పటి లేదు. శేషాద్రికా క్షణాన నిజంగానే కోపం వచ్చింది.

ముసుగు బిగదన్నుకోకపోతే తనకు నిద్రపట్టదు. ఈ రాత్రికి తనకు నిద్రపట్టేయోగం రాసిపెట్టిలేదేమో! లేకుంటే తనపట్ల మితిమీరిన పరామరిక చూపెడుతున్న ఆడపెళ్లివారు దుప్పటి విషయం ఎందుకు విస్మరిస్తారు.

మడతలు విప్పి అంగవస్త్రాన్ని కప్పుకోవడానికి ప్రయత్నించాడు శేషాద్రి. కానీ ఆపాదమస్తకానికీ చాలడం లేదు. పాదాలపైకి లాక్కుంటే తల బయట ఉండిపోతోంది. తలపైకి తీసుకుంటే పాదాలు బయట ఉండిపోతున్నాయి.

ఇక చేసేది లేక కాళ్లను కడుపులోనికి తీసుకొని చేతుల్ని రొమ్ముపైన దాచుకుని, మాతృగర్భస్థ శిశువులా మంచంపైన ముడుచుకుపోయాడు శేషాద్రి.

కాలం మెల్లగా దొర్లిపోతూంది.

శేషాద్రికి మాగన్నుగా నిద్ర పట్టింది కూడా!

మగత నిద్రలో నుంచీ ఉలికిపడిన వాడిలా ఉన్నట్టుండి మేలుకున్నాడు శేషాద్రి. శరీరంపైన ఏదో మెత్తని వస్తువు పరుచుకుంటున్నట్టు ఓ స్పృహ కలిగిందతనికి! విప్పారిన శేషాద్రి కళ్లకు అంగవస్త్రపు పొరలో నుంచీ మంచం దాపున ఓ ఆకారం నిల్చుని ఉన్నట్టు లీలగా భాసించింది. ముఖంపై నుంచి బట్టను తొలగించడానికి అతడి చేతులు కదిలాయో లేదో, చలనాన్ని పసిగట్టి తన చేతుల్లోని శాలువా అంచుల్ని అలాగే శేషాద్రిపైకి వదిలిపెట్టి, మంచం దాపున నిల్చున్న ఆకారం చీకటిలోకి జారిపోసాగింది. శేషాద్రి తటాలున చేయిసాచి ఆ ఆకృతిని దగ్గరికి లాక్కోబోయాడు.

కానీ అప్పటికే ఆ నీడలాంటి ఆకారం చేయి దాటిపోయింది. శేషాద్రి చేతికి జడమాత్రం దొరికింది. ఆ జడ కూడా ఒకటి రెండు క్షణాలు గిలగిలలాడి చేతివేళ్ల మధ్య నుంచీ జారిపోయింది. జడపొడుగున గుచ్చుకున్న చేమంతుల్లో నాలుగు పువ్వులూ మాత్రం శేషాద్రికి దక్కాయి.

అరచేతిలో విరిసి నవ్వుతున్న చేమంతుల్ని చూస్తున్నాడు శేషాద్రి. చేమంతులు కావు- ఇవి నవజీవనానందానికి చిహ్నాలు! పవిత్రమైన అనురాగ బంధానికి సాక్ష్యాలు. మనసిచ్చి మనసు పుచ్చుకోగల అర్ధాంగి కోసం వరపడగా భగవంతుడు తనకిచ్చిన వరాలు!

చేమంతి పువ్వుల కమ్మని తావిలో తన్మయుడౌతూ, వెచ్చని శాలువా కింద ఒళ్లు విరుచుకున్నాడు శేషాద్రి.



**మధురాంతకం రాజారాం (1930-1999):** చిరుజీవితాల, ఘనకాంక్షల, కుటుంబ సరాగాల, సామాజిక వెంపర్లాటల ఒకనాటి మధ్యతరగతి దృశ్యాన్ని 300కు పైగా కథల్లో చిత్రించిన కలం మధురాంతకం రాజారాంది. ఆర్కే లక్ష్మణ్ 'కామన్ మాన్' ముఖంపై ఆ బిత్తర చూపు పోయి, అతను దయగా కథలు చెప్తే అవి ఇలాంటి కథలే అవుతాయి. వస్తువుతోపాటు విధానానికీ ప్రాముఖ్యత ఇచ్చిన రచయిత మధురాంతకం. రచ్చబండపై ఆత్మీయుల్ని చుట్టూ కూచోబెట్టుకుని కబుర్లు చెప్పినట్టు కథ చెప్తారు. ఆ కథల్లో చీకట్లు కూడా ప్రకాశిస్తాయి. గరుకు కోణాలూ మృదువుగా తాకుతాయి.



# పద పంచాయతీ

'తెలుగు వెలుగు' యజ్ఞంలో భాగంగా జన వ్యవహారంలోని ఆంగ్లశబ్దాలకు మంచి తెలుగు మాటలను సమకూర్చే ప్రయత్నం చేస్తోంది. ఇందులో భాషాభిమానులందరూ భాగస్వాములు కావాలన్నదే మా ఆకాంక్ష, విన్నపం. సరైన తెలుగు సమానార్థకాలు లేక ఎన్నో ఆంగ్ల శబ్దాలను యథాతథంగా వాడాల్సిన దుస్థితి. దీన్ని సరిదిద్దడంలో మీ అందరి పాత్ర కీలకం. తరచూ ప్రసార సాధనాల్లో వస్తున్న పదాలను ఇక్కడ ఇస్తున్నాం. ఇవే కాదు... మీ దృష్టిలో ఉన్న ఇతర ఆంగ్ల పదాలకూ తెలుగు సమానార్థకాలను పంపవచ్చు.

మీ సౌకర్యం కోసం వాటికి నిఘంటువుల్లోని సమానార్థకాలను, అర్థవివరణలను జోడించాం. చక్కని ప్రత్యామ్నాయ తెలుగు పదాల్ని సూచించండి. పక్కన పద వివరణ కూడా రాస్తే ఎంపికకు తేలిగ్గా ఉంటుంది. ఒకప్పుడు వాడుకలో ఉండి ఇప్పుడు వినిపించని మంచి తెలుగు మాటలైనా కావచ్చు. తెలుగులో స్థిరపడిపోయిన అన్యదేశ్యాలైనా కావచ్చు. మీరు సృష్టించిన కొత్త పదాలైనా కావచ్చు. ఏదైనా పదం వీనులవిందుగా ఉండాలి. తేలిగ్గా పలకగలగాలి. మూలశబ్దం స్ఫూర్తి ప్రతిఫలించాలి. మన నుడికారం వినిపించాలి. మక్కీకి మక్కీ అనువాదం కూడదు. కఠిన సంస్కృత శబ్దాలు జనంలోకి చొచ్చుకుపోలేవు. అందువల్ల తేటతెలుగు మాటలే పంపండి.

ఇతర ద్రావిడ భాషల్లోని సమానార్థకాలకు కొద్దిపాటి మార్పులతో తెలుగుదనాన్ని తేగలిగినా మంచి ప్రయత్నమే అవుతుంది. గత సంచికలో ఇచ్చిన పదాలకు వచ్చిన ప్రతిపాదనలనూ పక్క పేజీలో ఇచ్చాం. వాటినీ పరిశీలించి మీ అభిప్రాయాలను తెలియజేయవచ్చు.

మీ పదాలను తెలుగు వెలుగు, రామోజీ ఫిల్మ్‌సిటీ, హైదరాబాద్- 501512 చిరునామాకు పంపవచ్చు. లేదా **teluguvelugu@eenadu.net**కు మెయిల్ చేయవచ్చు.

- Abbreviation = A shortened form of a word or phrase used chiefly in writing to represent the complete form. ఒక పూర్తి పదానికి ప్రాతినిధ్యం వహించేందుకు వాడే సంక్షిప్త పదరూపం, సంకేతాక్షరం, పొడిఅక్షరం.
- Attested copy = An attested copy is a copy (often a photocopy) of a primary document, that has on it an endorsement or certificate that it is a true copy of the primary document. ఒక దస్తావేజు అసలు ప్రతికి సరైన నకలే అని అర్హత గలిగిన ప్రభుత్వాధికారి నిర్ధరించిన నకలు. ధృవీకృత, ప్రమాణీకృత ప్రతి.
- Behavioral therapy = A form of psychotherapy that uses basic learning techniques to modify maladaptive behavior patterns by substituting new responses to given stimuli for undesirable ones. మనషుల్లో ప్రవర్తనాలోపాల్ని సవరించుటపై దృష్టి పెట్టే మనస్తత్వశాస్త్ర శాఖ.
- Bidding document = Documents required to be submitted in response to an invitation to bid. These include the prescribed bid form, drawings, specifications, time lines, charts, price breakdowns, etc. కొనుగోలు/ అమ్మకాలకు ఖర్చు ప్రతిపాదనా పత్రం.
- Compatibility = Capable of existing or performing in harmonious, agreeable, or congenial combination with another or others సంబంధం, సాంగత్యం, పొందిక
- Confidential = Intended to be kept secret. రహస్య సమాచారం
- Convention center = A large civic building or group of buildings designed for conventions, industrial shows, and the like. సమావేశాలు, పారిశ్రామిక ప్రదర్శనలు మొదలగునవి జరుపుకోవటానికి అన్ని సదుపాయాలతో అందుబాటులో ఉండే పెద్ద భవనం.
- Database = A structured set of data held in a computer, esp. one that is accessible in various ways. ఒక కంప్యూటర్‌లో ఉండే సమాచార సముదాయం.
- Dating = Dating is a form of courtship consisting of social activities done by two people with the aim of each assessing the other's suitability as a partner in an intimate relationship or as a spouse. అనుబంధంలో ప్రవేశించే ముందు స్త్రీపురుషులు ఒకరి అభిప్రాయాలు మరొకరు తెలుసుకునేందుకు, పరస్పరావగాహనకు పలుమార్లు సామాజికంగా కలిసే దశ.
- Discount = A deduction from the usual cost of something, typically given for prompt or advance payment or to a special category of buyers. ఒక సరుకు అమ్మకాన్ని ప్రోత్సహించుటకు దాని మామూలు వెలను తగ్గించి నిర్ణయించిన వెల.
- Download = Copying data from one computer system to another or to a disk. ఒక కంప్యూటర్ నుంచి మరో కంప్యూటర్‌కు గాని, డిస్క్‌కు గాని సమాచారాన్ని దిగుమతి చేసుకొనే ప్రక్రియ.
- Fax = An image of a document made by electronic scanning and transmitted as data by telecommunication links. దూర ప్రాంతాల్నించి పత్రాల నకలు పొందుటకు దూరవాణికి అనుబంధంగా ఉండే సాంకేతిక పరికరం.
- Gated community = A residential area with roads that have gates to control the movement of traffic and people into and out of the area. బయటకూ లోపలకూ ట్రాఫిక్ యథేచ్ఛగా వెళ్లే వీల్లేకుండా చుట్టూ గేట్లు ఆవరించి ఉండే గృహసముదాయం

- Gift voucher = A voucher given as a present that is exchangeable for goods in certain shops. కొన్ని దుకాణాల్లో బహుమానంగా ఇచ్చే పత్రం. దీన్ని బదులిచ్చి సరుకులు తీసుకునే వీలుంటుంది.
- Guidelines = A rule or set of rules giving guidance on how to behave in a situation. మార్గదర్శకాలు.
- Informer = A person who informs on another person to the police or other authority. వ్యక్తుల గురించి పోలీసులకో, పై అధికారులకో గుప్తంగా సమాచారాన్ని అందించేవాడు.
- Help desk = Call center designed to provide users with assistance, often with computer-related or other technical issues. కొనుగోలు చేసిన వస్తువుల విషయంలో సమస్యలు ఎదుర్కొనే వినియోగదారుల సహాయార్థం సంస్థలు ఏర్పాటు చేసే సహాయ కేంద్రం.
- House keeping = Performance or management of household tasks. ఇంటి పనుల నిర్వహణ.
- Junk food = Food that has low nutritional value, typically produced in the form of packaged snacks needing little or no preparation. పోషక విలువలు లేకుండా రుచి ప్రధానంగా తయారయ్యే ఆహారం.
- Localization = To confine or restrict to a particular locality. స్థానికీకరణ
- Log in = The process of identifying oneself to a computer, usually by entering one's username and password. యూజర్‌నేమ్, పాస్‌వర్డ్‌లు ఇవ్వడం ద్వారా కంప్యూటర్ చేత గుర్తింపు పొంది ఒక వెబ్‌సైట్‌లో ప్రవేశించే ప్రక్రియ.
- Merit list = A list of students or people with high grades in exams or other achievement. మంచి స్థానాల్లో ఉత్తీర్ణత పొందిన విద్యార్థుల జాబితా
- Middle oder = In cricket, the batting order is the sequence in which batsmen play through their team's innings, there always being two batsmen taking part at any one time. Batsmen five to seven are called middle order. క్రికెట్‌లో 5 నుంచి 7 వరకు స్థానాల్లో బాటింగ్ చేసే క్రీడాకారుల వరుస.
- Net run rate = A team's net run rate is calculated by deducting from the average runs per over scored by that team throughout the competition, the average runs per over scored against that team throughout the competition. క్రికెట్‌లో ఒక జట్టు టోర్నమెంటు మొత్తంలో ప్రతీ ఓవర్‌కూ చేసిన పరుగుల సగటు నుంచి ఆ జట్టు ప్రత్యర్థి జట్లకు సమర్పించుకున్న పరుగుల సగటును తీసేస్తే వచ్చే సంఖ్య.
- Paramilitary = Of, relating to, or being a group of civilians organized in a military fashion, especially to operate in place of or assist regular army troops. అత్యవసర సమయాల్లో సాధారణ సైనికులకు సాయంగా ఉండేందుకు పౌరులతో ఏర్పాటైన సుశిక్షిత బృందం.

| | | |
|---|---|---|
| 1 | Nail polish | గోటి పసను (నెల్లూరు, చిత్తూరు సరిహద్దుల్లో వాడుకలో ఉన్న మాండలికం) |
| 2 | Market | కవరము |
| 3 | Anti Septic | చెలిబిడి (సెప్టిక్‌ను చెలిబి అంటారు. 'ఇడి' చేర్చితే చెలిబిడి అవుతుంది) |
| 4 | Demand | నిక్కచ్చు |
| 5 | Picnic | ఉరిది |
| 6 | Get together | గుమిగూడ్పు |
| 7 | Helpline | తోడూనీడా |
| 8 | Immigrant | వలసరి |
| 9 | Contractor | గుత్తేదారు. గుత్తరి అని కూడా అనొచ్చు. అలానే కౌలుదారును కౌలరి. |
| 10 | Intelligence dept | వేగెన (వేడు + ఎన) |
| 11 | Manpower | మూకచేవ (రూక చేవ అన్నా ఉండాలి. మూకచేవ అన్నా ఉండాలి) |
| 12 | Password | దాటుమాట |
| 13 | Quiz | అడకమారు |
| 14 | Paragraph | నుడుగట్లు / నుడికట్టు (నుడుగు = వాక్యం) |
| 15 | Keyboard | మీటపలక / మీటబల్ల |
| 16 | Lunch | కాపుకూడు, కాపు బువ్వ, నడిబువ్వ (టిఫిన్‌కి తొలిబువ్వ అంటాం) |
| 17 | Kerosine | మట్టినూనె, కంపుచమురు, గబ్బునూనె, రాతినూనె |
| 18 | Leak (paper) | ఉరుపు (ప్రశ్నపత్రం ఉరిపింది, ఆ విషయం ఉరిపింది) |
| 19 | Bonus | ఉలప (కృష్ణా - ఖమ్మం సరిహద్దుల్లో వాడుకలో ఉంది), ఉడుగర |
| 20 | Grand master | పెన్నేర్పరి (పెను + నేర్పరి) |
| 21 | Commissioner | చనవరి (చనవు + అరి) (చనవు = అధికారి) |
| 22 | Designer | కైసేపరి |
| 23 | Incentive | ఉసినాత |
| 24 | Board | కారెము, మండలి |
| 25 | Chairman | తలవరి (ఇక్ష్వాకులు నాగార్జున కొండ శాసనంలో వాడారు) |
| 26 | Director | పడితరి (పడితము= దారి చూపడం, నిర్దేశించడం) |
| 27 | Evacuation | తర్లిక, తర్లు, తరలు, తరలించు |
| 28 | Fresher | ఒలుగు, ఒలుగర (ఒలుగు = తాజా) |
| 29 | Hard copy | అచ్చుమొగి |
| 30 | Hall ticket | ఈగుల్లాకు, తూరుల్లాకు |
| 31 | Open Market | బయలంగడి, విచ్చలంగడి, విచ్చలు సంత |
| 32 | Package | తొట్టువ |
| 33 | Readymade | మన్నవను, మందవను |
| 23 | Reception | మన్నన, పోణిని, మన్ననిక్కు (ఇక్కు= చోటు) |
| 24 | Stock market | నిలువంగడి, నిలువసంత |
| 25 | Tariff | నిరుకు (బ్రౌన్ నిఘంటువులో ఉంది) |
| 26 | Township | ఇలిమి (ఇలు= నివాసం. 'ఇమి' క్రియాధాతువు చేర్చు), నగరీయం |
| 27 | plot | మెన |
| 28 | Venture | చేతాకు |
| 29 | Warrant | చెరకట్టడి, చెరదలిక, చెరజంపు, చెర ఉత్తర్వు |
| 30 | House arrest | ఇంటిచెర |

– ఈ పదాలను ప్రతిపాదించిన వారు స.వెం.రమేశ్

**(ఈ పదాలపై మీ సలహాలు, సూచనలు, మార్పులు చేర్పులను ప్రతిపాదించవచ్చు)**




# శతాబ్దాల క్రితం క(వి)తల పంట 'గాథాత్రిశతి'



సంస్కృత భాష పురుషకంఠంలా గంభీరంగానూ, ప్రాకృతభాష స్త్రీ కంఠంలా కోమలంగానూ ఉంటుందని పరంపరగా చెప్పుకొనేదే.

అమృతంలాంటి ప్రాకృత భాషలో హాలుడనే మరో పేరున్న శాలి వాహనుడు 'గాథాసప్తశతి'ని సంకలన గ్రంథంగా సంతరించాడు. అంతేకాదు అందులో కొన్ని ఆయనే రాశాడంటారు. గాథ అంటే కథ మాత్రమే కాదు, అది ప్రాకృతంలో ఒక వృత్తవిశేషం కూడా. విద్వత్కవి, ప్రామాణిక విమర్శకుడు రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ లోగడ 'గాథాసప్తశతీసారం' పేరిట పద్యానువాదం చేశారు.

ఇప్పుడు అష్టావధాని నరాల రామారెడ్డి ఈ 'గాథా త్రిశతి'ని సంస్కృతచ్ఛాయలు నిచ్చి సరళ సరస పద్యాల అనువాదాన్ని అందించారు. అందరికీ ఉపయోగపడేలా వ్యాఖ్యాన భావాలూ ఇచ్చారు. శతాబ్దాల గ్రామీణ వాతావరణం, కుటుంబ సంబంధాల అంశాలు, చిలుకలు, గోరింకల సంచలనాలు, రెల్లుదుబ్బులు, ఇసకమేటలు వంటివి ఎన్నో ఆయా సందర్భాలలో దర్శనమిస్తాయి. దక్కన్ పీఠభూమి చక్కని కైతల పంటల్ని పండించిందనడానికి, సుమారు పందొమ్మిది వందల యేళ్ల కిందటి ఈ గాథలు అక్షరసాక్ష్యాలు. నరాల రామారెడ్డి అనువాద సౌందర్యాలకు ఒకటి రెండు అద్దాలు:

'పచ్చి పరువపు నిగ్గులు ప్రతిఫలించు
తరుణి చిక్కని చెక్కుటద్దముల మీద
జాలువారు లావణ్యము క్రోలునట్లు
తల్లక్రిందగు కర్ణావతంసమొప్పె'

అంటే మిసమిసలాడుతున్న జవరాలి బుగ్గలపై జాలువారే లావణ్యాన్ని తలకిందుగా తాగుతున్నట్లు కర్ణావతంసం ఉందట.

'నల్ల చీరను కట్టిన నాతి అనిన
వలదు పొమ్మని మాటికి పలుకవలదు
సరససంభోగ సంరంభసమయమందు
తలగిపోవును పట్టువస్త్రమ్ము కూడ'

వంటి శృంగార భావాలే కాదు;

'బ్రదుకు స్వర్గమ్ము చేసెడి భార్యయున్న
ధనవిహీనుడైనను వాడు ధన్యజీవి-
బ్రదుకు నరకమ్ము చేసెడు భార్య ఉన్న
పృధివి సొంతమైయున్న దరిద్రుడగును'

వంటి కౌటుంబిక అంశాలూ ఉన్నాయి. మట్టిని చీల్చుకు వచ్చే పరిమళాల దేశీయత గాథా కవిత్వంలో ఇబ్బడిముబ్బడిగా ఉంటుంది. అనువాదకవి ఆత్మదర్శనానువాదం చేశారు.

'తెరపినీయక జడివాన కురియుచుండ
తివిరి జలధారలనెడి రజ్జువులగట్టి
ఇంత భూమండలమును పైకెత్తలేక
అరచుచున్నది చూడుమా అంబుధరము'

వానలో మేఘం ఎందుకు గర్జిస్తోందంటే-

ఎడతెగకుండా జడివాన కురుస్తోంది. నీటిధారలు అనే తాళ్లతో ఇంత పెద్ద భూమండలాన్ని పైకి ఎత్తలేక మేఘం అరుస్తోందట. ఎంతటి భావుకత! శతాబ్దాల క్రితం పండిన మేలిరకం పంట ఈ గాథా కవిత్వం. జుర్రుకోడానికి ఈ గ్రంథం ఓ అక్షయపాత్ర, అక్షరపాత్ర.

**ప్రతులకు:** నరాల సరోజమ్మ; 2-578, బాలాజీనగర్, ప్రొద్దుటూరు, కడప. పుటలు:152; వెల: రూ. 120లు, ఇతర దేశాలకు 10 డాలర్లు.

- స.న.శర్మ

## ఘర్షణల్లో కథాకర్షణ




రచన చేసేటప్పుడు రచయిత లోనైన సంఘర్షణ కథల్లో ప్రతిఫలిస్తుంది. ఆ కోవకి చెందిన కథల సమాహారమే...'చీకటి గీతలు'. ఈ సంపుటిలో రచయిత గవర ఈశ్వరరావు కథల కథనం వచన కవితల్ని తలపిస్తుంది. ఫలితంగా అక్షరాల వెంట కళ్లు పరుగులు పెడతాయే తప్ప పద ప్రయోగాల ఎదురు దెబ్బలు తగిలి బోర్లా పడవు. కథల్లో ప్రతిబింబించే ఇతివృత్తాలన్నీ కూడా మనం విన్నవీ, తెలుసుకున్నవీ, అనుభవించినవే అయిఉండటం చెప్పుకోవలసిన అంశం. ఆ ఇతివృత్తాలు కూడా ఏ ఉపోద్ఘాతం, వర్ణనలూ లేకుండా పాఠకులను సూటిగా కథల్లోకి లాక్కుపోతాయి. అందుకు కారణం మధ్యతరగతి జీవితాలను నలగ్గొట్టే సున్నితమైన అంశాలనే కథా వస్తువుగా రచయిత ఎంచుకోవటమే! అన్నింటికంటే ముఖ్యంగా కథలకనుగుణమైన వస్తువు, శిల్పం, భాషల త్రివేణి సంగమంలో మునకలేసే రచనా శైలి రచయిత కలం 'బలం'. 'చీకటి గీతలు' కథల సంపుటిలోని కథలన్నింటికీ జీవిత సత్యాలే ఆయువు పట్టు. వీటిల్లో ప్రతిబింబించే భావోద్వేగాల స్థాయిని పరిశీలిస్తే రచయిత పరకాయ ప్రవేశం చేసి, అంతరంగాలను అన్వేషించి అక్షరబద్ధం చేశారేమో అనిపిస్తుంది. చదివినంతసేపు కథల్లోని పాత్రల్లో మనకు తెలిసిన మనుషులే కనిపిస్తారు. వారి అపరాధ భావాలు, మానసిక క్షోభలు, వేదనలూ మనమూ అనుభవిస్తాం. ఇక కథ చివరకొచ్చేటప్పటికి ఇలాగే జరిగి తీరాలి అని నమ్మేంతగా ఆలోచనలు ఆ ముగింపు చుట్టూ బిగుసుకుపోయేలా చేయటంలో రచయిత సఫలీకృతులయ్యారనే చెప్పవచ్చు. తేలికైన పద పదార్థాల విందు భోజనంలాంటి చీకటి గీతలు కథల సంపుటి సాహితీ ప్రియులకు చక్కటి కాలక్షేపం.

(రచయిత : గవర ఈశ్వర రావు, పుటలు : 156, వెల : 100 రూ., ప్రతులకు : నవయుగ బుక్ హౌస్, 4-5-317, క్లాక్ టవర్స్ ఎదురుగా, సుల్తాన్ బజార్, హైదరాబాద్)

## వన్నెచిన్నెల పద్య సామెతలు




వాడుకతో భాష వన్నె పెరుగుతుంది. పద విన్యాసాలు, యతి ప్రాసాలంకారభూషితమైన భాష ఉపయోగించేకొద్దీ వన్నెలు చిందుతుంది. ఈ లక్షణాల మెరుగులద్దుకుని నిత్య జీవితంలో సందర్భానుసార సంభాషణలకు అక్కరకొచ్చేవే...'సామెతలు'. నేటి ఆధునిక బాలబాలికలు నేర్చుకునేందుకు వీలుగా వ్యావహారిక భాషలో మలచిన పద్య సామెతల సమాహారమే...'తెలుగు సామెతల తీయటి పద్యాలు'. ఈ పద్య సంకలనం తెలుగు భాషించే ప్రతి వ్యక్తీ సేకరించదగిన సామెతల భాండాగారం.

రచయిత: లగడపాటి భాస్కర్, పుటలు :32; వెల: రూ.5; ప్రతులకు: హరివిల్లు పబ్లికేషన్స్, శ్రీకాళహస్తి.

## బాల మనసుల్ని మాలిమి చేసే మేలు'బడులు'










ఒక తరం నుంచి మరో తరానికి వారధిగా నిలుస్తూ తెలుగు సంస్కృతిని వెలిగిస్తూ వస్తున్న జానపద సాహిత్యానికి క్రమేపీ ఆదరణ కొరవడుతోంది. ఆ ప్రభావం ఈ తరం బాలల్లో ప్రస్ఫుటమౌతోంది. ఫలితంగా వేడుకలు, పండుగలంటే వారికి...కొత్త బట్టలు, పిండి వంటలు, సినిమా పాటలే స్ఫురిస్తున్నాయి. ఈ ధోరణిని సవరించి మన ముందు తరాలకు సంప్రదాయ పరంపరను అందివ్వాల్సిన బాధ్యత మనందరిపై ఉంది. అమరావతి పబ్లికేషన్స్ ప్రచురించిన ఈ పుస్తకాలు ఆ దిశగా ఉపయోగపడతాయి.

వీటిల్లో డా.వి.ఆర్.రాసాని సేకరించిన జనబాహుళ్యంలో ప్రచారంలో ఉన్న వేడుక పాటలతో పాటు, చేసే పనిలో శ్రమను మరచిపోవటం కోసం గ్రామీణులు అల్లుకున్న పని పాటలు పిల్లలను ఎంతగానో అలరిస్తాయి. క్లిష్టమైన పదాలకు అడుగున అర్థాలు ఇచ్చారు. అలాగే ప్రాచీన శాసన పాఠాల నుంచి బాల సాహిత్యం వరకు ఎన్నో సాహిత్య ప్రక్రియలు నిర్వహించిన కీ.శే. వేటూరి ప్రభాకర శాస్త్రి సేకరించిన బాల గేయాలను కూడా 'గుడు గుడు కుంచం' పేరుతో పునర్ముద్రించారు.

మరో అమూల్య పుస్తకం... జాతిపిత మహాత్మాగాంధీ స్వీయ రచనకు కారసాని రామకృష్ణా రెడ్డి సరళానువాదం 'నా చిన్నతనంలో...'.

ప్రకాశకులు: వల్లూరు శివ ప్రసాద్; ప్రచురణ: అమరావతి పబ్లికేషన్స్, 4-21-81, చైతన్యపురి, గుంటూరు. **ప్రతులకు:** విశాలాంధ్ర బుక్‌హౌస్ (అన్ని శాఖలు)

ఈ పుస్తకంలో జాతిపిత తన జీవితానుభవాల నుంచి నేర్చుకున్న పాఠాలతో ఉన్నతమైన వ్యక్తిత్వాన్ని అలవరచుకున్న వైనం పిల్లలకు స్ఫూర్తివంతంగా నిలుస్తుంది. పిల్లల కోసం ముద్రించిన ఈ నాలుగు పుస్తకాలూ వారికి శ్రమైక జీవన సౌందర్యం, జీవిత విలువలు నేర్పేందుకు చక్కగా ఉపకరిస్తాయి.

**- గోగుమళ్ల కవిత**

## తీయ తేనెల గోరుముద్దలు..




చేదు మాత్రగా కాక తేనె చినుకులా నీతిని అందిస్తే పిల్లల మనసులు మధురంగా గ్రహిస్తాయి. ఇలాంటి ఆలోచనతో రచయిత డా.అమరవాది నీరజ పిల్లల కోసం రచించిన కథల సమాహారమే... 'తేనె చినుకులు'. పిల్లలతో పాటు మొక్కలు, జంతువులు ముఖ్య పాత్రలుగా సమకాలీన పరిస్థితుల నేపథ్యంలో నడిచే ఈ పుస్తకంలోని ప్రతీ కథ ప్రయోజనకరమే! పిల్లల్లో బుద్ధి కుశలతకు, మెరుగైన ప్రవర్తనకు తేనె చినుకులు దోహదపడుతుంది.

రచయిత: డా.అమరవాది నీరజ; పుటలు: 45; వెల: రూ.40; ప్రతులకు: బాలసాహిత్యపరిషత్, 5-5-13/బి4, వనస్థలిపురం, హైదరాబాద్-70.

## ముద్దులొలికే సరళ రాగాలు




వ్యక్తిత్వం రూపుదిద్దుకోవాలంటే బీజాలు విద్యార్థి దశలోనే నాటుకోవాలి. సత్ప్రవర్తన, జీవన నైపుణ్యాలు, విషయ పరిజ్ఞానాల పట్ల అవగాహన ఏర్పరిస్తే ఉన్నత వ్యక్తిత్వాన్ని అలవరుచుకుంటారు బాలలు. ఆ కాంక్షతో డా.వడ్డేపల్లి కృష్ణ రచించిన బాలగేయాల సంకలనమే 'చిరు గజ్జెలు'. ఈ గేయాల్లో ఒలికే అంత్య ప్రాసలు, విషయ వివరణ పిల్లల మనో వికాసానికి తోడ్పడతాయి. తెలుగు విశ్వవిద్యాలయ బాల సాహిత్యపు రచనల పోటీలో ఉత్తమ రచనగా పురస్కారాన్ని పొందిన పుస్తకం ఇది.

రచయిత: డా.వడ్డేపల్లి కృష్ణ; పుటలు: 94; వెల: రూ.35; ప్రతులకు: విశాలాంధ్ర బుక్ హౌస్ (అన్ని శాఖలు)




## పుత్తడిబొమ్మ

కన్యాశుల్కం సుడిగుండంలో ఎందరో ముక్కుపచ్చలారని ముద్దుగుమ్మల జీవితాలు గల్లంతయ్యాయి. ముసలి మగనితో మనుగడ పడుచు వధువుల మనసులను అల్లకల్లోలానికి గురిచేస్తుంది. వారి మనో వ్యధకు, కన్యాశుల్కం పర్యవసానాలకు అద్దం పట్టే గురజాడ అప్పారావు రచన... 'పూర్ణమ్మ'. ఆధునిక యుగ వైతాళికుడిగా గురజాడ సార్థక నామధేయులని చెప్పటానికి నేటికీ సమకాలీనంగా ఎంచదగ్గ ఈ పూర్ణమ్మ కథా రచనే చక్కటి ఉదాహరణ. అందమైన బొమ్మలతో పాఠకుల్ని అలరిస్తుంది.

రచయిత: గురజాడ అప్పారావు; పుటలు: 32; వెల: రూ. 21; ప్రతులకు: కావ్య పబ్లిషింగ్ హౌస్, 12-13-830/13/బి, ఫ్లాట్: 103, ఎస్.ఎస్.ఆర్. అపార్ట్‌మెంట్స్, గోకుల్ నగర్, తార్నాక, సికింద్రాబాద్ - 17.




## వందే కృష్ణం.. జగద్గురుం

భారతీయ సాహిత్యంలో పురాణేతిహాసాలు ధార్మిక గ్రంథాలు. వ్యాస విరచితాలు అష్టాదశ పురాణాలు. అందులో భాగవతం ఒకటి. సంస్కృత మూలాన్ని తెనిగించిన భక్త కవి పోతన. అది పదిహేనో శతాబ్దం. శైవ వైష్ణవుల మధ్య దురావేశాలు ప్రజ్వరిల్లుతున్న కాలం. శైవుల వంశంలో జన్మించి, వైష్ణవాన్ని స్వీకరించిన మతసంస్కారి పోతన. శ్రీకృష్ణతత్త్వం అద్వైతమూర్తిస్థితమని నిరూపిస్తూ 'వందే కృష్ణం' గ్రంథాన్ని కె.వి.కృష్ణకుమారి రచించారు. 'శ్రీకృష్ణ పరమాత్మ భూమి మీదకు అవతరించక ముందే సాక్షాత్తు శంకరుడే మురళిగా మారి శ్రీకృష్ణుని కరకమలాలను అలంకరించాడని' కృష్ణోపనిషత్ చెప్పిన విషయం గుర్తుచేశారు రచయిత్రి.

చయిత్రి: డా॥ కె.వి.కృష్ణకుమారి; పుటలు: 248; 100; ప్రచురణ: సాహితీ ప్రచురణలు, 29-13-53, కాళేశ్వరరావు రోడ్డు. విజయవాడ.

'తానూదిన ఊపిరులు సమ్మోహనాస్త్రాలు, తానాపితే అవి రుద్రభూమికి ఆహ్వానాలు, అందుకని ఆ మురళి శివాంశ సంభూతమైన మురళి' అని రచయిత్రి చేసిన వర్ణన హరిహరుల అభేదాన్ని మళ్లీ రూఢిచేసింది. మురళిదీ, శుకమహర్షిదీ శివాంశేనని కృష్ణకుమారి చెప్పిన సన్నివేశాలు పాఠకులకు విశేషానుభూతుల్ని కలిగిస్తాయి. 'ఊపిరి ఊదుతుంటే ఆ నాదరవళి చైతన్య తేజం. ఆ ఊపిరి క్షణకాలం ఆపితే అంతా నిశ్శబ్దం. సర్వం శూన్యం. ఇది సృష్టి, స్థితి, లయల సంకేతం' అని వర్ణిస్తూ భక్త్యావేశాన్ని 'వందే కృష్ణం'లో వ్యక్తపరిచారు. భాగవతం దశమస్కంధంలో కొన్ని కథలతోపాటు అంధుడైనా ధ్యానంలోనూ, ధ్యాసలోనూ కృష్ణుని దర్శించగల సూరదాసు చరిత్రను, అసురి మహర్షి కథను, విరజాదేవి విరహాన్ని వివరించిన తీరు మధురభక్తి భావనలు కలిగిస్తాయి. ఇటువంటి కథలు ఈ గ్రంథంలో అనేకం. ఆధ్యాత్మిక సాహిత్యాన్ని ప్రేమించేవారు చదవాల్సిన గ్రంథమిది.

**-ఎం.ఆర్.జె.శర్మ**

## తెలుగు వారికి పంచిన ఆస్తి

వందల ఏళ్ల నాడు వేమన తన శతకాల్లో విశ్లేషించిన సామాజిక పరిస్థితులు, బోధించిన జీవన సత్యాలు, వ్యక్తిత్వ విలువలు ఇప్పటికీ వర్తిస్తున్నాయంటే ఆయనలో ఉన్న దార్శనికతే కారణం. అదీ అచ్చ తెనుగులో కావడంతో వేమన శతకాలు తెలుగు జాతి ఆస్తిగా నిలిచాయి. వాటిని భావితరాలకు అందించేందుకు చాలా చాలా పుస్తకాలు వచ్చాయి. వస్తున్నాయి. ఆ కోవలోనిదే డా. ఎన్. గోపి రాసిన 'వేమన్న వెలుగులు'. ఈ పుస్తకంలో పొందు పరచిన 428 పద్యాల్లో ఒక్కోటీ ఒక్కో కోణంలో విలువల్ని నేర్పుతుంది. ముఖ్యంగా అప్పటి సామాజిక, ఆర్థిక, చారిత్రక పరిస్థితుల్ని వివరిస్తూనే అన్ని తరాలకూ పనికొచ్చే విలువల్ని, సంప్రదాయాల్ని, సంస్కారాల్నీ, మనదైన తెలుగునూ, తెలుగుదనాన్నీ విశదపరుస్తుంది. వ్యక్తిత్వ వికాసాన్నీ నేర్పుతాయి. ఒడయుడు (పరబ్రహ్మం), చనువెరుగు (సమయాసమయాల్ని తెలుసుకోవడం), మొనసి (పూనుకొని), మరువు (చక్కదనం, విలాసం, కాంతి, సంతోషం) ఏపు (ఎక్కువ కావడం, అతిశయించడం), ఓడు (రంధ్రం, పగులు), ఎగ్గు (హాని, కీడు), రోయు (అసహ్యం)... ఇలా చెప్పుకుంటూ వెళ్తే వందల తెలుగు పదాలు మనల్ని ఆశ్చర్యచకితుల్ని చేస్తాయి. మన పద సంపద ఇదీ అని అబ్బురపరుస్తాయి. "బండ అనే కులం ఉంది. వారు బిచ్చమెత్తడం వృత్తిగా జీవించేవారు. ఎవరైనా బిచ్చం ఇవ్వకపోతే బూతులు తిట్టేవారు. అలానే వచ్చిందే 'బండబూతులు' పదం". ఇలా ఆశ్చర్యపరిచే విశేషాలు ఈ పుస్తకంలో ఎన్నెన్నో. పనిలో పనిగా దేశీపదాలు, వాటికి ఆయాభాషల్లో అర్థాలు, వాటికి తెలుగు సమానార్థకాలు... ఇలా చాలా విషయాల్ని వ్యాఖ్యానంలో జోడించారు. వేమన్న పద్యం, తాత్పర్యం చెప్పడం వరకూ చాలా మంది చేశారు. వారెవరూ చేయని పని చేశారు, ఎవరూ విశ్లేషించని కోణంలో విశ్లేషించారు. కాబట్టే 'వేమన్న వెలుగులు' పుస్తకం ప్రతి తెలుగు ఇంటా ఉండాల్సిన జాబితాలో చేర్చుకోదగింది. వేమన పద్యాల్ని సేకరించి రాసిన కార్డుల దారుపేటికను చూపుతూ 'నేను నీకు మిగిల్చిన ఆస్తి ఇదే' అని మా ఆవిడతో చమత్కరిస్తూంటాను అని ముందుమాటలో డా. గోపి చెప్పారు. అది నిజం కాదు! ఎందుకంటే ఆ ఆస్తిలో కొంత భాగం తెలుగు వారికి ఈ పుస్తకం ద్వారా పంచేశారు. మిగిలింది ఎప్పుడు పంచుతారో అని 'వేమన్న వెలుగులు' చదివిన ప్రతి ఒక్కరూ ఎదురు చూస్తారు.

**- హర్షిత్**

**ప్రచురణ:** శాంతా - వసంత ట్రస్టు, **వెల:** రూ. 250, పుటలు: 500, ప్రతులకు: ఎన్. అరుణ, 13-1/5బి, శ్రీనివాసపురం, రామంతాపూర్, హైదరాబాద్, 04027037585

# పద్యానికి గండపెండేరం




రచన:
డా॥పాపినేని శివశంకర్,
పుటలు:368, వెల: 250
ప్రచురణ: అమరావతి
పబ్లికేషన్స్, గుంటూరు.
ప్రతులకు:
అన్ని విశాలాంధ్ర
పుస్తక కేంద్రాల్లో

పద్యం పాతచింతకాయ పచ్చడి అని కొందరు ఆధునికుల భావన. వీళ్లు సవాలక్ష కారణాలు చూపి ప్రాచీన సాహిత్యాన్ని అధ్యయనం చేయడం మానేశారు. పద్యానికి ప్రాగ్వైభవం తేవాలని కొందరి ఆరాటం. వీరు పద్యోద్యమం గురించి కలలు కంటూ వుంటారు. అటువంటి వ్యక్తుల్లో ఒకరు పాపినేని శివశంకర్. ఆయన నన్నయ దగ్గర్నుంచి జాషువా వరకు అరవై మందికి పైగా కవుల నూటపది పద్యాల్ని ఎంపిక చేసి, ఆధునిక అవసరాలకు తగ్గట్టుగా విశ్లేషించిన ప్రయోగం 'తల్లీ నిన్నుదలంచి'. వ్యాఖ్యాతగా కవిత్రయం, శ్రీనాథుడు, పోతన, రాయలు, అష్టదిగ్గజాలవంటి మార్గకవుల కవిత్వంతో పాటు పాల్కురికి సోమన, బుద్ధారెడ్డి, తాళ్లపాక తిమ్మక్క వంటి ద్విపదకవుల, అన్నమయ్య, క్షేత్రయ్య, త్యాగయ్య, రామదాసు, వీరబ్రహ్మం వంటి పదకవుల, తత్వకవుల దేశీ కవిత్వాన్ని బద్దెన, మారన, వేమన, చౌడప్ప, గువ్వల చెన్న వంటి శతక కవుల సామాజిక నివేదనని అధ్యయనం చేయాలని పాపినేని బలంగా విశ్వసించాడు. అంతేకాదు ప్రసిద్ధమైన చాటు - చమత్కార పద్యాల్ని కూడా స్వీకరించాడు. దాంతో ఈ వ్యాఖ్యాన గ్రంథంలోని పద్యాల ఎంపికలో వైవిధ్యం కనిపిస్తుంది.

పద్య పరిచయం నెపంతో తెలుగు భాషా సంస్కృతులకు దూరమవుతోన్న కొత్త తరానికి ప్రాచీన సాహిత్యంలోని సౌందర్యాన్ని ఎత్తి చూపడం వరకే పరిమితం కాకుండా ఆనాటి నైతిక - సాంస్కృతిక విలువల్ని పునర్మూల్యాంకనం చేయడానికి ఒక అధ్యాపకుడిగా ముందు కొచ్చాడు పాపినేని. సమకాలీన సందర్భం నుంచి పద్యాల్ని వివరించడం వల్ల వ్యాఖ్యానం చక్కటి వ్యక్తిత్వ వికాస పాఠంలా రూపొందింది. దైవీయ భావన, భూస్వామ్య రాచరిక భావజాలం, సామాజిక చలనాన్ని పట్టించుకోకపోవడం వంటి పరిమితులు ప్రాచీన సాహిత్యంలో ఉన్నాయన్న వాస్తవాన్ని గుర్తిస్తూనే స్వీయ ప్రాపంచిక దృక్పథాన్ని ప్రకటించడంలో ఎక్కడా రాజీ పడలేదు. ఖడ్గ తిక్కనతో చానమ్మ సహగమనాన్ని (చాటువు పే.84), ద్రోణుడి కపట గురుత్వాన్ని (ఏకలవ్యం పే.38), ప్రబంధ కవుల భోగ లాలసతని, స్త్రీల వ్యక్తిత్వాన్ని కించపరిచే పెద తలపుల్ని (భాస్కర శతకం పే.262) నిర్ద్వంద్వంగా తిరస్కరించడంలో ఏమాత్రం తడబడలేదు. ఆ కృషికి కొనసాగింపే ఈ వ్యాఖ్య.

పద్యంలోని సౌందర్యాన్ని వెలార్చడంతో పాటు కవి జీవితాన్ని, కవిత్వ ప్రతిభని, కావ్య తత్త్వాన్ని ఆ కాలాల్లో ఉన్న కవితా సంప్రదాయాల్ని, సాహిత్య దృక్పథాల్ని కూడా సూక్ష్మంగా వివేచిస్తాడు. కవుల ఆయా గ్రంథాలపై ఇంతకు ముందు వచ్చిన వ్యాఖ్యలని, ప్రసిద్ధ విమర్శకుల, సాహిత్య చరిత్రకారుల అభిప్రాయాల్ని పరామర్శిస్తూ వాటిలోని మంచి చెడ్డలను సమీక్షించడం ద్వారా ఈ వ్యాఖ్యానానికి నిండుదనం లభించింది.

అనేక సందర్భాల్లో పాపినేని లోని లోతైన పరిశోధన పటిమ, నిరంతర అధ్యయన ప్రవచనాల ద్వారా సాధించిన ప్రతిభ వ్యాఖ్యానం సమగ్రంగా రూపొందడానికి దోహదం చేశాయి. శ్రీనాథుడి కాశీఖండంలోని అరుణోదయ వర్ణనని సంస్కృతంలో ఉన్న మయూరుడి సూర్య శతకంతో పోల్చి చూడటంతో ఆగిపోక తెలుగు జానపద గేయాన్ని దానికి పోటీగా నిలబెట్టి మరీ చూపుతాడు. తిక్కన, పాపరాజుల ఉత్తర రామాయణాల్లోని సీతా పరిత్యాగ ఘట్టాల్ని పక్క పక్కన పెట్టి బేరీజు వేసి మన ముందుంచాడు. అన్నమయ్య సంకీర్తనల్లోని తెలుగు పలుకుబళ్ళను ఏరి కుప్పలు పోసినపుడు, ముద్దుపళని రాధికాసాంత్వనంపై నిషేధ విశేషాల్ని తవ్విపోసినపుడు, గురజాడ ముత్యాలసరం మూలాల్ని విష్ణుమాయావిలాసంలో చూపినపుడు, తన వ్యాఖ్యానాలతో ఆకట్టుకుంటాడు. అంతేకాదు ఈ అన్ని సందర్భాల్లో పాపినేని తన ఆధునిక వ్యాఖ్యాన పద్ధతికి ఈ గ్రంథం ద్వారా కొత్త ఒరవడిని ఏర్పరచాడు. ఇంత పాండిత్య స్ఫోరకంగా ఉన్నప్పటికీ ఈ వ్యాఖ్యానం ఎక్కడా విసుగు పుట్టించదు. ప్రజల నోళ్లలో నానిన రచనంతో వ్యాఖ్యానాన్ని జనరంజకం కూడా చేస్తాయి.

అందాల తెలుగు పద్యాలలో వెలుగుల్ని ఆహ్లాదకరంగా ఆవిష్కరించిన 'తల్లీ నిన్నుదలంచి' గ్రంథం ప్రాచీన భాషా సాహిత్యాల విశిష్టతని ఒకచోట సమగ్రంగా దర్శించడానికి తెలుగు భాష అభిమానులకు, అధ్యాపకులకు, సాహిత్య విద్యార్థులకు అఖండ దీపంలా ఉపయోగపడుతుందని చెప్పడం అతిశయోక్తి కాదు. కొత్త పాతల మేలుకలయికగా అటు సంప్రదాయకాముకుల్నీ ఇటు ప్రగతి గాముల్ని ఏకకాలంలో మెప్పించగల యీ గ్రంథం పద్య పాదానికి పాపినేని శివశంకర్ తొడిగిన గండపెండేరం. అది ఒక చారిత్రక పత్రం.

**- డా.ఎ.కె.ప్రభాకర్**

# తెలంగాణ ఆణిముత్యాలు




కోటి రతనాల వీణ తెలంగాణలో కోటి భావాలు పలికే సాహిత్యకారులూ ఉన్నారని చెప్పే ఓ పెద్ద ప్రయత్నం చేశారు. 'తెలంగాణ ఆణిముత్యాలు' అనే చిన్న పుస్తకంతో డా॥బి.దామోదరరావు నేటి కవులనే కాక తెలంగాణ ప్రాంతీయులైన పూర్వ కవుల తరం ఆణిముత్యాల వరుసను ఈ పుస్తకంలో పేర్చారు. చూడటానికి చిన్న పుస్తకమే అయినా తెలంగాణ గురించి, తెలంగాణ ముద్దుబిడ్డల గురించి పాత కొత్త విషయాలనేకం తెలియజెప్పే మంచి పుస్తకం.

కవి: డా॥ బి.దామోదరరావు 'తెలంగాణ ఆణిముత్యాలు'; వెల 60/- ప్రతులకు:- అహల్య సుందర నిలయం, ఇ.నెం. 8-2-379, భరత్‌నగర్, శివాలయం దగ్గర, కరీంనగర్.

# తెలుగులో చదివితే

# నేరమా..!



అమ్మానాన్న ఆశల బరువు మోస మానసికంగా చితికిపోతున్న నేటిత పిల్లల హృదయఘోష.

మునీత తండ్రి బ్రహ్మయ్య సాధ రణ భవన నిర్మాణ కార్మికుడు. పే కుటుంబం. కూలిపనికి వెళ్లని నాడు ఖా కడుపులతో పడుకోవాల్సిన దుస్థితి. ఏకై సంతానం మునీతే. ఉన్నంతలో అమ్మాయికి ఏ లోటూ చేయలేదు. పదో తరగతి వరకు ఆ పాప ఊళ్లో ప్రభుత్వ పాఠశాలలోనే చదువుకుంది. మంచి మార్కులతో ఉత్తీర్ణురాలైంది.

'నా కూతురు పెద్ద చదువులు చదవాలి. అమెరికా వెళ్లాలి. పెద్ద ఉద్యోగాలు చేయాలి. అందరూ గొప్పగా చెప్పుకోవాలి' ఇదీ బ్రహ్మయ్య కల. ఆంగ్ల చదువులతోనే అది నెరవేరుతుందన్న నమ్మకం. తన చుట్టూ ఉన్న వాతావరణాన్ని చూసే ఆయన ఆ అభిప్రాయానికి వచ్చి ఉంటారు.

కష్టం చేసి కూడబెట్టిన డబ్బుతో మునీతను గుంటూరులోని ఒక ప్రైవేటు కళాశాలలో చేర్పించారు. అక్కడే వసతి గృహంలో ఉంచారు.

కానీ... ఆ అమ్మాయికి అమ్మభాషలోనే చదువుకోవాలని కోరిక. ఇంటర్మీడియట్‌లో సాంఘిక శాస్త్ర విభాగంలో చేరాలన్నది ఆశ. తండ్రి వినిపించుకోలేదు. ఎంపీసీ చదవాల్సిందేనన్నారు. అదీ ఆంగ్ల మాధ్యమంలో.

మునీతకు గణితం వంటబట్టేది కాదు. ఆంగ్లంలో పాఠాలు అర్థమయ్యేవి కావు. తోటి విద్యార్థులతో పోటీ పడటం కష్టంగా మారింది. చదువు మానేసి ఇంటికి వచ్చేస్తానని తండ్రితో గట్టిగా చెప్పే ధైర్యం చేయలేకపోయింది. తీవ్ర మానసిక వేదనకు గురైంది. చివరికి ఆ ఒత్తిడికి తట్టుకోలేక మరణ శాసనం రాసుకుంది. కళాశాల భవనం పై నుంచి దూకి ప్రాణాలు తీసుకుంది.

ఎన్నో వేల మంది గ్రామీణ విద్యార్థినీ విద్యార్థులు ఇలాగే ఆంగ్ల మాధ్యమంలో నలిగిపోతున్నారు. అమ్మానాన్నల ఆశల బరువులను మోస్తూ... మోస్తూ అలసిపోతున్నారు. అర్థం చేసుకోగలమా వారిని? ఈ మునీతను చూసైనా! మా ఆయుష్షు పోసుకుని నిండా నూరేళ్లు వర్థిల్లమని దీవిస్తామే... మరి వారి ఆయువుకు గండమెందుకు అవుతున్నాం?

తలవంచుకుని వెళ్లిపోయావా తల్లీ
వెక్కివెక్కి ఏడుస్తూ వెళ్లిపోయావా చెల్లీ
సెలవంటూ తెలుగు జాతిని వదిలి!

ఎన్ని కలలు నీ చుట్టూ పోగేసుకున్నావో
అన్నిటినీ తన్నేశావ్
మూడో అంతస్తు నుంచి దూకేశావ్!

అటుపోతే, ఇటుపోతే అంతా ఆంగ్లం
అమ్మభాషలో అక్షరాభ్యాసం అమ్మానాన్నలకే అసహ్యం
అర్థమైనా కాకున్నా అన్యభాషలో చదువులు
మార్కుల వేటలో పరుగులు

ఆ ఒత్తిడే నిన్ను మింగేసిందా తల్లీ!

నీది ఆత్మహత్య కాదమ్మా... హత్య!
తెలుగును తెగులనుకుంటున్న వారందరూ కలిసి చేసిన హత్య!

'ఆంగ్ల మాధ్యమంలో పాఠాలు సరిగా అర్థమయ్యేవికావు. మళ్లీ అడగాలంటే భయం. చదివింది గుర్తుండేది కాదు. పాస్ మార్కుల కంటే ఎక్కువ సాధించడం కష్టమనిపించేది. తెలుగు మాధ్యమంలో చేర్పించమని నాన్నను అడిగితే వద్దంటూ చీవాట్లు పెట్టారు. చదివింది పరీక్షల్లో గుర్తుండటం లేదని నాన్నతో చెప్పి కళాశాల నుంచి ఇంటికి తీసుకెళ్లమని కోరా. అయినా ఆయన పట్టించుకోలేదు. ఇక ఆత్మహత్యే శరణ్యమని భావించా. చనిపోయిన తర్వాత తిట్టేవారు ఎవరూ ఉండరు. చదవమని ఒత్తిడి చేయరు. భగవంతుడి దగ్గర సంతోషంగా ఉండవచ్చు.'

ఇది... ప్రకాశం జిల్లా పంగులూరు మండలంలోని చందలూరుకు చెందిన విద్యార్థిని మునీత ఆత్మహత్య చేసుకునే ముందు రాసిన లేఖ.

**సహకారం: జె. కళ్యాణ్ బాబు,**
**డిప్యూటీ చీఫ్ రిపోర్టర్, గుంటూరు**

## పిల్లల పాలిట శాపం!

తేనెలొలికే తెలుగు... ముత్యాల సరాల తెలుగు... ఈ తరానికి చేదుగా మారుతోందా...! ఆంగ్ల మాధ్యమంలో చదివితేనే తప్ప భవిష్యత్తు ఉండదా..! పొరుగు రాష్ట్రాలు ప్రాథమిక విద్య నుంచీ మాతృభాషలో బోధనకు పట్టం కడుతుంటే మనం మాత్రం తెలుగుని ఎందుకు తూష్ణీభావంతో చూస్తున్నాం? తప్పు ఎక్కడ ఉంది? వ్యవస్థలోనా? తల్లిదండ్రుల్లోనా? ఇవన్నీ ప్రస్తుతం భాషాభిమానుల్ని వేధిస్తున్న ప్రశ్నలు. "తెలుగు మాధ్యమంలో చదివిన వాళ్లు ఎందుకూ పనికి రాకుండా పోతారు. ఉద్యోగాలు రావాలంటే, ఉన్నత- స్థానాలకు వెళ్లాలంటే ఆంగ్ల మాధ్యమంలోనే చదవాలి"- పల్లెపట్టుల్లో ఉండే ఒక సాధారణ రోజువారీ కార్మికుడి నుంచి, మహానగరాల్లో ఉన్నతోద్యోగాల్లో ఉన్న వారి వరకు ప్రతి ఒక్కరిలో ఇలాంటి భావనే బలంగా నాటుకుపోయింది. అది చివరకు పిల్లల పాలిట శాపంగా మారుతోంది.

KLVA102M267



180



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA102M267 |
| పుస్తకం పేరు | తెలుగు వెలుగు |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Priyanka |
| పేజీలు విడదీసినది | Priyanka |
| స్కాన్ చేసినది | Afsar |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |